

శ్రీశ్రీశ్రీ వీరబ్రహ్మేంద్రస్వామివారి

# కాలజ్ఞానము



రచన

అరసవల్లి విశ్వనాథబాబు



ఋషి బుక్ హౌస్

14-11-14/1, అచ్యుతరామయ్య వీధి,
హనుమాన్‌పేట, విజయవాడ-520 003.



SRI SRI SRI VEERABRAHMENDRASWAMIVARI

# KALAGNANAM

by Arasavallli Viswanadha Babu

*First Edition*
December, 2001

Cover Design
N.V. Ramana

*D.T.P. at*
Viswa Digital,
Vijayawada - 3.

*Printed at*
Swamy Offset Printers,
Vijayawada - 3.

*Price*
Rs. **25-00**

*Published by :*

rushi book house

14-11-14/1, Atchutarama'ah Street,
Hanumanpet, VIJAYAWADA - 520 003.
Phone : 0866 - 579190



**శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామియే నమః**

# కాలజ్ఞానము

"అక్షయః కాలః"- అంతులేని- కాలముగా అనుచున్నానని భగవద్గీతయందలి 10వ అధ్యాయము 33వ శ్లోకంలో శ్రీ కృష్ణపరమాత్ముడు చెప్పియున్నాడు.

"నేను తేజోమయుడైన సూర్యుణ్ణి, నక్షత్రాదులతో చంద్రుణ్ణి" అని భగవద్గీత 10వ అధ్యాయం 2వ శ్లోకంలో చెప్పినారు.

బృహదారణ్యకోపనిషత్‌లో "ఓం" అనే ప్రణవంచేత, భూతకాలం, వర్తమానకాలం, భవిష్యకాలం అన్నీ కూర్చబడి వున్నాయని వివరించబడి వున్నది

ఇందువలన మనకు తెలిసేదేమిటంటే, భగవంతుడు కాలస్వరూపుడు కాలాన్ని నిర్ణయించగలిగిన శక్తి స్వరూపుడు ఆ శక్తి స్వరూపుడే మానవులకు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు కూడా జీవకాలాన్ని నిర్ణయించాడు. మానవునికి ఆయువు నూటయిరవై సంవత్సరాలని, దేవతలకు యిన్నీ యుగాలని, యిన్ని కల్పాలనీ నిర్ణయించాడు ఈ నిర్ణయం కాలాన్ని సూచిస్తూనే వున్నది. కాలం అనేది దానంతట అదే గడచి పోతుంటుంది. ఆ కాలాన్ని నిర్ణయించగలిగేది, నియంత్రించగలిగేది ఒక్క ఆ శక్తి స్వరూపుడే. ఈ కాలంతో మిళితమై అనేక విషయాలు జరిగిపోతుంటాయి. ఈ విషయాలలో ముఖ్యమైనవి, ప్రాముఖ్యత లేనివి ఎన్నో మిళితమయి వుంటాయి,

జ్ఞానులయిన మహర్షులు ఎప్పుడు ఏమి జరుగబోవుచున్నదో, ఏ కాలము ఎటుల జరుగునో వివరంగా నిర్ణయించగలిగారు. వ్యాసభగవ్వానుడు, వాల్మీకిమహర్షి వంటి మహాయోగులు, భారత, రామాయణాలను రచించి, ముందు- ముందు జరుగబోవు విషయములను కళ్ళకు కట్టినట్లు వివరించారు. వారు వ్రాసినవి వ్రాసినట్లు మనకు అందినవో లేదో తెలియదుకానీ, వారు ఆయా యుగాలకు ముందే ఆ రచనలు మనకు అందించారు వారు వ్రాసిన ప్రధానాంశాలలో క్రమేణా అనేక మార్పులు చేర్పులు రావడం మనకు తెలుసు.

ఇదే విధంగా శ్రీ మద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి వారిచే రచించబడిన కాలజ్ఞానం కూడా ఎన్నిమార్పులు చేర్పులకు లోనయిందో అనేటటువంటి అనుమానం

కలుగక మానదు వీరు కాలజ్ఞానం వ్రాయడం మొదలు పెట్టుసరికి తాళపత్రములు లభ్యమయినవని తెలియును. అదికూడా వారు స్వయంగా తామే స్వహస్తాలతో లిఖించినవి అవటంవలన, వారిచే వ్రాతలో వున్నవి వరకే అసలయినవని ధృవీకరించ వచ్చును. ఏవైనా ప్రక్షిప్తాలున్నయెడల వాటిని తొలగించుకోగల పరిస్థితి యీ విషయమున మనకు కనపడును.

బ్రహ్మంగార్రు రచించిన కాలజ్ఞానం పేరు వారే చెప్పారు. "సాంద్ర సింధువేదం" అని దీనికి నామకరణం. కానీ యిందు కనీసం ముప్పాతిక భాగం బనగానిపల్లెలో భూస్థాపితంచేసి, దానిపై ఒక చింతచెట్టు నాటడం జరిగింది. యిప్పుడు మనకు లభించేది ఒక వంతు మాత్రమే ఈ విధంగా జరగటానికి కారణం ఆలోచిస్తే, అది అంతుపట్టనిది. వారు ఎందుకు మూడువంతులకు పైగా నిక్షిప్తం చేశారో తెలియదు. బహుశా వారు శ్రీ వీరభోగవసంతరాయలుగా అవతరించిన తరువాత వాటిని వెలికి తీయడం జరుగుతుందేమో. బ్రహ్మంగారు కులమతాలకు అతీతంగా ప్రవర్తించారన టానికి పెక్కు ఆధారాలు నేటికీ వున్నాయి. సర్వమత సామర్థ్యాన్ని వీరు పాటించారు 'నా భక్తులను కలిపాపంనుండి నేను రక్షిస్తాను. నన్ను నమ్మండి' అని చాలాసార్లు చెప్పారు.

అసలీ "సాంద్ర సింధువేదం" అనే కాలజ్ఞానాన్ని శ్రీ బ్రహ్మంగారు వ్రాయడానికి కారణం ఆలోచిస్తే, పూర్తిగా మనకు అందించకుండా కొంతవరకు యివ్వడమెందుకు అని మనల్ని మనం ప్రశ్నించుకుంటే, సమాధానం తెల్సుకోవడం దుర్లభమనిపిస్తుంది

విషయ ప్రవేశమునకు ముందుగా మనము బ్రహ్మంగారి జనన వృత్తాంతం గురించి తెల్సుకొనవలసి వున్నది

నందికొండ అను పుణ్యనగరమున సత్యవ్రతుడు, పాపులను ద్వేషించువాడు, నిరహంకారముతో ప్రవర్తించువాడును అయిన యనమదల వీరభోజ్యాచార్యులవారు "పాపాఘ్ని" అను మఠము స్థాపించి పరమ తపోనిష్ఠచే, నియమనిష్టలచే జీవితమును గడుపుచుండెను. ఈయన వీరపాపమాంబ అను పరమసాధ్విని వివాహము చేసుకొనెను. వీరికి లోటు సంతానము లేకపోవుటయే సంతానము కొరకు వీరపాపమాంబ శ్రీ మద్విరాడ్విశ్వకర్మను, నిత్యము పుత్రసంతానము కొరకు దీక్షతో పూజించుచుండెను

ఒకరోజు వీరభోజ్యాచార్యులు యింటియందు లేని సమయమున, విశ్వకర్మ ప్రభువు, సాధురూపమున వీరపాపమాంబ వద్దకువచ్చి తల్లీ నీవు పరమ పావనివి, పతివ్రతా శిరోమణివి అట్టి నీకు సంతానము లేకపోవుట ఒక లోటు. మానవ జన్మము నీటి బుడగతో సమానము మీరు పుత్రులు లేని కారణమున, మీ తరువాత యింతటి మహత్తరమైన మఠమునకు అధిపతులు లేకపోవుట శోచనీయము. అందులకు మీరు చింతించవలసిన పనిలేదు

కొద్ది దినములలోనే మీకు దైవాంశసంభూతుడయిన ఒక బాలుని, ఒక ముని వలన మీరు పొందగలరు. ఆ బాలుడు పరమేశ్వర అంశతో జన్మించినవాడు. మీకు అనతి కాలమున తీర్థయాత్రలు చేయు యోగమున్నది. అట్లు యాత్రలు చేసి తిరిగి యింటికి వచ్చు మార్గమున ఉత్తర భారతదేశమునందలి సరస్వతీ నదీతీరాన గల ఒక మునీశ్వరుడు తనవద్ద పెరుగుచున్న భగవత్స్వరూపుడైన ఆ బాలుని మీకు యిచ్చును. ఆ బాలుని గూర్చిన విశేషములన్నియూ ఆ ముని పుంగవుడే తెల్పును' అని తెలియజేసి వెడలిపోయెను

వీరభోజ్యాచార్యులు యింటికి వచ్చిన పిదప, యీ విషయమును ఆమె వారికి వివరించి చెప్పగా, పాపమాంబ యొక్క ప్రార్థన మీద ఆచార్యులవారు తీర్థయాత్రలకు బయలుదేరుటకు అంగీకరించిరి. కొన్ని దినముల పిదప వీరభోజ్యాచార్యులవారు ఉదయముననే మఠమునగల సమాధిని పూజించుట కొరకు వచ్చిరి. అక్కడవున్న ఒక అజానుబాహుడయిన కాషాయాంబరధారిని చూచి, నమస్కరించి చెంత కూర్చుండెను. అపుడా సాధుమూర్తి 'అయ్యా మీకింకనూ తీర్థయాత్ర చేయవలెనను అభిలాష కలుగలేదా? వెంటనే తీర్థయాత్రలు మొదలుపెట్టండి తిరుగు ప్రయాణమున మీకు అమూల్యమైన సంపద లభించగలదు మీ దంపతుల కోరిక నెరవేరగలదని' చెప్పి అంతర్ధానమయ్యెను. తనకు జ్ఞానబోధ చేసినది తప్పక ఆ సర్వేశ్వరుడేనని తలంచి, ఆయన ఆనతి ప్రకారము శుభదిన, శుభముహూర్తమున తీర్థయాత్రలకై బయలుదేరిరి.

బ్రహ్మాండపురమున పరిపూర్ణాచార్యులు, వీరి ధర్మపత్ని ప్రకృతాంబలు పుత్ర సంతానము కొరకు కాశీపురమునకు వచ్చియుండిరి కాశీ విశ్వనాధుని దర్శించుకుని పుత్రసంతానము కొరకు విశ్వేశ్వరుని ప్రార్థించిరి. ఒకనాటి రాత్రి సర్వేశ్వరుడు ప్రకృతాంబ స్వప్నమునందు కన్పించి ప్రకృతాంబ గర్భమున తానే జన్మించబోవు చున్నట్లు తెలియజేసెను తాను జన్మించిన వెంటనే పరిపూర్ణాచార్యులవారు మరణించుట జరుగుననియూ తెల్పిరి. ఆ కాశీపురమునందే ఆమె గర్భము ధరించి, నవమాసములు అక్కడనే గడిపిరి బ్రహ్మాండపురమును జేరి అచటనే బిడ్డకు జన్మ నివ్వవలెనని తలచి, బయలుదేరి వచ్చు మార్గమున సరస్వతీ నదీతీరమునకు వచ్చు సరికి ఆ అమ్మకు అపరశివావతారుడైన బాలుడు జన్మించెను. జన్మించిన వెంటనే పరిపూర్ణాచార్యులవారు సమాధిసిద్ధి పొందుట సంభవించెను పతినెడబాయవలసిన దుఃఖమున ప్రకృతాంబ పుత్రుని ముందుంచుకొని తానునూ ఈ తనువును చాలించ వలయునను కోరిక మనసున కలిగెను. అదే సమయమునకు అత్రి మహాముని అను నామముగల ఒక ఋషిపుంగవుడు సరస్వతీనదీ స్నానమునకు అచటకు

వచ్చుట జరిగినది. ప్రకృతాంబ ఆ మునీశ్వరునిజూచి, తన బిడ్డను పెంచగల వ్యక్తియని తలచి, వారి వృత్తాంతమంతయునూ తెలిపి, ఆమె కూడా మనస్సును, శ్వాసను షడాధారములను దాటించి, సహస్రారముననిల్పి శివునియందు ఐక్యమును పొందెను. అట్లు పరమేశ్వర వరప్రసాదితమయిన ఆ బాలునికి వీరభొట్లయ్య అను నామమును యిచ్చి అత్రి మునీంద్రులు పెంచుకొనుచుండెను. ఈ సమయముననే పాపాఘ్ని మఠాధ్యక్షులయిన వీరభోజ్యాచార్యులవారు ధర్మపత్నీ సమేతముగా యాత్రలు చేయుచూ తిరిగి యింటి దారి యందు అత్రిముని ఆశ్రయమునకు చేరిరి.

అత్రిమునికి తమ ఉనికిని గూర్చి దక్షిణ దేశవాసులమని, విశ్వబ్రాహ్మణ కులమని, నందికొండ పాపాఘ్ని మఠాధిపతినని తెలియజేసుకొని, పుత్రసంతానము కొరకై భగవతా దేశమున తీర్థయాత్రలు చేయుచున్నామని తెలిపిరి అంత ఆ మునీశ్వరుడు కొంత కాలము వారిని తన ఆశ్రమముననే ఉండనిచ్చి, నిదానముగా వారికి ఆ బాలుని వృత్తాంతమంతయూ తెలియజెప్పి ఆ బాలుని గుణవిశేషములను యిట్లు చెప్పినారు నేను ఈ బాలుని ఆరునెలలనుండి పెంచుచున్నాను ఈ బాలుని శరీరము మీద ఈగకానీ, దోమకానీ ఎటువంటి కీటకము కూడా వాలదు. ఎండలో నిలబెట్టిన నీడ కూడా పడదు. ఒకనాడు ఈ బాలుని ఎండలో కూర్చుండబెట్టగా, నాగుపామొకటి వచ్చి బాలునికి ఎండరాకుండా తన పడగపట్టినది ఈ వయస్సునకే యిట్టి మహత్యములను జూపిన, పెద్దయయిన తర్వాత ఎంతటి మహాత్ముడు కాగలడోయని నా మనస్సు ఒక ఆశ కలుగుచున్నది ఈ బాలునికి మీరు ఎటువంటి కష్టము కలుగకుండా పెంచుకొనుమని చెప్పి వారికి యిచ్చెను.

ఆ బాలునికి ఏడు సంవత్సరముల వయస్సు వచ్చుసరికి సకల విద్యలయందును అపార పాండిత్యమును గడించెను. ఎల్లపుడూ పద్మాసనమునందు నిష్టాగరిష్టతతో కూర్చుని, నిశ్చలముగా కనిపించుట, ఎవరితోనూ అధికప్రసంగం చేయకుండుట ఈ బాలునియొక్క లక్షణములు. అదే సమయమున పెంపుడు తండ్రి అయిన వీరభోజ్యాచార్యులవారు జీవైక్యము చెందుట జరిగెను. వీరపాపమాంబ పుత్రునిపై గల అతిప్రేమచే, వీరంభొట్లయ్యను చూచుకొనుచూ కాలము గడుపుచుండెను ఇవన్నియూ చూచిన వీరంభొట్లయ్య విజ్ఞానవంతుడయినందు వలన, ఈ దుఃఖము లన్నింటికీ కారణము సంసారమని, ఈ సంసారమును త్యజించుట వలన మనస్సునకు శుద్ధి, ప్రశాంతత కలుగునని గ్రహించగలిగి కొంతకాలము క్షేత్రములన్నియూ దర్శించి వచ్చుటకు తల్లిని అనుమతి అడిగి పుణ్యక్షేత్ర దర్శనార్థము బయలుదేరెను ఇట్లు బయలుదేరు సమయమునకు తల్లియొక్క

ప్రాపంచిక భ్రాంతిని పోగొట్టెను ముక్తి మార్గము బోధించెను. జీవితమనిన క్షణభంగురమని, ఈ శరీరము అనిత్యము, ఈ బంధములు అశాశ్వతములనియూ, ఇట్టి అశాశ్వతములైన బంధముల కొరకు ప్రాకులాడుట విజ్ఞులకు తగదని బోధించి తల్లిని శాంతపరచెను.

తల్లికి జనన మరణ విషయములను బోధించుచూ, పిండోత్పత్తి క్రమమును ఈ విధముగా తెలియజేసెను. తల్లీ! మనుష్యులు భుజించు ఆహారము సత్వరజోస్తమో గుణములు కలిగియుండును. ఈ భుజించిన ఆహారము శరీరమునందు మూడు గుణములను కలిగించును. అవియే సత్వరజస్తమో గుణములని తెలియవలయును. ఈ ఆహారమును భుజించుట వలన శరీరమునకు బలమును, ప్రాణమునకు సమర్ధతనూ, మనస్సునకు ధృఢత్వమూ, మరియూ కోరికలను కలుగజేయును. మానవునియందు కోరిక అతిగా కలిగినపుడు మనస్సునందు కామము ప్రేరేపించబడి శరీరమునకు మదమావహించును. ఆ సమయమును పురుషునియందు శుక్లమును, స్త్రీయందు శోణితమును శరీరమున వృద్ధి చెందుచున్నది. ఇట్లు భార్యభర్తలకు భార్య యొక్క ఋతుకాలమున సంయోగకాంక్ష కలుగుచున్నది. వీరి మనోవాంఛానుసారము సంయోగమున అధిక శుక్లమున పురుషుడును, అధిక శోణితమున స్త్రీయు, శుక్ల శోణితములు సమమైనపుడు నపుంసకుడుగానీ జన్మించుచున్నారు కామ ప్రకోపితులై వెంటవెంటనే రతి జరిపినపుడు కవలలు జన్మించుచున్నారు. యోనియందలి పొరలన నుసరించి యీ కవలలు జన్మించునని తెలియవలయును (గైనకాలజీ ప్రకారము మార్పుకలదు) స్త్రీ స్నానమాచరించినది మొదలు 16 దినములు ఋతుకాలముగా తెలియవలయును అందు మొదటి నాలుగు దినములు సంభోగమునకు నిషిద్ధములు. నాల్గవ దినమున కలసిన యెడల పిచ్చివాడును, ఐదవ దినమున కలిసినయెడల బేసిదినమైనందున పురుషుడును, పగలు పిండోత్పత్తి జరిగిన అర్ధాయుష్కుడు, దరిద్రుడు, పరజన దూషకుడు జన్మించును ఋతుకాలమున, సంగమము జరుగు కాలమున మంచి బలవర్ధకములైన పదార్ధములను భుజించుట, సత్ప్రవర్తన గలిగియుండుట, మనస్సునందు మంచి ఆలోచనలతో వుండుట, సర్వవేళలయందు భగవంతుని మనస్సున నిలుపుకొనుట వంటి పనుల వలన మహా జాతకుడు జన్మించగలడు. శుక్లశోణితములు కలసిన ఐదురోజులు నీటిబుడగ వలెనుండును. పదిరోజులకు కోడిగ్రుడ్డువలె తయారగును. ఒక మాసమునకు పిండము గట్టిగా ఏర్పడి, శిరస్సు కలుగును. రెండు మాసములకు కాళ్ళు, చేతులు, మూడు నెలలకు ఉదరమునూ, నాలుగు నెలలకు ఇరుపార్శ్వములునూ, ఐదవ నెల పాదములు, వ్రేళ్ళునూ, ఆరవ మాసమునందు ముక్కు, చెవులు, కళ్ళు కలుగును.

ఏడవ నెలయందు జీవాత్మ ప్రవేశించి, పిండమునకు ఉచ్ఛ్వాశ నిస్వాసములను కలిగించి, పిండమునకు ప్రాణమును పోయును. ఎనిమిది, తొమ్మిది నెలలయందు పూర్వజన్మ జ్ఞానమును పొందును. పదవ నెలయందు భూపతనమగువరకు మల మూత్రాదుల స్థానము అయిన గర్భమందువుండి తనలో తాను దుఃఖించుచుండును పిండమునందలి ప్రాణవాయువుచేత యోనినుండి బయటకు విడువబడి కలినీళ్ళు చల్లగనే పూర్వజన్మస్మృతిని కోల్పోయి ఏడ్చును ఇదియే జన్మము

తరువాత జీవునియొక్క చతర్దశ లక్షణములను తల్లికి యిట్లు వివరించెను. జన్మించిన శిశువు జ్ఞానము లేనివాడయి, ప్రక్కపై మలమూత్రాదులందు పరుండి, ఈగలను దోమలను తోలుకొనలేక ఏడ్చుచుండును గర్భమునందలి దోషములను అధిగమించి, భూమిపై జన్మించి బాలారిష్టములను అధిగమించవలయును. కలిగిన రోగములకు ఔషదసేవనము, బాలగ్రహముల దోషముల వలన బహుకష్టములు పడుచుండును భగవదనుగ్రహమున ఐదవ సంవత్సరమున అక్షరాభ్యాసమును పొంది; చదువులందు వెనకబడి, గురువులచేత దండించబడి, పద్దెనిమిది సంవత్సరముల వరకు విద్యను అభ్యసించి, యుక్తవయస్కుడై తల్లిదండ్రులు నిర్ణయించిన కన్యతో వివాహమునుపొంది, యుక్తాయుక్త విచారణ చేయలేని వయస్సునందు సంసారసుఖములనుభవించి సంతానమును పొంది, వారిని పోషించుటకు, అతి వ్యయప్రయాసలకు ఓర్చి పనులు చేయుచూ, సంపాదనతో అందరినీ పోషించుచున్నాను గర్వమును మనసునందు పొందును. కొంతకాలమునకు ముసలితనము వచ్చి వినికిడి, దృష్టి లోపములతో సతమతమగుచూ, తన శరీరము తన ఆధీనము తప్పి కాళ్ళూ చేతులు పనిచేయక తన వారికే భారమై, అందరి చీదరింపుల మధ్య జీవచ్ఛవంలా కాలం వెళ్ళబుచ్చు చుండగా, కాలమాసన్నమయి యమదూతలు కొనిపోవునపుడు ఈ జీవికి తనయొక్క తెలివి తక్కువతనము, తన నీచ ప్రవర్తన, తనయొక్క మూర్ఖత్వమునకు చింతించును

వీరంభొట్లయ్య తల్లికి శరీరము ఏ తత్వములచే ఏర్పడునో యిట్లు చెప్పివున్నారు పృథ్వి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అను పంచభూతములచే ఈ శరీరము ఆక్రమించుకొనబడి, ఆ పంచభూతములచేతనే పాలింపబడుతున్నది ఈ పంచ భూతములను విభజించి, వాటి వాటికి వేరు వేరు గుణములను ఆపాదించబడినవి. అవి ఈ విధముగా కలవు. ఆకాశభూతము వలన మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము

లనబడు నాలుగు గుణములు కలుగుచున్నవి. సమాన, వ్యాన, ఉదాన, అపాన, ప్రాణ అను అయిదు వాయు తత్త్వమైనవి. శ్రోతము, త్వక్, చక్షు, జిహ్వా, ఘ్రాణములనెడు జ్ఞానేంద్రియములను అగ్ని తత్త్వము నియంత్రించును. శబ్దము, స్పర్శ, రూప, రస, గంధము అనెడు పంచతన్మాత్రములు జలతత్త్వపరమై యున్నవి. వాక్కు, పాణి, పాదము, గుదము, గుహ్యము అను ఐదు గుణములు పృథ్వీతత్త్వమై వున్నవి. ఈ పంచభూతములచే వ్యక్తీకరించబడిన గుణగణములు కలసి సత్వరజతమో గుణములనియు, స్థూల, సూక్ష్మ కారణ శరీరములును, కామ, క్రోధ, మోహ, లోభ, మద, మాత్సర్యములనెడు అరిషడ్వర్గములుగానూ, వీటన్నిటి కలయికే "జీవుడు" అని తెలిసికొని, ఈ చెప్పబడిన పంచభూత కలయిక వలన కలిగిన గుణములను నియంత్రించుకొని వాటివి తన ఆధీనములోనికి తెచ్చుకొని జీవించుట సాంఖ్య యోగమని తల్లికి చెప్పెను.

తల్లికి తారకోపదేశమిచ్చిన విషయమును గురించి యిట్లు తెలియవలయును. తల్లీ! పరబ్రహ్మస్వరూపమును దర్శించుటకు సులువైన మార్గమును చెప్పుచున్నాను. పద్మాసనముపై స్థిరముగా కూర్చుండి, వాయు, శబ్దతరంగములను మించిన వేగముతో ప్రయాణించు మనస్సును నియంత్రించి, కేంద్రబిందువైన భగవత్ స్వరూపముపై స్థిరమైన దృష్టిని నిలిపి, మనస్సును కేంద్రీకరించగలిగిన యెడల భగవంతుడు దర్శన మిచ్చును యిట్లు తల్లికి హితోపదేశముచేసి తల్లి వద్ద అనుమతి గైకొని దేశాటనమునకు బయలుదేరెను. ఇచట చెప్పవలసిన ముఖ్య విషయము. వీరంభొట్లయ్యగారు సాక్షాత్ శ్రీమన్నారాయణుడే అని తెలియవలయును.

వీరప్పయ్యాచార్యులు అను పేరు కూడా బ్రహ్మంగారిదే అని తెలియవలయును. వీరు హరిహరపురము నుండి బయలుదేరి హంపి, విరూపాక్షి, అహోబిలం, మహానంది, ఓంకారం మొదలయిన పుణ్యక్షేత్రములను దర్శించుకుని బనగానపల్లె అను గ్రామమును చేరుకొంటిరి ఆ గ్రామమునందలి గరిమరెడ్డి అచ్చమ్మగారి యింటికి చేరి ఆ రాత్రికి వారి యింటి అరుగుపై నిద్రించిరి ఉదయముననే అచ్చమ్మగారు, బ్రహ్మంగారిని చూచి, విచారించగా, తాను ఆమె ఆవుల మందలను సంరక్షించుటకు వచ్చితినని తెలుపగా, ఆమెకూడా యోచించి, గోవులను దూరముగా తీసుకొని పోకుండా, ప్రక్కనేవున్న రవ్వలకొండ ప్రక్కగా గోవులను మేపునట్లు తెలియజేసి తన గోవుల కాపరిగా నియమించెను.

మరునాటి ఉదయము వీరప్పయాచార్యులు గోవులను తోలుకొనిపోయి, రవ్వల కొండకు దగ్గరలో ఒకచోట గోవులను గుంపుగా వుంచి, చుట్టూ ఒక గిరిగీసి, ఒక తాటిచెట్టు దగ్గరకు పోయెను. అంత ఆ చెట్టు బ్రహ్మంగారిని సాదరముగా ఆహ్వానించుచున్నదా అన్నట్లు పూర్తిగా శిరస్సు వంచినట్లు వంగిపోయెను. అంతట బ్రహ్మంగారు ఆ చెట్టు తాటియాకులను కోసుకొని, అడవిలోని ముళ్ళను తీసుకొని రవ్వలకొండయందలి ఒక గుహయందు కూర్చుండి కాలజ్ఞానము వ్రాయుట ప్రారంభించెను. ప్రతిదినమునూ యిట్లే జరుగుచుండెను. ఇట్లు వ్రాసిన కాలజ్ఞాన ప్రతులనన్నింటిని అచ్చమ్మగారి యింటి ప్రక్కనున్న ఒక పాతరయందు వేసి మూత వేయుచుండెను. ఈయన పాలించు గోవులమందలు సుఖముగా, రక్షణలో నుండెను మిగతా గోపాలకులు ఒకరోజు గిరిలో నిలిచియున్న ఆవులనుచూచి, ఎవరూ కాపలా లేకపోవుట వలన ఎవరివో తెల్సుకొని అచ్చమ్మకు ఈ విషయమై ఫిర్యాదు చేసిరి.

మరుసటిరోజున యథావిధిగా, వీరప్పయాచార్యులవారు ఆవులను తోలుకొని వెళ్ళి వారి దినచర్యయైన కాలజ్ఞానము వ్రాయుట జరుగుచుండెను. వీరి చర్యలను కనిపెట్టుటకు అచ్చమాంబగారు బ్రహ్మంగారి వెనుకనే వచ్చుచూ, ఆవుచుట్టూ గిరిగీయుట, తాటిచెట్టు వంగి ఆకులను యిచ్చుట, మొదలయినవి చూసి ఆశ్చర్య పోయి లోనికేగిచూడగా, ఆ గుహ అంతయూ అత్యంత కాంతివంతమై, వైకుంఠ వాసుడైన, శ్రీ మన్నారాయణునివలె కూర్చుండి, కాలజ్ఞానమును వ్రాయుచున్న వీరప్పయాచార్యులవారిని చూసి ఆశ్చర్యమునొంది, ఏమియూ పలుకరించకుండా తిరిగి యింటికి జేరెను. కానీ ఆమె ఆలోచనలన్నియు ఆచార్యులవారి గురించియే. వారి రాకకై ఎదురుచూచి, వారు రాగానే బ్రహ్మంగారి పాదములపై సాష్టాంగపడి తనను మన్నింపమని, బ్రహ్మోపదేశమివ్వమని ప్రార్థించగా, బ్రహ్మంగారు యాగంటి క్షేత్రమున నీ అనుమానములన్నియూ తీర్చగలనని చెప్పెను.

మరునాడు అచ్చమ్మగారిని తీసుకుని యాగంటి క్షేత్రమునకువెళ్ళి, యాగంటేశ్వరుని పూజించుకొని, ఒక ప్రదేశమున కూర్చుండి, ఆచార్యులవారిని యిట్లు ప్రశ్నించింది. ఈ పరబ్రహ్మము స్త్రీయా? పురుషుడాయని అడుగగా, బ్రహ్మంగారు యిట్లు బదులిచ్చిరి, చిద్విలాస స్వరూపుడైన పరమాత్మకు రూపబేధము లేదు. సర్వాంతర్యామియైన భగవంతుడొక్కడే ఈ విశ్వమంతయూ పరమాత్మ స్వరూపముచే నిండివున్నదని తెలియ

జెప్పెను. ఆమెకు ద్వాదశాక్షరీ మంత్రము నుపదేశించి, బీజాక్షర సహితమగు ఈ మహా మంత్రమును దీక్షతో జపించుచున్న యెడల సర్వ సుఖములు పొందగలవని చెప్పెను. స్వామివ్రాయు గ్రంథముగూర్చి అడుగగా అది భవిష్య గ్రంథమని, అది దేవరహస్యములతో నిండినదనియూ, బ్రహ్మజ్ఞానులకు మాత్రమే యది తెలియుననియూ, చెప్పగా తనకు ఆ భవిష్య గ్రంథమును బోధింపుమని అచ్చమ్మగారు వేడుకొనగా యీ విధముగా వివరించిరి.

## అచ్చమ్మగారికి కాలజ్ఞానమును బోధించుట

కలియుగమునందు 4808 సంవత్సరములు గడచిన తరువాత ధర్మదేవత పుణ్య స్థలములయందు మాత్రమే వుండును. పాపములు రోజురోజుకీ పెరిగిపోయి, కొట్లాటలు అధికమగును నిద్రాహారములు అధికమై ఒక్కచోట వుండలేక అనేక ప్రదేశముల సంచారము అలవాటగును. శాంతవంతులు కూడా కోపము తెచ్చు కొనుదురు. నీచ ప్రవృత్తిగలవారు గొప్పవారగుదురు. గొప్పవారు ఎందులకూ పనికి రాకుండా పోవుదురు. బ్రాహ్మణులు తమ తమ ధర్మములను మరచిపోవుదురు. ఒక్కొక్కరూ ఒక్కొక్క మతమును పొంది, నీచాశ్రయులగుదురు షట్కర్మలను ఆచరించక భ్రష్టులగుదురు. రాజులు తమ ధర్మములను విస్మరించి, వినోదవంతులై నీచ కార్యములను చేయుచూ రాజ్యములను కోల్పోవుదురు శూద్రులు అసత్య వాదులై నీచసాంగత్యముచేత దరిద్రులగుదురు. ప్రతి జాతియందు వర్ణ సంకరము జరిగి, వైరములు పెచ్చుపెరిగి, మతకలహముల వలన మరణింతురు. పైర్లు కొంచెము మాత్రమే పండును గోవులు పాలిచ్చుట తగ్గిపోవును. తండ్రీకొడుకుల మధ్య వైరములు తల ఎత్తును. దేవబ్రాహ్మణులను గురువులు విమర్శించేరు. వావి వరుసలు లేక ప్రజలు ప్రవర్తించెదరు. ఒకరి సొమ్మునొకరు హరించేరు. ఉపద్రవములు హెచ్చును అగ్నిభయంబులు అధికమయ్యేను అడవి మృగంబులు గ్రామాలు జేరెను ఏనుగునకు పంది పుట్టను. పందికి కోతిపుట్టును. పాపంబులు హెచ్చేను వేశ్యల వలన మనుషులు చెడిపోయేరు. ఇంద్రజాలవిద్యలను చండాలురు అభ్యసించేను చోళ మండలము నష్టమైపోయేను శిలలు కండలు గ్రక్కేను. ఆ కండలు తినుటకై గ్రద్దలు వచ్చి చచ్చేను ఆ చచ్చిన వాటిని బట్టుకొని ప్రజలు గంతులు వేసేరు. కొరువులు నోట గరుచుకొని తిరిగేరు. బెండ్లు మునిగేను. గుండ్లు తేలేను. కొండలు మండేను భూతగ్రహ చేష్టలధి కమయ్యేను కడుపులో మంటలు పుట్టి చచ్చేరు. నోటియందు బొబ్బలు పుట్టి నెత్తురు గ్రక్కుచూ గుండెలు పగిలి, నడినెత్తి పగిలి చచ్చేరు పశుమృగాదులు గుంపులుగాచేరి చచ్చేను

పట్నాలన్నియూ ఒక్కరే పాలించేరు. ఇతర దేశీయులు వచ్చి భరతఖండ మంతయూ ఏలేరు. అంతరమున మానవులు చదువులే నేర్చేరు. నాగరికత పెరిగేను విద్యాజ్ఞానంబు బలిసి వర్ణంబులన్నియూ ఒక్కటయ్యేను. ఎద్దులు లేకుండానే బండ్లు తోలేరు నీటిచేత దీపము వెలిగించేరు. పులి, మేక ఒక రేవున నీరు త్రాగేను ఊర్భూర జనులు కలహంబులతో కొట్టుక చచ్చేరు. వెంపలి మొక్కకు నిచ్చెనలు వేయువారు బుట్టేరు తక్కువ జాతివారు ఆచరావంతులై బ్రాహ్మణులను, దేవబ్రాహ్మణులను నిందించేరు. దేవనిర్మాణ. ప్రతిష్ఠా, పూజలు చేయువారు. దరిద్రులయ్యేరు విజయ నగరము కొన్నాళ్ళు పూజనీయమై కొన్నాళ్ళు చెడిపోయేను. కాశీపట్టణము నలుబది దినములు పాడుబడి వుండేను. కురుక్షేత్రమందు జనము గుంపులుగా కూడి నరకు లాడేరు. కొండవీడును విష్ణుభక్తులేలేరు. గోదావరి జలములు పన్నెండు దినములు సమసిపోయేను అవల వుప్పొంగేను కాళహస్తీశ్వరుని సముఖమందుండే ద్వార పాలకులు ఒక్క ముహూర్తము గ్రుద్దులాడేరు. వేంకటేశ్వరుని కుడి భుజము అదిరేను మాయావాదులనే వైష్ణవులు కలహముచేత రెండు తెగలై యుద్ధమునకు దిగేరు కుక్కలు గుఱ్ఱాలను చంపేను. పగలు చుక్కలు కాన్పించేను అందున కొన్ని గ్రామాలలో జనులు నష్టమయ్యేరు. చుక్కలు రాలేను కార్తీక బహుళద్వాదశిరోజున ఉత్తర భాగమున నాల్గు ముఖములు చుక్కలుబుట్టి ఇరవైఅయిదు వారములు ప్రకాశించేను. కర్ణాటక దేశమున లక్ష్మి చలించేను. నిక్షేపమైన ద్రవ్యములు మహ్మదీయులు కొంత అపహరింపగా, మరికొంత వెలమరాజులు అపహరించేరు. మళయాళములో మందపాలుడు మాట్లాడేను. తిరుపతికి బోవు మార్గాలు కట్టుబడేను భూమి నెత్తురుచేత తడిసేను. ఎముకలు కొండల పాదవునా పడేను. కాకులు వికార స్వరముతో అరచేను, కొండవీటికి వుత్తరాన రాతిస్థంభము వూడి పడేను. అందున కొందరు జనులు నష్టమయ్యేరు. 5000 సంవత్సరముల మీదట కాశీలో గంగ కానరాకుండెను. కంచికామాక్షమ్మ గిరగిర చక్రాకారముగా తిరిగేను బిళంకామాక్షమ్మ నెత్తురు గ్రక్కేను వేపచెట్టున అమృతంకారేను. మాచెర్లలోని రాజులందరూ ఒక మడవతిచేత హతులైపోయేరు. ఆ మీద మాచర్ల చెన్నకేశవస్వామి మహిమలన్నీయు తగ్గిపోయేను కారెంపూడిలో కలహములు పెరిగి అందున రాజులు హతమయ్యేరు. గాలివానలచేత శ్రీశైలమునకు దక్షిణమున గుండ్లు దొర్లేను నెత్తుటి వానకురిసేను. బండలు పగిలి ఆకాశమున గ్రద్దలు వాలేను కాకులవలె ఆడేను రాతిగుండ్లలో చీము, నెత్తురు వచ్చేను బొడ్డు ఆరని బిడ్డలు మాట్లాడేరు. ఆకాశమున పొగమంటలు పుట్టేను. ఆరు మతాలు ఒకటయ్యేను.

శంఖారావములు వినబడేను. ఒకరిసొత్తు మరొకరపహరించేరు. ఒకరి అలి మరొకరి పాలయ్యేను. పుణ్యస్త్రీలు, పుణ్యపురుషులు బ్రతికేరు. పుణ్యస్థలంబులు చెడేను. దేవస్థానమలు పాపాత్ములచేత నష్టమయ్యేను. నిక్షేపాలు బయలుపడేను. వెంకటాచలములో మహ్మాదీయలును చండాలురును పూజచేసేను. వేంకటేశ్వరుని సొమ్ము దోచేరు. ఈ దివ్య స్థలంబున ఆరుగురు దుష్టులు పుట్టుదురు. తిరువళ్ళూరి వీర రాఘవస్వామికి తిరుమేనలు చేసేరు. కృష్ణాగోదావరుల మధ్య ఆవులు గుంపులు గుంపులుగా గూడి చచ్చేను. ఒకరినొకరు పట్టుకొని అడవుల పాలయ్యేరు. శీతోష్ణ జ్వర్ధాలచే జనులు నశించేరు కృష్ణానది మధ్యన బంగారు తేరు కనిపించేను. ఆ తేరు చూచిన వారి కన్నులు కనబడకుండేను. అశ్వపతి సంస్థానము మంటపంబయ్యేను. కర్నాటకదేశము మహ్మాదీయుకాంతలచేత దేవాలయములు, విగ్రహములు విఘ్నమై పోయేను. శిలాధారణమైన తేరు లోకస్మికంగా విరిగిపడేను దేవబ్రాహ్మణులు ఆచారశూన్యులై పోయేరు వారికి తినుటకు తిండిలేక మాడుచుండేరు. శ్రీశైలభ్రమరాంబ సముఖమున రెండు తలల మునలి కనిపించేను. తిరగి భ్రమరాంబలో ఐక్యమయ్యేను. చక్రాంకిత సంభవుడైన పరమహంస ఉదయగిరి శిఖరాగ్రమందు అమావాస్యనాడు ఎక్కిన ప్రజలు చంద్రగ్రహణమని భ్రమసేరు. శివవైష్ణవ దేవళంబులలో రక్తంబుబుట్టును. ఆకాశమునుండి రెండు బంగారు హంసలు వచ్చి పురములయందు, వనములయందు, నదులయందును సంచరించేను. పాపాత్ములయిన ప్రజలుచూసి పట్టిదమనిపోయి కన్నులుగానక గిరగిర తిరగి లక్షోప లక్షలుగా చచ్చేరు. తూర్పునుండి పడమర వరకు ఆకాశంబున యోజన ప్రమాణము వెడల్పుగా చెంగావి చీరెకట్టినట్లు కనబడేను. కొండలయందు ఘణఘణమను శబ్దము వినబడేను నానాటికి వింతలు హెచ్చేను తల్లీ యింకనూ వింతలు అనేకములు కలవు నేను వీరభోగవసంతరాయలుగా కలియుగమున వచ్చువరకు జరుగు చుండును. నాకు భక్తులయినవారికి, మోక్షంబు వేచివుండును. నన్ను భక్తితో నమ్మి, నా కాలజ్ఞానమును పూజించిన వారికి, చెప్పిన వారికినీ, విన్నవారికినీ, చదివిన వారికినీ అష్టయిశ్వర్యములు కలుగును నన్ను సదా ద్యానించిన నీకు బ్రహ్మత్వము సిద్ధించును అని బ్రహ్మంగారు అచ్చమ్మగారికి చెప్పిరి. వీరిరివురూ కొండపై ముచ్చట్లాడిన ప్రాంతము యిప్పటికీ ముచ్చట్లుగానే పిలవబడుచున్నది.

కొంతకాలమునకు కాలజ్ఞానపు పాతరపై ఒక చింతచెట్టు మొలిచింది. స్వామి వారికి అచ్చమ్మగారు ఒక మఠమును కట్టించిరి. ఆ మఠమునందే ఇరువురునూ తపము చేయు

చుండిరి. అచ్చమ్మగారు సంసారమును త్యజించి. వైరాగ్యమును పొంది స్వామివారిని సేవించు చుండెను.

## కాలజ్ఞాన పాతరపై మొలిచిన చింతచెట్టు విశిష్టత

శ్రీ బ్రహ్మంగారు వ్రాసిన పద్నాలుగు వేల కాలజ్ఞానములను దాచిన పాతరపై ఒక చింత చెట్టు మొలిచెను అప్పటి చెట్టు ఈ రోజునకునూ కలదు సుమారుగా 700 సంవత్సరముల వయస్సుగలిగి యిప్పటికినీ వున్నది చిన్నచెట్టు గుబురుగా వుండును ఈ చెట్టున కాసిన కాయలన్నియూ లోన కాటుక పట్టినట్లు నల్లనిరంగు కలిగి యుండును. తినుటకు వుపయోగపడవు. ఏదైనా చెడు జరుగుటకు ముందు చెట్టుకున్న పూత అంతయూ ఒక రాత్రికే రాలిపోయి వుండును కలరా, మశూచి, వగైరా జబ్బులు వచ్చుటకు ముందు ఈ చెట్టుకున్న పంగల మద్యనుండి రక్తమువలె ఎఱ్ఱని ద్రవము కారుట వుండును అది గడ్డకట్టి కుంకుమ మాధిరిగా తయారగును. ఈ విధముగా ఈ రోజునకునూ జరుగుచున్నది స్థానికులను ఈ చెట్టుగురించి అడిగితే యిది మా ముందు తరముల నుండి ఈ విధముగానున్నట్లు చెప్పెదురు ఆ చెట్టునకు యిప్పటివరకు నిత్య దీపారాధన, నైవేద్యములు జరుగుచున్నవి.

## బ్రహ్మవంశసంభూతుడగు అన్నాజయ్యగారి రాక! కాలజ్ఞాన బోధన

శ్రీ బ్రహ్మంగారు మఠములోనుండి జ్ఞానబోధనలు బ్రహ్మోపదేశములు చేయుచూ అనేకమంది సందేహములను నివృత్తిచేయుచూ అనేకమంది భక్తులను ఆదరించుచూ, బనగానపల్లె నందుననే వుండిరి. ఒకరోజు అచ్చమ్మగారు స్వామిని తన కుమారుని అంధత్వము గూర్చి తెలియజేయగా స్వామి సమయముచెప్పి ఆ రోజునకు మఠమునకు తీసుకురమ్మని చెప్పిరి

తాను అనుష్ఠానమున నున్న సమయమున బ్రహ్మాంశ సంభూతుడయిన అన్నాజయ్యగారు పుణ్యక్షేత్రములు సందర్శించుకుంటూ బనగానపల్లి వచ్చి అచ్చమ్మ గారు కట్టించిన మఠమునకు వచ్చి స్వామి వారిని దర్శించుకొనిరి బ్రహ్మంగారు అన్నాజయ్యగారి కోరికమీద వారికిని కాలజ్ఞానమును తెలియజేసిరి.

నాయనా అన్నాజయ్యా ఇది దేవరహస్యము. పరతత్వమైన మహతత్వజ్ఞానము. ఇదియే కాలజ్ఞానము కలియుగమునందు మందీ మర్భలములు కలిగిన రాకాజులు వంశక్షయులై పోయేరు మత కలహంబులు విస్తారముగా జరిగేను. గ్రామాలలో చోరులు ఎక్కువయి ధనమును దోచేరు వారిని విచారించునదీ లేకుండేను. ఊరూరా ఒక శక్తి పుట్టేను విశ్వమంతా తల్లడిల్లిపోయేను. మాపటి వేళ మేక పోతులు కూసేను అందున కొందరుచచ్చేరు. తిరుపతి కొండమూలన ధూమకేతుబుట్టేను ఆ నక్షత్రమును చూచి, మిట్టమధ్యాహ్నము అనేకమైన కీళీలుకలిగి అందున కొందరు చచ్చేరు దక్షిణం మెరిసేను. ఉత్తరం మెరిసేను పిడుగులుపడి నదులు యింకిపోయేను అమావాస్య నాడు చంద్రుడు పొడిసేను అందువలన కొందరు నష్టమయ్యేను ఉత్తరదిక్కున శుద్ధపాడ్యమి నాటికి, ఉరుములు, మెరుపులు, పిడుగులు పడేను. ఆ వెంటనే మాయ జంగాలు వచ్చేరు. అడుగునకు ఏడడుగులు నడిచేరు. మానవులు తల్లుల మొఖము పిల్లలు, పిల్లల ముఖము తల్లులు చూడక పాలాలపడి తిరిగేరు. ఇంకనూ పిల్లలు కడుపు నిండక రేగటి మృత్తికను రేయింబవళ్ళు తినేరు. అందున కొందరు జచ్చేరు. నడిఝామున గ్రామాలలో కేకలు వినబడేను శీలవంతులు నీళ్ళపాలయ్యేరు. ఆచారవంతులు అనాచారులు అయ్యేరు. వర్ణాధిక్యులు అమంగళమై పోయేరు. నా రాకకుముందు భూమి మీదనున్న దుష్టులీ దూరమయిపోయేరు లింగయ్య అను మహనీయుడు నిజరూపుజూపేను. శ్రీశైల తీర్థనష్టమందును. శ్రీశైలనాధుండు సాక్షాత్తు మనుజులతో మాట్లాడేను. నందికొండకు ఉత్తరాన ఒక బిలములో నూటయిరవై లక్షల గుఱ్ఱములున్నూ, వికృతములయిన మనుష్యులు ఉత్పత్తి అయ్యేరు. మార్కాపురము వద్ద బంగారు ఎద్దులను తీసేరు అయిదేండ్లి నాగయ్య అయిదు వేదాలు చదివేను. కుమారస్వామి గుడితలుపులు ఏడు దినంబులుమూసి వుండేను ధరణిలో లింగాపురమందు ఒక శక్తిపుట్టేను శ్రీశైలపర్వతమున మల్లిఖార్జుని గుడిలోవున్న దేవుళ్లకు మూర్తి పంతాలు వచ్చేను. పిదప వూరూరా నాట్యమాడెను. దోషకారులకు చింతపుట్టేను. శ్రీశైలనాధుడుసాక్షిగా వీరభోగవసంతరాయులు వస్తారని చెప్పేను. అప్పుడు రక్తవర్షం కురిసేను. కంచి కామాక్షమ్మ ఉగ్రంచేత దక్షిణ దేశప్రజలను, శివులను నష్టపరచేను కర్ణాటక దేశమునకు కాళిపంపు. తురక దేశమునకు దుర్గిపంపు. అరవదేశమునకు అర్కసోమునిపంపు కర్నాటక దేశమునకు వీభద్రునిపంపు, సందు సందు దేశములకు భైరవుని పంపు, మహానంది దేశమునకు నాగేంద్రుని పంపు, కందనూరి రాజ్యానికి యతి పంపు విచిత్ర వ్యాధులు బుట్టి కూర్చున్నవారు కూర్చున్నట్లుగా, నడుచు

చున్నవారు నడుచుచూనే మ్రగ్గేరు. ఆకాశమున ప్రకాశవంతమైన చుక్కలు నాలుగు దిక్కుల పొడిచేను. ఆ చుక్కలుచూచి అదిరిపడి చచ్చేరు. ఆకాశంబున ధ్వనిపుట్టి అందున కొందరు నష్టమయ్యేరు. రాత్రింబవళ్ళు గ్రద్దలు గుంపులుగూడి అరచేను. నీటియందు చేపలు తాము చత్తుమని పలుకుతూ బయటకు వచ్చేను. పర్వతానికి ఒక మొసలివచ్చి ఎనిమిది దినములుండి, భ్రమరాంబ గుడిలో దూరి మేకపోతువలె కూసి మాయమయ్యేను. శ్రీశైల శిఖరాన నిప్పులు రాలేను. పార్వతీదేవి కంట నీరు కారేను. కటకటాయని నందీశ్వరుడు రంకెలువేసేను. ధణధణాయని కాలుదువ్వేను సూర్య మండలమందు వాక్కు వాక్కు అని శబ్దము వినబడేను. విషవాయువు కొట్టినపుడు పార్వతీశుని కన్నులవెంట నిప్పులు రాలేను. బసవేశ్వరుని కన్నులవెంట నీరు కారేను మహాదేవుని జడలు యెగసి, యెగసి ఆడేను త్రిశూలాయుధము వలన అమరులు కదిలేరు. పర్వతముమీద ఉక్కుస్తంభముపైని ప్రతిమ మాట్లాడును. భ్రమరాంబ ముందుర బసవేశ్వరుడు తోక విదింలించుకొనేను గుగ్గిళ్ళరాయుడు ఏలూరిలో ఏనుగుచెంత చచ్చేను. తిరుపతికొండమీద మహ్మదీయులు ఆడిపాడేరు. కపిధ్వజము కదిలేను, గరుడధ్వజము నానాదిక్కుల యెగసి యెగసి ఆడేను. వినాయకుడు వూరూరా వేదమంత్రములు చదివేను. ఆ మీదట ఆకాశమున ఆ ఆ ఆ అను శబ్దంబులు వినవచ్చేను. ఆకాశముజూచి ఆవులు, గొఱ్ఱెలు అరచేను. భూదేవి భోభోయని అరచేను. స్త్రీలు జోలలు పాడేరు. ఆ స్త్రీలకన్నుల వెంట రక్తముకారేను. ఊరూరా బెబ్బులులు వచ్చి, మనుషుల గొంతులు కరచి చంపేను. సామవేద ఘోషణమనే సంగీతము బాలయవ్వన ప్రౌఢులు వీరభోగవసంతరాయల చరిత్రములు పాడేరు. పువ్వులవాన కురిసేను. అమావాస్యనాడు చంద్రోదయమయ్యేను. సూర్య నంది ప్రబలమైన అనంతర మారాత్రిభూమికదలేను. ఆకాశమెఱ్ఱనయ్యేను. కేశవ నామములు అష్టాదశ వర్ణముల వారు కీర్తించేరు. గ్రామాలలో, పట్టణాలలో, నదులలో నెత్తురు వర్షము కురిసేను. ఆ పట్నాలలో లక్ష్మీదేవి ఏడ్చేను 'సూర్యనంది ఉద్భవ మయ్యేను. సూర్యచంద్రాదులటే ప్రకాశమయ్యేరు మహాయోగి వచ్చుచున్నాడని భూదేవి పలికేను పంచవేదంబులు పంచముల పాలయ్యేను. పంచములు పంచాంగములు చదివేరు. పంచముల వచనములు నిజమయ్యేను ఈశ్వరనామ సంవత్సరము మొదలు విక్రమనామ సంవత్సరము వరకు ఏడు గ్రామంబులకొక గ్రామంబగును. ఇట్లు అనేక ప్రళయాంతరముల చేత ప్రజలు చచ్చెదరు. కప్ప కోడికూత కూసేను. అందున కొందరు నష్టమయ్యేరు. ఈశాన్య మూలగా విషగాలిబుట్టి అందున కొందరు నష్టమయ్యేరు. చుండికొండమూలన సుడిగాలి పుట్టి అందున కొందరు నష్టమయ్యేరు నా మఠమునకు ఈశాన్యభాగమున నాగర్తిమూలగా, భూమి యందు

పంచాననం వారియింట ఒకచిన్నదాని గర్భం బ్రద్దలుగా పగ్గిలి ఒక చిన్నవాడు పుట్టేను. ఆ కాలమందు అపరిమితమైన ఉత్పాతములుగా, ఉరుములు, మెరుపులు పుట్టేను. ఇందున కొందరు. నష్టమయ్యేరు .ఆ చిన్నవాడు దేశము మీదికివచ్చి నేనే భగవంతుడను, నన్ను పూజింపమని ముక్తికలుగునని చెప్పేను. భక్తులైనవారు నమ్మకుండేరు. నెల్లూరు సీమంతా నీటి మయమయ్యేను నా మరముమీద ఆరెదొండ తీగ బుట్టేను. ఒకరాత్రి ఏడు ఘడియలకు తీగమరమంతా అల్లుకొని మనుషులు లోనికి వెళ్ళుటకు వీలు లేకుండా వుండేను. మక్కామశీదులో ఒక వరాహంబుపుట్టి మహ్మదీయులకు వైరంబు బుట్టేను. బెజవాడ వరకు తీసుకొని వచ్చేను. అక్కడ అదృశ్యమై లక్షోపలక్షల జనాన్ని హతము జేసేను. నూరు పుట్ల నల్లులురాలేను. తిరుపతి వేంకటేశ్వరుని సముఖమున ఒక విష్ణుభక్తుడు పుట్టి భూమిమీదకు వచ్చి 'శివా' అనేవాక్యము ఎనిమిది ఘడియలు లేకుండా చేసేను. అమావాస్య రోజున చంద్రోదయ మయ్యేను. చంద్రోదయమవు సరికి అనేక విరక్తులు కలిగేను. వీరసాహసులైనవారు వీరాకాసులుగట్టి నా మరము దగ్గరికొచ్చేరు మరములో ఆరెదొండ తీగ చుట్టుకొని, ఏడు దొనములు పూజలేకుండా వుండేను. ఇది చూచి నా భక్తులైనవారు సాహసము చేత నా తీగనంతా ఖండించి సాహసముచేత మెరములోనికి పోయి లక్షాపదకొండు వేల అయ్యలు గండకత్తెరలు మెడకు వేసుకుని హరహరాయని మృతిచెందేరు సూర్య చంద్రాదులు దిశలు దప్పేరు భూమి కుమ్మరిసానవలే గిరగిర తిరిగేను ధరణీతలంబు తల్లక్రిందులయ్యేను అప్పుడు సమాధిని పగులగొట్టుకొని శ్రీ వీరభోగవసంతరాయలు రక్తవసంతములాడుచూ వచ్చేను. సీమనుంచి లక్ష్మీదేవి వచ్చేను. జనులందరూ వైభవముగా నుండేరు రామరాజ్యము జూచేను. కావేరి మేరదప్పి వచ్చేను ఘనమైన పటణములన్నీయూ బోయేను. దొమ్మరివారలు దొర లయ్యేరు. దొడ్డవారలందరూ చెడేరు. ఉల్లిగడ్డకు నొక్కగురువొచ్చేను. నా కాలజ్ఞాన శ్రవణంబును నిత్యమెవరు చేయుచూ పూజింతురో వారికి ఇహపరసౌఖ్యములు కలిగేను నేను వచ్చునంతలో ఎన్నో వికృతంబులు పుట్టేను. అన్నాజయ్యా నీవు బ్రహ్మావతారుడవు నేను మహావిష్ణువును. శంకరుడు అనందభైరవ యోగియై రాజ యోగమున వున్నాడు నేను కొద్ది కాలముననే వీరప్ప అను నామమును విడచి, శ్రీ వీరబ్రహ్మేంద్ర అవతారమున బోవలయును కాబట్టి నీవు ఈ మరమునందే. అచ్చమ్మ గారు, నీవును వుండవలయను అని అష్టాక్షరీమంత్రమును ఉపదేశించెను అదే సమయమునకు అచ్చమ్మగారు తన కుమారుడయిన బ్రహ్మానందరెడ్డిని వెంట బెట్టుకుని వచ్చేను వివరములడిగిన పిదప స్వామివారు నొసటిమధ్యన బొటనవ్రేలితో నొక్కి పది నిముషముల తర్వాత కన్నులు తెరువమని ఆదేశించిరి తరువాత కన్నులు తెరచిన

బ్రహ్మానందరెడ్డికి మసకగా కన్పించసాగెను. పరమానందము పొందిన ఆ భక్తుడు స్వామిని కీర్తించి, తన వృత్తాంతమును స్వామివారి నుండి యిటుల తెల్సు కొనెను పూర్వజన్మమున పతివ్రతయైన నీ యిల్లాలి నేత్రములను నీట కలిపితివి. అందులకే నీకీజన్మలో అంధత్వము ప్రాప్తించినది. ఏమైననూ పూర్వము నీ సాధు సేవలు, భగవదానుగ్రహము వలన నీవు మరల దృష్టిని పొందగలుగుచున్నావు నీకు పంచాక్షరీ మంత్రమును ఉపదేశించుచున్నాను అని పలికెను. స్వామివారు యిచ్చట తమ ఈ అవతారమునకు మూడు నామములున్నట్లు చెప్పియున్నారు బాల్యమున పధ్నాలుగు సంవత్సరముల వరకు వీరంభొట్లయ్యగా, తరువాత వీరప్పయాచారి అనియూ, అటు తరువాత వీరబ్రహ్మం అనియూ పిలవబడెదను. మూడు ప్రదేశములలో మూడు నామములతో పిలవబడెదను నన్ను తెల్సుకోగలిగినవారు యీ పదునాల్గు లోకములలో లేరు. నేను మాత్రము అందరినీ ఎరుగుదును అని చెప్పెను. తరువాత బ్రహ్మానందరెడ్డిని, అచ్చమ్మగారిని, అన్నాజయ్యను అదే మఠమున నుండునట్లు ఆదేశించిరి.

## బనగానపల్లె నవాబుకు మహిమలు జూపుట:

## కాలజ్ఞానమును చెప్పుట

ఒకనాటి ఉదయముననే బనగానపల్లి నవాబుగారు పల్లకీ పంపించి, వీరప్పయ్య స్వామి వారిని సగౌరవముగా తమ మహలుకు రప్పించుకొనిరి స్వామివారిని పూజించి, స్వామివారి మహత్యమును పొగడుచూ, తను యిచ్చు విందు ఆరగింపమని కోరెను అందులకు శ్రీ వీరప్పయ్యస్వామి చిరునవ్వుతో అంగీకరించిరి. స్వామివారి మహిమను పరీక్షింపదలచిన నవాబుగారు ఒక బంగారు పళ్ళెమునందు మాంసాహార పదార్థములను తయారు చేయించి పెట్టెను. భవిష్యత్‌ను వ్రాయగలిగిన మహాదేవునకు ఆ విషయము గ్రహించుట ఒక చిత్రము కాదు కదా? పళ్ళెముపైనున్న పట్టువస్త్రము తీయునంతలో మాంసాహారము సువర్ణ పుష్పములుగా మారిపోయి, నవాబుగారికి కనువిప్పు కలిగించెను నవాబుగారు క్షమాపణలు చెప్పుకొనిన స్వామి నవాబుగారికి హితోపదేశముచేసి, రాజనీతిని గరిపి, నవాబుగారి కోరిక మీద కాలజ్ఞానమును బోధించెను

పురజనులందరినీ పిలిపించి సభచేసి అందరికినీ కాలజ్ఞానమును బోధించెను. మహాజనులారా ఈ కాలజ్ఞానశ్రవణము వలన సకల సౌభాగ్యములు కలుగును నేను ఈ కలియుగము నందు దుష్టశిక్షణ, శిష్టరక్షణ కొరకు 5000 సంవత్సరమునందు వచ్చెదను

వీరభోగవసంతరాయుడి అవతారమున నేను వచ్చులోపల ఈ భూమిపై అనేక వింతలు, విశేషములు కన్పించును చెప్పెదను వినుడు ఈతచెట్టొకటి పుట్టి రాత్రులయందు పరుండి పగలు నిలుచుండి వుండును. ఈ విధముగా ఎనిమిది సంవత్సరములుండి శ్రావణశుద్ధలకు ఆ చెట్టు పడిపోవును అది మొదలు దేశమున క్షామములు కలుగును. ఇంకొక విచిత్రము తెల్పెదను కలియుగము 5097 సంవత్సరము ధాతృనామ సంవత్సరము మార్గశిరమాసము మొదలుకొని, ఈశ్వరనామ సంవత్సరము మాఘమాసము లోపల గోలకొండ, కొండవీడు, వినుకొండ, తాడిపర్తి, గుత్తి, బళ్లారి, నెల్లూరు, మునిమడుగు, యీతముక్కల, గుంటూరు, మంగళగిరి, బెజవాడ, కంభం, కర్నూలు, మార్కాపురం, తంజావూరు, పుష్పగిరి, కంచి, మైసూరు, చెన్నపట్టణము, ఈ ప్రదేశములలో రూపాయికి చిట్టెడు బియ్యం అమ్మబడును. అరికాలిమంట నెత్తికి వచ్చును. జనులు ఆర్భటించి అరచి చచ్చేరు. అష్టాదశవర్ణముల కారుమేక కసురు తినేరు వర్ణాశ్రమధర్మములు పాడయిపోవును ఆచారములుండవు అనాచారములు పెరిగేను వావి వరుసలు వల్లకాటిలో చేరేను. ఒకరి శ్రమ మరియొకరి పాలయేను పతిభక్తి పాడయిపోయేను. భార్యాభర్తలకు వైరంబులు బుట్టేను కామ క్రోధంబులు హెచ్చేను. న్యాయమడంగిపోయేను ఈ గ్రామమున ఇంకొక విచిత్రము జరిగేను. నా భక్తురాలైన గరిమిరెడ్డి అచ్చమ్మగారి వంశము నిర్వంశమైపోయేను. ఆమె వంశమున ఒక్కరునూ మిగలరు. ఆమెకున్న గోవులన్నియూ నశించును. ఆమె యింటనే గోవులు కాయుచూ వ్రాసిన కాలజ్ఞానమును ఆమె యింటనే ఒక పాతర యందుంచితిని ఆ పాతరపైనొక చింతచెట్టు మొలచును నేనీ కలియుగంబున వీరభోగవసంతరాయుడనై వచ్చుటకుముందు ఆ చింతచెట్టుకు చేమంతిపూలు పూయును. గ్రామమధ్యనున్న జువ్రేరుపొంగి గ్రామమున మూడువంతులు నష్టమై పోయేను. తదాది నవాబు పాలన చెడేను నవాబునకు రాబడి తగ్గేను. సూర్య చంద్రులున్నంత కాలము, అచ్చమ్మ గారిచే కట్టింపబడిన యీ మఠమునందు లింగా కారమునకు పూజలు జరిగేను. అని ముగించెను. ఈసందర్భమున నవాబు అచ్చమ్మ గారు కట్టించిన మఠమునందలి ఈశ్వరాభిషేకమునకు గాను నిత్యనైవేద్య దీపారాధనల కొరకు, కొంతభూమిని కానుకగా సమర్పించిరి బనగానపల్లెకు రెండుమైళ్ళ దూరములోనున్న మాగాణి భూమిని యాభయి ఎకరములు స్వామి వారి మఠమునకు వ్రాసి యిచ్చిరి. 123 సంవత్సరము ఈ వీరప్పయ్యావతారముండు నటుల కాలజ్ఞానమునందున్నది

# శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి అవతారముతో కందిమాల్లాయపాలెం జేరుట. అక్కడ మహత్తులు చూపుట

దక్షిణ భారతేదేశమున కడపజిల్లా బద్వేలు తాలూకా కందిమల్లయ్యపల్లె యందు పోతులూరి వీరబ్రహ్మంగారు అని ప్రసిద్ధి చెందిరి వడ్రంగి వృత్తినాధారముగా పనిముట్లు చేయు వృత్తి యందుండెను. పనిముట్లు ఎప్పుడు చేసెదరో ఎవరునూ చూసి వుండలేదు. కానీ ఎవరి పనిముట్లు వారికి సకాలములో అందచేసెడివారు. ఎప్పుడునూ, ఏవో ప్రసంగములతో కాలము వెళ్ళబుచ్చుతూవుండే బ్రహ్మంగారు తెల్ల వారేసరికి ఎవరి వస్తువులు వారికి తయారుచేసి యిచ్చుట అనునది ఒక చిత్రమో, మాయయో అర్థమయ్యేది కాదు.

ఆ గ్రామస్థులందరూ; గ్రామదేవతయైన పోలేరమ్మకు జాతరచేయ తలపెట్టిరి

అందులకు శుభముహూర్తమును నిర్ణయించి, కంది మల్లారెడ్డి అను గ్రామపెద్ద తానే అన్నియూ సమకూర్చి, అన్ని ఖర్చులు భరించిరి. జాతరకు చందాలు వసూలు చేయుటకు గ్రామపెద్దలు కొందరు యింటింటికి బయలుదేరి సొమ్మును వసూలు చేయుచుండిరి. వరుసలో శ్రీ వీరబ్రహ్మంగారి యింటియందు ఆగి చందా అడిగిరి స్వామివారు యివ్వలేనని చెప్పిన మాటకు పెద్దలు హేళన చేసిరి అప్పుడు స్వామివారు వివా యిష్టప్రకారమివ్వగలవాడను. అమ్మవారికి జాతరచేయు స్థలమునకు పోవుదము రమ్మని తోడ్కొని పోయిరి. అక్కడ పెద్దలందరూ రచ్చబండపై కూర్చుని వుండగా, స్వామివారు చుట్టను చేతబట్టుకుని అమ్మవారిని నిల్పిన స్థానంవంక చూచి "అమ్మా పోలేరి నిప్పుతే" అని స్వామివారడగగానే, అంత ఆ పోలేరమ్మ తల్లి, అదృశ్యరూపమున, నిప్పులుంచిన మూకుడును తీసుకొచ్చి స్వామి వారికిచ్చి, అచ్చటనే అదృశ్యముగా ఉండెను. స్వామివారు చుట్ట వెలిగించుకొని, 'తల్లీ తిరిగి తీసుకువెళ్ళ'మని స్వామి వారనగానే, తిరిగి అమ్మవారు దానిని తీసుకొని వెళ్ళి యధా స్థానమునందుంచెను. ఈ దృశ్యమును చూచిన ఊరిపెద్దల్ను పురజనులు స్వామి పాదపద్మములపైబడి తప్పులు మన్నింపమని వేడుకొని, జ్ఞానోపదేశమునిచ్చి మమ్ము కటాక్షించమని వేడు కొనిరి. అంతస్వామివారు వారికి భక్తిజ్ఞానమును బోధించిరి భక్తి అనునది ఒక మహత్తరమైనది. దీని సరియైనది, అంత పవిత్రమైనది మరొకటి లేదు. భక్తి ఈ జగత్తును నిర్ణయించు ఈశ్వరునిపై మాత్రమే అధికమైన యిష్టత కలవారికి మాత్రమే కలుగును ఇతరులకు కలుగదు. వేలకొలదిమందిలో ఒకరు మాత్రమే మోక్షము కొరకు ప్రయత్నించును అట్లు ప్రయత్నించిన అనేక మందిలో ఒకరు

మాత్రమే భక్తి కలిగిన వారై వుందురు అట్టి భక్తి తత్పరులైన హరియందు అనేకులలో ఒకరు మాత్రమే పరమాత్మనెరిగి ముక్తిని పొందుటకు అర్హుడగును భక్తి వలననే శాశ్వతమైన ఆనందమును, మోక్షమును పొందవచ్చును మరియొక ఏ సాధనము వలన మోక్షమును, ఆనందమును సాధింపజాలము అని స్వామి వారు కందిమల్లయ్య పల్లి వాసులకు హితవును చేసిరి. కృత, త్రేతా, ద్వాపర యుగములలో బోధనము, వైరాగ్యము ముక్తికి సాధనములు కలియుగ మందు "భక్తి" మరియు "దానములు" మాత్రమే ముక్తికి కారకములయి వున్నవని తెలియ వలయును భక్తి, జ్ఞానము అనునవి వేరు వేరుగా అనిపించిననూ, గమ్యము మాత్రము రెండిటికీ ఒకటే అయివుండును అని బోధించెను.

## స్వామివారు శ్రీ గోవిందమాంబను వివాహమాడుట

కందిమల్లాయపాలెము నందు కొంతకాలము గడిన తర్వాత రాజయోగము పొందవలెనను కోరిక జనియించగా, అచటనుండి బయలుదేరి పెదకొమెర్ల అను గ్రామముజేరిరి ఆ వూరియందు శివకోటయాచార్యులను విశ్వబ్రాహ్మణ కులస్థులు ఒకరు ఈశ్వరోపాసనను చేసి ఒక స్త్రీ సంతానమును పొందిరి. ఆమె ఆ ఈశ్వరీదేవి అంశయని తెలియుచున్నది ఆమెకు గోవిందమ్మను నామకరణము చేసిరి. ఈమెకు పన్నెండు సంవత్సరముల వయసు వచ్చేసరికి వివాహముచేయ నిశ్చయించిరి. తన మనసున వున్న మాటను తల్లిదండ్రులకు చెప్పి శ్రీమన్నారాయణాంశ సంభూతుడైన వానినే వివాహము చేసుకొందునని తెలియ జేయగా, కోటయాచార్యులవారు చింతించిరి. చివరకు తనకు కన్పించిన శ్రీ స్వామివారినే, ఆతడే తనకు తగిన భర్తయని తన తండ్రికి తెలియజేయగా, కోటయాచార్యులవారు కోపగించుకొనిరి.

పరమేశ్వరావతారమున భూమిపైన జన్మించిన శ్రీ బ్రహ్మంగారిని శివకోటయ్య సామాన్యునిగానే తలంచుచూ తన కుమార్తె చెప్పెడు విషయములన్నియూ, కల్పనలని తలంచెను ఆ పెదకోమెర్ల గ్రామమునందు ఆరునెలలనుంచి జబ్బుతో బాధపడుతూ, ఒక రెడ్డి చనిపోగా అతని బంధుమిత్రులు ఆతనిని దహనము చేయుటకు స్మశానమునకు స్వామివారువున్న దేవాలయము మీదుగా తీసుకొనిపోవుచుండగా స్వామివారు చూచి, బ్రతికున్న వారిని స్మశానము చేర్చుట ఏమని అడిగి దింపుడుకల్లం దగ్గర ఆపి కట్లువిప్పండి అతడు బ్రతికియే వున్నాడు అని పలికిరి దింపుడుకల్లం దగ్గర ఆ వ్యక్తిని తలనుండి పాదముల వరకు నిమరగా ఆ రెడ్డి బ్రతికి లేచికూర్చున్నాడు. ఈ సంఘటన చూసిన పౌరులందరు, ఆశ్చర్యముగా, స్వామివారి మహిమను తెలుసుకొని స్వామివారిని కీర్తించిరి.

శివాలయము నందలి పూజారి బ్రహ్మయ్య అను ఆయన స్వామివారి చెంతకూర్చుండి, మానవునకు ధ్యానము కావలయునా? లేక బ్రహ్మజ్ఞానము ముఖ్యమైనదా? అని ప్రశ్నించగా స్వామివారు ఇట్లు చెప్పిరి నన్ను తెలుసుకోగలిగిన వారు లేరు నన్ను తెల్సుకోగలిగినవారు నాకు ప్రియమైన వారు. అందరియెడల సమదృష్టి గలవారు త్వరగా అంతర్ముఖముగా నిర్గుణునిగా బహిర్ముఖమునందు సగుణముగా దర్శించగలరు సాధారణమగు కంటికి రూపమును, జ్ఞానచక్షువు కలవానికి రూపములేని వానిగనూ దర్శనమిచ్చి అమితమైన ఆనందమునిచ్చువాడను నేను. జ్ఞాన దృష్టిలేకనే నన్ను స్మరించలేని వారిని నేను సదా కాపాడగలను. వైరాగ్యమార్గములనున్న యెడల వారలను శోధించువాడను హఠయోగము సాధించువారికి 'నా' అనునది ఎక్కువ ప్రీతి పాత్రమైనది అందువలన వారిని నేను మిగుల శోధించుచున్నాను. ఎవరయితే నన్ను నమ్మి అన్నింటికినీ నేనే వున్నానను భావముతో అహంకారమును వీడి, నా నామస్మరణతో గడుపువారికి నేను తోడై వున్నాను కర్మ,భక్తి, జ్ఞానము అను ఈ మూడింటిలో ఏది యిష్టమో దానినే ప్రతి ఒక్కరూ నమ్మవలెను కనుక మనస్సును అదుపులో పెట్టుకుని కర్మనాచరింపుడని బోధించెను

స్వామివారు ఒక వ్యక్తిని బ్రతికించుట తెల్సుకొనిన ఆ వూరి ప్రజలు స్వామివారిని పరీక్షించుటకు ఒక వ్యక్తిన్ని పాడెపై పరుండబెట్టి, స్వామివారున్న గుడిముందునుంచి తీసుకొని పోయిరి అది చూచిన బ్రహ్మంగారు నేనేదో మంత్రగాడినని తలచి, నన్ను పరీక్షించుటకు, చనిపోయాడని అబద్ధముచెప్పి కాటికి తీసుకొని పోవునట్లు నటించు చున్నారు. అని దగ్గరకు వెళ్ళి చనిపోయినవారు పిలిచినా పలుకరు గదా, యీతని ఆయువు తీరినది అని పలికి ఆలయములోనికి వెళ్ళిపోయిరి అంత ఈ కుఱ్ఱవాళ్ళు పాడెపైనున్న వాని కట్లువిప్పి చూడగా, నిజముగనే ఆతడు మృతుడైయుండెను దీనిని చూచి అందరూ, దుఃఖితులై ఏమిచేయవలెనా అని ఆలోచనలో నుండగా, వారిలో ఒక విజ్ఞత కలిగిన ఒకరు, స్వామివారిని మనము తక్కువగా అంచనావేసితిమి వారు మానవులు కాదు వారు దైవాంశసంభూతులు శంకరస్వరూపులు కావున వారి పాదములే మనకు శరణ్యములని అందరూవెళ్ళి స్వామివారిని ఆశ్రయించి తమ తప్పు మన్నింపప్రార్థింప, బ్రహ్మంగారు ఆ వ్యక్తి శిరస్సు నిమరగా, ఆతడు దిగ్గున లేచికూర్చున్నాడు వారు తమ అపచారమునకు చింతించుచుండగా స్వామివారది గాంచి, మీరు నాకు తెలుసుగానీ, నన్ను మీరు తెల్సుకోలేకపోయిరి నన్ను తెలుసు కోగలిగిన వారిని నేను కాపాడుచుందును. మీతప్పు మీరు తెలుసుకొనినారు సంతోషమే ఇప్పుడు నేను మీకు కాలజ్ఞానమును తెలియజేయుచున్నాను. శ్రద్ధగా విని పరిశుద్ధులై మెలగండి అని వారికి కాలజ్ఞానమును ఇట్లు చెప్పిరి.

# పెదకొమెర్ల గ్రామస్థులకు కాలజ్ఞానమును చెప్పట

కలియుగమున 5000 సంవత్సరముల తరువాత పుణ్యభూమి అయిన ఈ భరతఖండము నందు ధర్మము నశించును భారతీయులకు పరధర్మము ఆచరించు దుర్గతి పట్టును నిజము అబద్దమగును. ఇహపరసౌఖ్యములనిచ్చు పరమార్థిక విద్యలు తేలికగును క్షణికములైన సుఖములు కొరకు మానవులు వెంపర్లాడుదురు నీతి, జాతి, కులగోత్రములు, వావివరుసలు నశించిపోవును. ఆడ మగ అను రెండే జాతులు మిగులును విస్సన్న చెప్పినదే వేదమని, మంత్ర తంత్రములే యోగములని, వేదములు బ్రాహ్మణ స్వార్థమునకే కల్పించబడినవని, వర్ణాశ్రమ ధర్మములు బూటకములని, భక్తి జ్ఞాన వైరాగ్యములు పనికిమాలినవారికని, వింతవాదనలు కలుగును భక్తులు భగవంతునికై వెదకుచుందురు. భార్యాభర్తలు, అక్క చెల్లెళ్ళు, అన్నదమ్ములు, గురుశిష్యులు అందరూ ఒకరినొకరు మోసగించుకొందురు ప్రకృతి ధర్మములు నాశనమైపోవును అకాలవర్షములు పైరులు నాశనమగును. పాడిపంటలు తగ్గిపోవును 'ప్రభవపార్థివమధ్యన ఖహంప్రళయము' వచ్చును కలియుగము 5000 సంవత్సరములు తర్వాతవచ్చు ప్రభవపార్థివ నామ సంవత్సరములలో ప్రపంచ మంతయూ ప్రళయములు సంభవించును అగ్ని పర్వతములు ప్రేలును, గాలి వానలవల్ల నాశనము, యుద్ధముల వల్ల మరణింతురు. ప్రాణముల్లేని బండ్లవల్లను, గ్రామాలలోనూ పట్టణాలలోనూ ప్రజలు సయోధ్యలేక కొట్టుకు చత్తురు. కచ్చకొట్లాలకు ప్రజలే రాజులయ్యేరు. జాతిబేధములు పెచ్చుపెరిగేను కలియుగము 4081 సంవత్సరము మొదలుకొని నేను చెప్పబోవునవి జరుగును. కాశీలో భక్తులుందురు పడమట స్త్రీల బలముతోనుండును ఉత్తరదేశమున కత్తులతో ఆడుకొందురు. దక్షిణదేశమున తగవులచే కొట్టుకొని చత్తురు. వేదవిద్యలు విప్రులు విడిచి ఛండాలు రయ్యేరు సోమయాజులు జీవహత్యలు చేసేరు ప్రయాగతీర్థమందు భక్తులు నిలిచేరు. పల్లెలు పట్నాలగును తల్లిదండ్రులు పిల్లలను విక్రయించేరు. ప్రభవనామ సంవత్సరమునుండి, వీరభోగవసంతరాయుడనైన నా కీర్తి ప్రభవించేను జితేంద్రియులు ఆయుధములచే కన్నుమూసేరు వైరములచేరాజులు ప్రాణాలు కోల్పోయేరు. పితృక్రియలను మరచేరు శ్రుతి ధర్మాలు శూద్రులు చెప్పేరు. అది విని విప్రులు నిందితులైచరించేరు దేవతాస్థలములు విప్రులయిండ్లు, ఆశ్రమ భూములు చెడిపోయేను దేవాలయములలో నీచజాతివారు పూజలు చేసేరు. రాజులు ప్రజలకు భయపడేరు తల్లితండ్రి కొడుకు ఒకరినొకరు నమ్మరు వారి వారి యిష్టాను సారం ప్రవర్తిస్తారు. వేదార్థ ప్రవచనములు తగ్గిపోయేను. శూద్రులు

రాజరికం వెలగ బెడతారు. క్రూరమృగాలకారణాన జననష్టం జరిగేను ద్రవిడ, అభుర, తురుష్క, బర్బర, పుళిందాదిదేశాల్లో జబ్బులవలన ఎక్కువ మరణాలయ్యేను క్షత్రియుల ప్రాబల్యం నశించి, శూద్రుల ప్రాబల్యం పెరుగుతుంది. రాజుల సిరిసంపదలు పోయేను. రసగంధ ద్రవ్యాలు పసచెడేన్ను. రాణా స్త్రీలు రచ్చకొట్టాలలో రాజరికం చేసేరు ఆకాశంబున రక్తపీత వర్ణంబులుగా లోకాన కన్పించును. అందువలన కొందరు నశించేరు. నాగుమల్లె దారుణంగా నశించిపోతుంది ఆకాశాన కొండంత నక్షత్రం బుట్టేను. ఆచుక్కనుచూచి అనేక నరులు నశించేరు ఇట్టి కాలమున దుష్టశిక్షణ శిష్ట రక్షణ కొరకై వీరభోగవసంతరాయుడనై నేను వచ్చేను. వచ్చుటకు ముందు పనులన్నియూ ఘడియలో అగును మనోయోగమూ చేతమాట తెలిసేను ఎఱ్ఱచీమ ఏనుగు రూపాన కాన్పించేను. మనుష్యలతో మాయాశక్తి మాట్లాడేను. పంది కడుపున ఏనుగు పుట్టేను. కోడిమనిషి కూత కూసేను మేకకు అయిదు తలల మేకపోతు పుట్టేను కావేరీ తీరమందు కలహంబులు పుట్టి ఏడు పుట్ల నల్లలు ఒక్క ముహుర్తాన రాలేను. బొడ్డు ఆరని బిడ్డలు మాట్లాడేరు. ఆవు కడుపున దూడ అంతర్గతంగా జనులకు కనబడేను. మేకపోతు ఆవులా అరచేను అందున కొందరు జచ్చేరు. మంచి బెల్లం చేదయేను. వేపచెట్టున అమృతంపుట్టేను

అమావాస్యనాడు పిడుగులుపడి నక్షత్రాలు రాలేను కొండలయందు విపరీతమైన కేకలు పుట్టేను. ఆరునెలల బాలుడు పాడేను. ఆవుకు అయిదు శిరస్సులు రెండు యోనులుగా పుట్టేను. గోవు కడుపున మనిషి పుట్టేను. వాడు మహాతర్కవాదములాడేను. ఇత్తడి బంగారముగా అమ్మేను. నరులకు ఎన్ని సుఖాలువచ్చినా, అక్కడికక్కడే నాశనం అయ్యేను మీ సుఖం మీకే తెలిసేను నాగమల్లె అతి చిత్రంగా నశించేను నాగుమల్లి రీతిని జనులు నాశనంబయ్యేరు ఇంకా ముందు ముందు కష్టాలు బాధలు కలిగేను నా మహిమ లెరిగినా భక్తులు నన్ను కొలిచేరు వారిని నేను కాపాడేను.

సూర్యుని మహిమలు జనులకు కనబడేను సూర్యుడు పచ్చని రూపమున, మనిషి రూపమున గానంబడేను భావనామసంవత్సరం శ్రావణ బహుళలు నాటికి నదీనదములు పొంగిపట్నాలు పల్లెలు పాడయ్యేను. బహుధాన్యనామ సంవత్సరములో ఇరువదిఐదు పట్నాలు రక్తపాతమై పాడయిపోయేను భూమినుండి ఓంకారము పలికేను. పల్నాటిసీమలో బ్రహ్మణునియింట కాకరచెట్టు చింతకాయలు కాచేను. బనగానపల్లెలో గల కాలజ్ఞానముల పాతరపైని చింతచెట్టుకు జాజిపూలు పూసేను. కనకదుర్గకొండలో కలకలములు బుట్టి పగిలేను. కొంతకాలమునకు దుర్గాంబ నిలుచుండుటకు వీలులేక కంచిమల్లయ్యపల్లి చేరేను ఏడుపుట్ల నల్లలు ఒక్క ముహుర్తంలో కృష్ణమ్మవద్ద రాలేను సూర్యుడు వణికేను.

నా రాకకై నాభక్తులు ఎదురు చూచేరు. పాపాఘ్నిమరము మహోన్నతమయ్యేను. కుంభకోణము గుడి కూలి కుంభుని రూపు మాసేను పోతులూరి వారి భక్తులు జ్యోతిస్వరూపులై వచ్చేరు అయిదేండ్ల బాలుడు భవిష్యత్తు చెప్పేను కాశీదేశమందు ఘనమైన చుక్కలు పంచవన్నెలుగా ప్రభలమయ్యేను జగన్నాయకులు జడలుపెంచి చంద్రగిరి చేరవచ్చేను అదే మీకు నిదర్శనం. విశ్వకర్మ విస్తరించియుండి వింతలుచేసేను

పుణ్యభూమి భారతాన, ప్రపంచమంతటా, దుర్నీతి, చెడులక్షణాలు కన్పిస్తాయి. మనుష్యులలో, అసత్యం, క్రూరత్వం, మాయలు, మోసాలు, నిర్దయ, అనాచారాలు, అనవసరపు తగాదాలు అధికమవుతాయి. మనుష్యుల్లో కామాశ అధికమౌతుంది వావివరుసలు తప్పుతారు మంచీ చెడుల జాతి తెలియకుండా పోతుంది కుల సంకరములు అధికమౌతాయి. కరువులు, కాటకాలు కారణాన ప్రజాక్షయము అనివార్యమౌతుంది.

విక్రమనామ సంవత్సరమున భూమిపై విపరీతాలు పుట్టి ధనికులు దరిద్రు లయ్యేరు గుంటమిట్టు సమమయ్యేను నూటికి 17మంది మరణించేను. నా భక్తులు రక్షింపబడేరు. నాచేదెల్పబడిన ద్వాదశాక్షరీ మంత్రమును నిష్టతో 12000సార్లు జపించిన వారికి నేను తప్పక ప్రసన్నుండనై కాపాడి యిహ పరసౌఖ్యంబు లొసగెదను

రక్తాక్షినామ సంవత్సరమున మార్గశిరశుద్ధ సప్తమీ దినమున చెన్నపట్టణమున ఒక బ్రాహ్మణగృహమున ఏడు సంవత్సరముల బాలికకు ఒక మగశిశువు జన్మించేను ఆ శిశువునకు నాలుగు హస్తములు, మూడు కాళ్ళును, శిరస్సున కొమ్ములుండును ఆ బాలుడు ఇరువదిరెండవ దినములు జీవించి, యిరువదిమూడవ దినమున 'శ్రీవీరభోగ వసంతరాయలు'గ జన్మించును 32 బిరుదులతో కొల్హాపురి మహాలక్ష్మిని వెంటబెట్టుకొని దుర్మార్గులను హతము చేయుటకు వచ్చునని చెప్పి మరణించును. ఇదే మీకు గురుతు.

కర్నూలుకు ఉత్తరమునగల శివాలయంబున వేపచెట్టు బుట్టును. దానికి పార్థివ నామ సంవత్సర కార్తీకశుద్ధ౧లు లగాయతు ముప్పదిరెండు రోజులు మహా వుత్సవములు జరుగును ముప్పది మూడవ దినమున అనేక చెడువాసనలు పుట్టి ఆ వాసనలకు అచటి జనులకు బొబ్బలుపుట్టి మరణించేరు

ఇట్లు అనేక మహోత్పాల వలన మరణించేరు నిశ్చల మనస్కులై యోచించిన మీకేమీ భయము కలుగదు భయము కలిగిన బ్రహ్మమును గాంచలేరు నిశ్చలమైన మనస్సుతో నిజమును మీలోనే చూడండి. పలుగురాళ్ళు మెత్తని పరుపులుగా పరిగణించబడేను ఈ కలియుగంలో సేవలందాలనే దుర్బుద్ధి, హూణవిద్యల కారణాన జ్ఞానరహితులై న్యాయాన్యాయాలను తెలిసికొనలేక చెడిపోవుదురు

సువర్ణముఖినదినుండి పదకొండుమంది భక్తులు పుట్టేరు బంగాళాదేశమందు జనులు జీర్ణమైపోయేరు విప్రులవల్ల ఆచారాలడుగంటేను రాజులు బలహీనులై నశించేరు నా భక్తులైన వారికి ఎప్పటికప్పుడు నిదర్శనం కన్పించేను. జితేంద్రియుల నెత్తురు భూమిమీద ఏ తీరున పారునో ఆ రీతిన భూభారమడగేను దుర్మార్గుల నెత్తురుచేత భూమి తడిచేను సీమచోరులు గర్భిణీ స్త్రీలకు గర్భస్రావాలు చేసేరు క్షత్రియ కులమునాశనమయ్యేను ధాత నామసంవత్సరాన ధారుణియందు క్షోభంబు జనించేను. ఇతర దేశీయులు ఎడతెగని కష్టములలో నుండేరు బహు ప్రళయంబుల చేత బాదయ్యేరు రాజ్యములు అరిష్టముల పాలయ్యేను. ఇంటికి యజమాని లేకుండేను స్త్రీబాలవృద్ధులు అతి కష్టంబులు పాలయ్యేరు రచ్చకొట్టంబులలో రాణాస్త్రీలు రాజరికంబు చేసేరు.

ఆనందనామ సంవత్సరములోగా జరుగు మరికొన్ని విపరీతాలు చెప్పేను వినుడు, మూడు మాసముల బాలుడు మదముతో పెద్దలకెదురు చెప్పేను. చిన్నవాళ్ళ వూహలకు పెద్దవారి వూహలకు పొంతన లేకుండేను. మనుషుడు నక్క అరపు అరచేను. నక్క పంది అరుపుఅరచేను. పంది నాయనా అని అరిచేను. దున్నపోతు యముని కేకబెట్టేను ఆకశాన శబ్దాలు పుట్టేను. దూర్జటి వ్యయనామ సంవత్సరమును, దక్షిణాయనమందు ప్రళయ నక్షత్రము కన్పించిన ముప్పది దినములకు మనుష్యుల ముఖమున అరిచేతులలో పుండ్లుపుట్టేను. పిక్కలువాచి నడవలేని స్థితి గలిగేను. అనేక వ్యాధుల వలననూ, గాలి వలననూ, పిడుగుల వల్లనూ, అగ్ని వర్షము చేతను, వడగాడ్పులచేతను, కొండ శిఖరముల్కు బ్రద్దలగుట చేతను, విషజ్వరంబుల వల్లనూ దుష్టులందరూ రాలిపోయేరు ప్రస్తుతానికి యిదియే చెప్పెదనని పిదప మరికొన్ని చెప్పగలవాడనని తెలిపి ముగించెను

ఆ గ్రామవాసులు అనేకులు స్వామివారికి పాదదాసులుగా మారిననూ, గోవిందమాంబగారి తండ్రికోటయాచార్యులవారు మాత్రము దిగిరాకుండిరి. ఈతడు వేషధారియని, తాంత్రికములు చేయగలవాడనియు తలంచుచుండెను. ఇది యంతయూ తిలకించుచున్న స్వామివారు ఆలోచించి ఒకనాడు కోటయాచార్యులవారి కలలో కన్పించి, నీ కుమార్తెను ఆలయమునందున్న అవతారమూర్తికిచ్చి వివాహము చేయుమనియు, లేనియెడల గోవిందమాంబ ప్రాణత్యాగము చేసుకొనునని చెప్పి అంతర్ధానమయ్యేను. ఆ వెంటనే స్వామివారు ఒక ఎఱుకలసాని రూపమున గోవిందమాంబ తల్లికి స్వప్నంబున సోదెలసాని రూపంబున గాన్పించి, ఆ శివాలయము వీధియందు వచ్చుచుండగా, ఆ వీధినందలి స్త్రీలు అందరూను సోదెలమ్మను పిలిచి ఆమె చెప్పు వివరములు అర్థముచేసుకోలేక, గోవిందమాంబ తల్లిగారికి యీ విషయమును తెలియజేసి,

ఎఱుకలసానిని వారింటికి తీసుకునిపోయిరి. గోవిందమాంబ తల్లిగారు విషయము గురించి అడుగగా, నేను ప్రార్థించినంతనే సకల దేవతలూవచ్చి నాకు సహకరించగలరు. కావున దక్షిణ సమర్పించి నీ ప్రశ్నలు అడుగుము అని చెప్పగా,తన కుమార్తెను గూర్చి అడగకనే సోదిసాని యిటుల చెప్పెను. నిన్నటిరో జననీ కుమార్తెకు ఎదురుగా ఒకపురుషుడు కూర్చుండెను ఆతని జూచిన్నటినుండి నీ కుమార్తె నిద్రాహారములుమాని, మనంబున ఆ పురుషునే తలంచు చున్నది అతడు మామూలు మానవుడు కాదు. భగవానుడే సన్యాసి రూపమున వచ్చి యుండెను. అఖిలాంద్రకోటి బ్రహ్మాండ నాయకుడు. అందుచేత నీ కుమార్తెను ఆతనికిచ్చి పెళ్ళిచేసిన సుఖించగలదు. అట్లు చేయలేనిచో నీ బిడ్డ ప్రాణత్యాగము చేయునని అఖిలదేవతలు సెలవిచ్చుచున్నారు.

శ్రీ స్వామివారు ఎఱుకలసాని రూపంబునవచ్చి సోదిచెప్పి వెళ్ళిన తరువాత తల్లి దండ్రులు గోవిందమ్మ దగ్గరకు వచ్చి విషయము విచారించి, సోదిసాని చెప్పినది నిజమని ఋజువు పరుచుకొని, గోవిందమాంబను స్వామివారికిచ్చి వివాహము చేయుటకు నిశ్చయించి స్వామివారిని తాము యింటికి తీసుకొని వచ్చుటకై బయలుదేరి శివాలయమునకు వచ్చి స్వామి వారిని తన యింటికి ఆహ్వానించిరి. బ్రహ్మంగారు సంధ్యా నుష్టానములను పూర్తి చేసికొని శివకోటయ్యగారి సహపంక్తిన భోజనమునపై కూర్చుండి. తనకు వడ్డన చేయవచ్చిన గోవిందమ్మ తల్లగారికి తను తెచ్చుకొనిని రాగిసంకటినే వడ్డించమని పలికిరి. స్వామివారు తెచ్చుకున్న మూటను విప్పినంతనే అందు వేడిగానున్న పంచభక్ష పరమాన్నములు కనిపించినవి. అవిచూచిన క్కోటయ్యగారు వారిభార్య ఆశ్చర్యపోయి, స్వామివారి మహిమలను తెలిసికొని, క్షమాభిక్ష వేడికొని తనకుమార్తెనుయిచ్చి వివాహము జరిపించిరి. కొన్నాళ్ళు అక్కడే వుండి, పిదప అచటినుండి కందిమల్లయ్య పల్లెకు చేరికొనిరి

స్వామివారు సతీసమేతంగా మహాక్షేత్రములన్నియూ దర్శించి చివరకు కందిమల్లయ్య పల్లి చేరిరి ఆ సమయమునకు కొందరు భక్తులు స్వామివారికి ఒక మఠము నిర్మించి అందు స్వామివారిని నివసించమని కోరిరి కొంతకాలమునకు స్వామివారికి ఒక కుమారుడు జన్మించెను. సిద్ధలింగయ్య అను పేరుపెట్టిరి తరువాత వరుసగా నలుగురు పుత్రులు గోవిదయ్య, శివరామయ్య, పోతులూరయ్య, ఓంకారయ్య అను వారలునూ, తరువాత శ్రీ వీరనారాయణమ్మ అను పుత్రికయు జన్మించిరి జ్యేష్ట కుమారుడైన సిద్ధలింగయ్యను శివకోటయ్యగారికి పెంపకమున కిచ్చిరి మిగిలిన వారికి వివాహములుచేసి తన శిష్యులతో కలసి ఆ మఠముననే సకలశాస్త్రమలును బోధించుచూ వుండిరి

# సిద్ధయ్యగారి జననము

కందిమల్లయపల్లెకు అతి చేరువలోనున్న ముడుమాల అను గ్రామములో దూదేకుల కులమున పీరయ్ సాహెబు, ఆడంబిఅను దంపతులకు సిద్ధయ్య అను పుత్రుడు జన్మించెను ఆతనికి విద్యాభ్యాస వయస్సునందు పాఠశాలకు పంపిరి. ఈ సిద్ధయ్య శాంతగుణము కలవాడు. అందరిబాలురకన్ననూ, వైవిధ్యముతో ప్రవర్తించుచూ, అందరికినీ, హితమును బోధించుచూ వుండెడివాడు. సిద్ధయ్యకు పన్నెండు సంవత్సరముల వయస్సు వచ్చుసరికి తనకు బ్రహ్మోపదేశమిచ్చు వారెవరాయని ఆలోచించుచూ, శ్రీ వీరబ్రహ్మేంద్రస్వాముల వారి యొక్క గొప్పతనమును చెప్పుకొనుటవిని, వైరాగ్యముతో తల్లిదండ్రులను వదలి కందిమల్లయ పల్లెను చేరెను అచటస్వామివారిని చూచి పరమశివునివంటి అయన తేజోమయమైన రూపమును, అచటి వారి శిష్యులనుచూచి అనందమునుచెంది, స్వామి వారిని ప్రార్థింప, వారు సిద్ధయ్యను ఆశీర్వదించి తన శిష్యునిగా చేసుకొనిరి. సిద్ధయ్యగారిని అనేక విధముల పరీక్షించిన పిదప ఒక సుముహూర్తమున బీజాక్షరసంహిత పంచాక్షరీ మహా మంత్రమును ఉపదేశించిరి. జ్ఞానతత్వము గలవాడవు కావున నీకు ఈ ఉపదేశ మిచ్చుచున్నాని తెలిపి, జ్యోతిస్వరూఢయిన ఆ పరమాత్మయందు మనస్సును కేంద్రీకరించుమని ఆదేశించెను కొంతకాలమయిన పిదప తారకోపదేశమును, పంచ ముద్రలను పట్టుట ఎటులనో బ్రహ్మంగారు, తన ప్రధమ శిష్యుడయిన సిద్ధయ్యగారికి తెలియజేసిరి. మన దేహమునందలి జ్ఞానేంద్రియములు కారణముగా, మానవుని శరీరమునందు కామ క్రోదాది అరిషడ్వర్గములను పెంపొందింపజేయుచున్నవి. వీటిని అరికట్టగలిగిన యెడల మానవడు జితేంద్రియుడు కాగలడు వీటిని అచరించుటకు పంచముద్రలను ముందుగా తెల్సుకొనుము

1. ఖేచరిముద్ర యనగా కనులు తెరచియైననూ, మూసికొనియైననూ, దృష్టిని భ్రూమధ్యమున నిలిపి వీక్షించుట
2 భూచరియనగా నేత్రములను రెంటిని ముక్కుయొక్క కొనపై నిలిపి వుంచుట
3. మధ్యమమనగా, నాసికామధ్యమున దృష్టినిలిపి, అంతర్లక్ష్యమున మనస్సును ఛేదించుట.
4 షణ్ముఖమనగా, రెండునేత్రములను రెండు చెవులను రెండు నాశికా రంధ్రములను మూసివుంచి త్రికూరస్థానమందు దృష్టిని నిలిపి చూచుట.

5 శాంభవీముద్రయనగా, మనస్సులోనుండు భావమును అంతరదృష్టియందుంచు కొని, అసాధారణ దృష్టియందు సర్వకార్యాచరణ చేయుట శాంభవి అని పిలువ బడును. ముందుగా ఈ ముద్రలను అలవరచుకొని, జ్ఞానమును, చిత్తమును రెంటినీ సమన్వయపరచి, ఏకముగాజేసి సాధించుకొనగలిగిననాడు తారకయోగ సాధన మనబడుచున్నది

## బ్రహ్మంగారు ఉత్తరాది గ్రామసంచారము

బ్రహ్మంగారు హైదరాబాదునకు వెళ్ళుటకు బయలుదేరి, మార్గమధ్యమున, విజయవాడనందు కృష్ణానదీ తీరాన వెలసియున్న శ్రీ దుర్గాంబను దర్శించుకొని , ఏలూరు రాజమండ్రి, వరంగల్ మొదలగు గ్రామముల ద్వారా హైదరాబాదు చేరిరి అచట హైదరాబాదు నవాబు గారి ఆహ్వానము మేరకు, నవాబుగారి దగ్గరకువెళ్లి నవాబుగారి మనసునందున్న అనుమానమును గ్రహించి, వారు తెచ్చిన నీటితో ప్రమిదలో ఆ నీరు పోయించి, దీపమును వెలిగించి చూపిరి. అదిచూచిన నవాబుగారు స్వామిని భవిష్యత్ తెలుపగలిగిన భగవత్ స్వరూపునిగా గ్రహించి, తన రాజ్యమును గూర్చి భవిష్యత్‌నుగూర్చి తెలుపమని ప్రార్థించగా, నవాబునకు కాలజ్ఞానమును యిటుల తెలియజేసిరి

నేను శ్రీ వీరభోగవసంతరాయుల అవతారముదాల్చి వచ్చుటకు ముందు కొన్ని వ్యుత్పాతములు కన్పించగలవు అవి ఈ విధముగా నుండగలవని తెలియజేసిరి. కాశీ అవతల గండకీనది యందలి సాలగ్రామములు నాట్యమాడును. మనుజులతో మాట్లాడును. లక్ష్మీదేవి నావెంటే వచ్చును మహాలక్ష్మమ్మ యితరులను ఏడ్చునట్లు చేయును. ప్రయాగ తీర్థమునందు నష్టమైన వారుపోగా, కొందరు బ్రతకగలరు సరస్వతీ దేవిని అంగటియందు అమ్మెదరు మరి కొంతకాలానికి మూసీనదిపొంగి ఈ పట్టణాన్ని నష్టపరుస్తుంది తరువాత నీ వంశీయులు ఈ పట్టణాన్ని తిరిగి పునరుద్ధరణ చేయుదురు నీ సామ్రాజ్యమున గల అడవులు ఫలవంతంగా మారును. స్మశానాల్లో భక్తులుందురు పల్లెలు పట్నాలుగా మారును చంద్రమతీదేవి కళలు తొలగిపోవును. కొల్హాపురి ఎదుటపోయి నిలవబడేను చీమకుర్తి పన్నెండామడల పట్నముగామారును. వినుకొండకు పడమటిదిక్కున ఎనిమిది పుట్లవరహాలు తీసి కోమట్లకు యిచ్చుదురు. ఉప్పుమాగులూరులో ఉత్పాతాలు పుడతాయి. సరియైన వారంతా బ్రతికేరు. అద్దంకి నాంచారమ్మ నరులతో మాట్లాడేను దేవరహస్యాలు చెప్పును అందుచేత కావేరీనది పొంగును. అమృతం సముద్రంలో పొంగిపోవును నా రాకకు ఇదియొక

నిదర్శన మగును. శ్రీ రంగనాయకులు వద్ద మంచి వాక్యాలు వినబడేను స్త్రీలు పరపురుషులతో కలసి వస్త్ర,ఆభరణాలుతెమ్మనేరు తననుతాను తెలుసుకోగలిగిన యోగులకే నా దర్శనమయ్యేను

మిగిలినవారు పాపాత్ములై రాక్షసదూతలవలె చెడుగా సంభాషణలు చేసేరు. సువర్ణ ముఖీనదియందు పదిమంది మహాత్ములు పుట్టేరు. అప్పుడు నాయుడు పేటలోని ధనమంతా నశించేను. ముందుముందు ముత్యమంత బంగారము కూడా దొరకకుండేను తూర్పు దేశమంతా నవనాగరికతతో మెరసి, తిరిగి ధనహీనులై దరిద్రులై పోయేరు ఇత్తడి బంగారమయ్యేను. కొండవీటిసీమలో గుణవంతులుండేరు. బంగాళా దేశము గొప్పదే, నదులు ఉప్పొంగి, ప్రజలందరూ, జలములోపడి నశించిపోయేరు

ఇరవైఅయిదుగురు అక్కాచెల్లెళ్ళు ఏకముఖులై (ఒకే అభిప్రాయము, ఒకే వుద్దేశ్యము అని అర్ధము కావచ్చును) దుర్గాదేవి కళ్యాణము చేయవచ్చేరు కొంకణ దేశములో గోవుల వలన మోక్షానికి అధికారులయ్యేరు మళయాళమున, పశ్చిమమున, మహారాష్ట్రమున, కర్ణాటకమున నాలుగుదేశములలో నా స్వరూపమును తెలుసుకొన్న వారు మోక్షాన్ని పొందేరు వివాహములలో కులగోత్రాలు పట్టింపులు మానేరు. జాతి, బేధ, వర్ణాశ్రమ బేధాలు లేకనే నడిచేరు .ఇటువంటి విపరీతాలు అనేకం నారాకకు ముందుగా కన్పించేను. కాబట్టి నీవు ఎల్లప్పుడూ మనంబున నన్నే స్మరించుచున్న యెడల నీ జీవితాంతమునీకు సుఖములు కలుగగలవు అని బోధించెను.

శ్రీ బ్రహ్మంగారు హైదరాబాదు నుండి బయలుదేరి మరల వెనుకకు బయలుదేరి తెనాలి, బాపట్ల, ఒంగోలు, నెల్లూరు, కాళహస్తి మీదుగా తిరుపతికిచేరి, అచటినుండి కడపకు రావలయునని బయలుదేరిరి ఈ మధ్యకాలమున శ్రీ బ్రహ్మంగారికి సిద్ధయ్య గారికి జరుగు సన్మానములను సిద్ధయ్యగారికి స్వామివారిచ్చు ప్రత్యేకతకు మిగిలిన వారు ఈర్ష్యాగ్రస్తులయి వుండుట స్వామివారు గ్రహించి వారికొక గుణపాఠము నేర్పుటకు సరియైన సందర్భముకొరకు వేచియుండిరి కడపకు ప్రయాణమున మార్గమధ్యమున స్వామివారు ఒక శునక కళేబరమును సృష్టించిరి అది జీర్ణదశలో పురుగులతో నుకనుకలాడుచూ, అతి దుర్గంధమును వెదజల్లుచుండెను. అందరునూ ఆ దుర్గంధమును భరింపజాలకుండిరి తనకున్న సాధన సంపత్తి వలన, స్వామివారిని అనుసరించుచూ నిర్వికారముగా వచ్చుచుండెను. వీరందరూ శునక కళేబరమును సమీపించిరి స్వామివారు అందరినీ ఆగమనిచెప్పి, సిద్ధయ్యనుతప్ప మిగిలిన వారినందరినీ వుద్దేశించి యిట్లనిరి. మీరందరూ

అధికులమని మనోనిబ్బరము కల వారమని, పెద్దకులమువారమనీ మీరనుకొనుట నేను గ్రహించితిని మీరు నిజముగా నాయందు సేవాతత్పరత గలిగివున్న యెడల, యీ శునకమును భక్షింపుమని చెప్పిరి ఆ మాట విన్నంతనే శిష్యులందరూ తెల్లబోయి ఈ వాసననే భరింపలేనివారము ఎట్లు భుజించగలమని వగచుచుండిరి. అది గ్రహించిన స్వామివారు, సిద్ధయ్యను శునకభక్షణకు ఆదేశించగా, గురువాజ్ఞయని అమృతప్రాయముగా శునకమును ఆరగించిరి. అప్పుడు స్వామివారు శిష్యులనుజూచి ఇప్పటికైననూ తెలిసినదా సిద్ధయ్య యొక్క గురుసేవాతత్పరత ఆతడు అపారభక్తి తత్పరుడు, నన్ను త్రికరణశుద్ధిగా నమ్మినవాడు, అహర్నిశలు నన్ను సేవించుచూ, సదా నా ఆజ్ఞ నెరవేర్చు మనో నిశ్చయము కలవాడు. నాపై ప్రేమ, అభిమానము, భక్తి, నా ఆజ్ఞలకై వేచియుండే తత్వం అన్నీ కలిగినవాడు. నన్ను కొలుచు భక్తులు శిష్యులందరికీ తలమానికము వంటివాడు శిష్యులందరూ అది గ్రహించుకొని తమ తప్పును తెల్సుకొనిరి. ఒకచోట విశ్రమించిన సమయాన స్వామివారు మరికొద్ది సమయానికి ఒక అద్భుతము జరగబోవుచున్నది అని తెలియపరచారు స్వామివారు సిద్ధయ్యగారు సంభాషించు కొనుచూ వున్న సమయమున దగ్గరనుండి ఇద్దరి సంభాషణ వినిపించుచూ, కొంత తడవునకు ఆగిపోయినది అది గ్రహించిన స్వామివారు, సిద్ధయ్యా వారెవరో తెలుసు కొందుము, అని వారి శిష్యబృందమునంతయూ తోడ్కొనిపోయిచూడగా, ఒక బ్రాహ్మణ జంట, కుష్టురోగియైన తన భర్తను, తన ఒడియందుంచుకుని విలపించుట కనిపించెను. శ్రీ బ్రహ్మంగారు వివరములన్నియూ విచారించి, బ్రాహ్మణ యువకుని ఒక్కసారి తన చేతిస్పర్శతో తడిమినంతనే, ఆతని కుష్టువ్యాధి సమూలంగా తొలగి పోవుట జరిగెను అంత నా దంపతులకు పంచాక్షరీ మంత్రమును వుపదేశించి, వారి వూరికి తాము వచ్చుట తటస్థపడునని చెప్పి వారికి ఆశీర్వచనములిచ్చి పంపించివేసిరి

తిరిగి శిష్యసమేతముగా స్వామివారు కందిమల్లయ్యపల్లెజేరి తమ తమ పనులలో నిమగ్నమయి వుండిరి. ఒకనాడు శ్రీ వీరబ్రహ్మంగారికి కడప నవాబుగారి నుండి ఒక జాబు వచ్చెను. అందు పీరు సాహెబు తన కుమారుడైన సిద్ధయ్యను హిందువుగా మార్చినారని అభియోగమును స్వామివారిపై మోపియున్నాడు అందులకు విచారణార్థము శ్రీ వీరబ్రహ్మంగారిని కడప నవాబుగారు పిలిపించిరి ఇది విన్న సిద్ధయ్యస్వామి మీకు బదులుగా నేను సమాధానము యిచ్చి వచ్చువాడను అని వారి అనుమతితో వచ్చిన జవానులతో కలసి కడప బయలుదేరెను. మార్గ మధ్యముననే సిద్ధయ్య జవానులకు

కన్పించకుండా ముందుగనే కడపచేరి, ఒక చెట్టుక్రింద కూర్చుండి, వచ్చినవారితో మత సంబంధమైన విచారణలు జరుపుచూ అందరి మనస్సులు మార్చుచూ, తనవలె నుదుట బొట్టు కాషాయములు, రుద్రాక్షలు ధరింపజేయుచుండెను రెండు రోజులలోనే అనేకమంది మహ్మదీయులు హిందువులుగా మారిపోవుట చూచి, నవాబుగారు సిద్ధయ్యను తన సముఖమునకు పిలిపించెను

సిద్ధయ్య నవాబు దగ్గరకువచ్చి కనీసము అభివాదనము చేయకనే నిలుచుండుట చూచి కోపము తెచ్చుకొని వాని వృత్తాంతము తెలుసుకొని శిక్షించవలయునను తలంపుతో నుండెను. నీవు మహ్మదీయుడవైవుండి, హిందూ మతమునున్న వ్యక్తిని ఆరాధించుటేమి? ఇది మత ధూషణము కాదా? మత ధూషణము నేరము కాదా? అని ప్రశ్నించిన నవాబును జూచి, చిరునవ్వు నవ్వి, పిచ్చివాడ మతములెన్ని వున్ననూ భగవంతుడొక్కడే తనువులెన్నియున్ననూ ఆత్మయొక్కటే, ఇది నమ్మి నేను ముక్తి మార్గమును తెలుసుకొనుటకు పరమపురుషుడైన పరమేశ్వరావతారులైన శ్రీవీరబ్రహ్మేంద్రస్వామి పాదపద్మములను ఆశ్రయించితిని నీ మనస్సున కోపము కలుగుటకు కారణము నేను నీకు అభివాదనము చేయలేదనియే కదా? నేను నా గురుదేవులయిన శ్రీ స్వామివారికి తప్ప అన్యులకు శిరస్సువంచి నమస్కరించలేను. అయిననూ నా నమస్కారమును భరించు శక్తి వారికి మాత్రమే కలదు మీరు భరింప జాలరు. నేను చేయి ఎత్తి నమస్కరించితినేని నీవు, నీ సింహాసనము భస్మీపటలము కాగలదు ఇది గుర్తింపుమని హెచ్చరికగా మాట్లాడెను. నవాబునకు కోపము అధికమవజొచ్చెను. కానీ ఏమీయూ చేయలేక, నీకు మహాత్తులు తెలుసునని చాటు కొనుచుంటివి నీవేమి మహత్తును చూపగలవో చెప్పమనగా, ఒక పెద్ద కొండరాయిని తెప్పించుడు నా శక్తిని మీకు చూపించగలవాడను అని పలికెను నవాబు తన భటులను పంపి ఒక అతిపెద్దదయిన కొండరాతిని తెప్పించి ఊరి మధ్యన వుంచి సిద్ధయ్యను నీ శక్తిని చూపించమని అడుగగా, సిద్ధయ్యగారు మనస్సున తన గురుదేవుని స్మరించుకొని, వారి రూపమును కళ్ళ ఎదురుగా సృష్టించుకొని తన కుడిచేతినెత్తి ఆ బండరాయికి ఒక సలాముచేయగా అది పెద్ద ధ్వనితో ముక్కలయి పోవుటను, అక్కడ చేరిన కడప ప్రజలందరునూ తిలకించి, నవాబుతోసహా అందరునూ, కళ్ళప్పగించిచూచుట మినహా ఏమీ మాట్లాడలేని స్థితిలో పడిరి. నా తండ్రి ఫిర్యాదు ననుసరించి, నా గురుదేవులను విచారించ ధైర్యము చేసినారే; మా గురుదేవులకు కోపమొచ్చిన మీరేమి కాగలరో ఆలోచించుకొనుడు అని పలికిన సిద్ధయ్య మాటలకు నవాబు భయపడి, తన

తప్పును కాయమని వేడుకొని తనకునూ జ్ఞానభిక్ష ప్రసాదించమని వేడుకొనగా, అంతశక్తి తనకు లేదనియూ, తన గురుదేవులు ఒక సమయమునకు యిక్కడకు రాగలరనియూ, వారి ద్వారా మీకు బోధన యిప్పించగలననియూ చెప్పి శెలవు తీసుకుని కందిమల్లియ్యపల్లికి చేరికొనెను

## శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామివారు సిద్ధయ్యకు సాంఖ్యయోగమును తెలియజెప్పట

ఒకరోజు సిద్ధయ్యస్వామివారిని యీ ప్రపంచము యొక్క పుట్టుకను గూర్చి తెలియజేయమని ప్రార్థించగా, స్వాములవారు త్రికరణశుద్ధిగా వినుము. ఈ సాంఖ్య యోగమును గూర్చి వివరించినయెడల నీకు సర్వమూ అవగతమవగలదు అని చెప్పదొడగిరి ఈ విశ్వము యొక్క సృష్టియూ, పంచభూతముల ఉత్పత్తియునూ, పంచీకరణము, దేహతత్త్వ విచారణయును చెప్పబడును.

ఈ సృష్టికి ముందు, నాశములేనిదియు, ఆకారరహితము, కాలత్రయమునకు ఎదురొడ్డి నిలవగలిగినదియూ, అన్ని వేళలయందును నిర్మలత్వము గలిగినదియూ, నిర్వికారమైనదియూ, నిరామయమైనదియూ, నిర్గుణమైనదియూ, సర్వవ్యాప్తమై నదియూ, సత్యమైనదియూ, నిత్యమైనదియూ అయిన ఒక బ్రహ్మము కలదు అందు ఆద్యంతములనట్టి, నిరాకారమైన, భగవత్ సృష్టిని చేయగల సమర్ధవంతమైన ప్రకృతి అను పేరుగల ఒకటి వున్నది ఆ ప్రకృతియందే నిర్వికార నిర్గుణ సంపదల మేళవింపు గలిగిన బ్రహ్మము కలసి, ఈశ్వరనామంబు పొందియున్నది. ఆ ఈశ్వరునియందే హిరణ్యగర్భుడు లేక సృష్టికర్త జన్మించినారు. ఆ హిరణ్యగర్భునియందు 'విరాట్' లేక 'వైశ్వానరుండు'ను ఉద్భవించిరి

ఆ విరాట్టునందు మహిమలు, ఆ మహిమలనుండి, అహంకారము, ఆ అహంకారమునుండి పైన చెప్పబడిన ప్రకృతి సత్వరజస్తమో గుణముల సంపుటి యాయెను. ఆ సత్వగుణమునుండి జ్ఞానేంద్రియములు, రజోగుణమునుండి కర్మేంద్రియములు, తమోగుణము వలన విషయ పరిజ్ఞాన సంబంధము కలిగెను ఆ జ్ఞానేంద్రియముల వలన అధిదేవతా సహిత పంచభూతములు ఉద్భవిల్లించెను. 1 శబ్దము వలన సదాశివధినే తత్వం కల్గిన ఆకాశము ఉద్భవించెను. 2 స్పర్శము కారణమున ఈశ్వరాధిపత్యము గల వాయువు జన్మించెను. 3 రూపము కారణమున రుద్రుడు అధిదేవతగాగల అగ్ని జన్మించెను

4. రసము వలన విష్ణువధిదేవతా ధిపత్యము గలిగిన జలము కలిగెను. 5 గంధము వలన బ్రహ్మాధిపత్యము కలిగినటు వంటి భూమి అవతరించెను

ఈ విధముగా పరమేశ్వరుడు సూక్ష్మమైన సృష్టిని చేసి, తిరిగి స్థూలసృష్టికి సంకల్పము చేసెను. పంచమహాభూతములను, మిగిలిన భూతములతో వర్గీకరించగా, పంచీకరణమయి, పంచమహాభూతములు యిరువది ఐదు తత్త్వములను బడసినవి. అవి 1. జ్ఞానము, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములు 2. సమానవాయువు, వ్యానవాయు, ఉదానవాయువు, అపానవాయువు, ప్రాణవాయువు అను పంచ ప్రాణములులును 3 శ్రోతము, త్వక్కు, చక్షువు, జిహ్వ, ఘ్రాణము అను జ్ఞానేంద్రియములను 4 వాక్కు, పాణి, పాదము, గుదము, గుహ్యములను పంచకర్మేంద్రియములుగనూ, 5 శబ్దము, స్పర్శ రూపము రసము, గంధము అను పంచతన్మాత్రలుగను స్థూలముగా చేయబడి స్థితించినది ఈ స్థూలశరీరుని పేరు నిశ్వుడు

జ్ఞాన, మనోబుద్ధి చిత్త అహంకారములను ఆకాశపంచకమునకు క్షేత్రపాలన చంద్రుని వశంబునందుంచబడినది బ్రహ్మ, విష్ణు, రుద్రులు అధిదేవతగులుగా పరిగణింపబడిరి.

సమాన వ్యాన ఉదాన ప్రాణ అపానవాయు పంచకమునకు జయుడు విజయుడు క్షేత్రపాలకులు విశ్వకర్మ అధిదేవత.

శ్రోత త్వక్కు చక్షు జిహ్వ ఘ్రాణములను అగ్నిపంచకమునకు అష్టదిక్కులు. వాయువు సూర్యుడు, వరుణుడు, అశ్వనీదేవతలు అధిదేవతలు

శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములను జలపంచకమునకు ఆదిశక్తి, యిచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి పరాశక్తి అధిదేవతలైరి.

వాక్కు, పాణి, పాదము, గుదము, గుహ్యము అను పృధ్వీపంచకమునకు అగ్ని దేవేంద్రుడు, విష్ణువు, బ్రహ్మ, మృత్యువు, అధిదేవతలు.

ఈ యిరువదిఐదు తత్త్వములతో కూడినదే స్థూలదేహము జ్ఞాన, కర్మ, పంచ ప్రాణములు, మనోబుద్ధులు కలసి సూక్ష్మ దేహమగును

అజ్ఞానము వలన, తెలివిలేనితనమును, అవివేకము వలన నేను నాది అను స్వార్థమును, స్వార్థము వలన కామక్రోధాదులు, వీనివలన సకలపాపములు చేయ్యుచూ, కర్మ వశమున మరణించుట, మరల జన్మించుట, మరల పూర్వజన్మ కర్మకారణమున మరణించుట, తిరిగి జన్మించుట కలుగుచున్నవి. బ్రహ్మజ్ఞాన సంపాదన వలన అజ్ఞానము, అన్ని కర్మలునూ సమసిపోయి ముక్తి కలుగుచున్నది. అజ్ఞానమనెడి కారణమువలన ఈ దేహము నశించును దీనిని గ్రహించి అజ్ఞానమును పారద్రోలవలయును. లేకున్న ముక్త బడయలేరు

పంచభూతములు ఐదు, జ్ఞానేంద్రియములు ఐదు, కర్మేంద్రియములు ఐదు, విషయజ్ఞానములు పది, ప్రాణాదిగా గల వాయువులు పది, చక్రములు ఆరు, రాగములు ఎనిమిది, అంతఃకరణములు నాలుగు, ఊర్మిలు మూడు ఈషణములు మూడు, గుణములు మూడు, అవస్థలు మూడు, తాపత్రయములు మూడు, శోకములు ఐదు, మొత్తము 96 తత్త్వములు అగుచున్నవి. ఈ 96 తత్త్వములతో కూడిన శరీరమే జీవుడుగా భాసిల్లుచున్నాడు.

ఈ జీవుని విశ్లేషణమును ఈ విధముగా జేయదగును ఇది 96 అంగుళముల ప్రమాణము గలది. ఏడుజానల పొడవు. నాలుగు జానల చుట్టుకొలతయూ, 23 కోట్ల రోమ రంధ్రములునూ, 30 మూరలు ప్రేగులునూ, 92 సంధులునూ, 70 ఎముకలునూ, 8 ఫలముల గుండెయూ, 40 ఫలముల రక్తమునూ, 360 ఫలముల మాంసమునూ, సోలెడు పైత్యరసమునూ, అర్థశ్లేష్మమునూ, సోలెడు శుక్లమును కలసి నిర్మించబడినదే యీ స్థూలదేహము. ఈ దుఃఖస్వరూపమైన దేహము, తాను అను అజ్ఞానము జీవాత్మ ఇన్ని మోహ పూరితములు కలిగిన దేహముకన్ననూ, ఆత్మే తాను అని తెలుసుకొనుట ముక్తికి సోపానము.

ఈ దేహమున ఆధార, స్వాధిష్టాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, అజ్ఞేయము అను షడ్ చక్రములు గలవు. పరమాత్మ స్వరూపునకు స్థూలదేహమున గల దుర్గంధమును, సూక్ష్మరూపమున కామక్రోధములు, కారణమందు అజ్ఞానమును అంటవు గురుధ్యానాచరులకు, శాస్త్రకోవిదులకు, సూక్ష్మదృష్టిచేతనే దేహము నందుగల పరమాత్మను దర్శించగలరు ఇరువది అయిదు తత్త్వముల వలననూ, దశనాడుల వలననూ, సప్త ధాతువుల వలననూ, నిర్మింపబడిన ఈ శరీరమునందు ఏడు పుష్పములు గలవు.

వీనియందు మొదటిది మూలాధారము. గుదస్థానమునందు నాలుగు రేకులు కలిగి పచ్చని వర్ణముతో వ,శ,ష,స అను నాలుగు రేకులతో, భూమివలెనే నాలుగు కోణములతో నుండును ఆధారము యిచ్ఛాశక్తి కలిగియుండును. 1 ఘ 40 వి. ఘులకు 600 పరమహంస జపము జరుగును. ఈ మూలధార చక్రమునకు విఘ్నేశ్వరుడు అధిదేవత.

రెండవది స్వాధిష్టాన చక్రము,ఆధారచక్రమునకు రెండు అంగుళములపైన నాలుగు రేకులు గలిగి, మూడు కోణములతో తెల్లని రంగుతో జలస్థానము అయి, జిహ్వాకృతి కలిగి, బ,భ,మ,య,ర, ల అను రేకులు కలిగి పక్షిని పోలి వుండును గురులింగం క్రియాశక్తి ఇందు 46ఘ 40 వి ఘులకు 6000 పరమహంసల జపము జరుగును ఈ చక్రమునకు బ్రహ్మదేవుడు అధిదేవత

మూడవది మణిపూరకచక్రము స్వాధిష్ఠాన చక్రమునకుపైన మూడు అంగుళములలో నాభిభాగమునా నాడీమండలముతో ఏకీకృతమై మణివలె ప్రకాశించుచుండును. నీలవర్ణము కలిగినదయి వుండును శకారయుతమై డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ అను పద్మరేకులతో, పీఠకాకృతి కలిగియుండును. విష్ణువు అధిష్ఠానదేవత శివలింగశక్తి. అగ్నిముద్ర కలిగినది నాదోద్భవస్థానమౌ. 6ఘ 40 వి ఘటలకు 600 పరమహంసల జపము జరుగును.

నాలుగవదయిన అనాహతచక్రము మణిపూరకచక్రమునకు పది అంగుళముల పైన హృదయస్థానమునందు పన్నెండు రేకులతో బంగారు ఛాయతో నకారము గలిగి, సమస్త పదములకు స్థానమయి వున్నది. క,ఖ,గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ ఞ, ట ఠ అను రేకులు కలిగి యండును ఇది వాయువునకు స్థానము. లింగాకృతి కలది. దీనికి రుద్రుడు అధిష్ఠాన దేవత. చరలింగము, బీజశక్తి, వాయుముద్ర,16ఘ. 40 వి ఘటలకు 6000 పరమహంసల జపము జరుగును

విశుద్ధచక్రము అనునది ఐదవచక్రము అనాహత చక్రమునకు పన్నెండు అంగుళములపైన స్వేతకాంతి కలిగినది. పదహారు దళములు కలది అవి అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఎ, ఐ, ఓ, ఔ, అం, అః అనునవి పదహారు దళములు. చేపవంటి ఆకృతి కలిగి యకారంబు కలది. శ్రోత స్థానమయిన కంఠమునందుండును దీనికి జీవుడు అధిష్ఠానదేవత సరస్వతి స్థానం. ప్రసాదలింగము. ఆదిశక్తి; ఆకాశముద్ర, జ్యోతి వర్ణమయి ఒప్పుచుండును 2 ఘ. 40 వి.ఘటలకు 1000 జపము జరుగును

ఆరవదయిన ఆగ్నేయ చక్రము. విశుద్ధ చక్రము మొదలు 12 అంగుళములపైన భ్రూమధ్యస్థానమున (త్రికూట స్థానము) హం క్షం అను రెండు రేకలు కలిగియున్నదయి వున్నది. అంతఃకరణ నిలయమై అగ్నివలె ప్రకాశించుచుండెను ఈశ్వరుడు అధిష్ఠాన దేవత. సర్వసృష్టిస్థానము మహాలింగము. ప్రకాశముద్ర 2 ఘ 40 వి ఘటలలో 1000 పరమహంసల జపము జరుగును

సహస్రాకారము అనునది విశుద్ధచక్రమునకుపైన బ్రహ్మరంధ్రము కలదు. ఆ సహస్రారమునందు ప్రకాశంవతమయిన రూపము; వేయిరేకులతో కూడి ఓం అను ప్రణవము అత్యంత ప్రకాశము కలిగి, బుద్ధికి నిలయస్థానమై మాయా మోహములచే మూసివేయ బడినదయి, జగత్తునంతయు పాలించునది అయి, ఎవరిచే సృష్టించ బడనిదయి, సచ్చిదానందరూపము గలదియై విరాజిల్లుచుండును. శ్రీ గురుమూర్తి అధిష్ఠానదేవత ఓంకార లింగము, జ్యోతిర్మయస్థానము, ప్రణవస్థానము విమల జ్ఞానము, 2ఘ 40 వి ఘటలలో 1000 పరమహంసల జపము జరుగును ఈ సప్త చక్రములకు

చుట్టుకొనిన వాయువు ప్రాణమని చెప్పబడుచున్నది. ఆ వాయువు ఒక్కొక్క స్థానమున ఒక్కో విధముగా చెప్ప బడుచున్నది. అవియే ప్రాణవాయువు, అపానవాయువు, వ్యానవాయువు, ఉదానవాయువు, సమానవాయువు అను పంచప్రాణవాయువులునూ, నాగవాయువు, కూర్మవాయువు, కృకురవాయువు, దేవదత్తవాయువు, ధనుంజయువాయువులను ఐదు వువవాయువులుగా తెలియు వలయును. ప్రాణవాయువునకు కుడిఎడమయందున ఇడా పింగళులను నాడులయందు తిరుగుచూ, క్రిందికి మీదికి ఉచ్ఛ్వాస, నిస్వాస రూపమున తిరుగు చుండును. ఇడాపింగళులు ఆధారచక్రము మొదలుకొని ఆగ్నేయచక్రము వరకు నుండును. మధ్యనున్న సుషుమ్నానాడి, ఆగ్నేయ చక్రమును దాటి బ్రహ్మరంధ్రము వరకు వ్యాపించి యుండును. ఈ నాడులయందు ప్రవహించు జీవుడు ప్రాణవాయువు వలన ఆగ్నేయ చక్రమునందు జనియించిన 'స' కారమునూ, మూలాధారమందున్న అపానవాయువు వలన బుట్టిన 'హ' కారమును కలిసి హంస అని లేక సోహం అని పైన లేక క్రింది కుండలలయందు వ్యాపించు నటువంటి ఆత్మమంత్రోచ్ఛారణమును, ఆధారాది షడ్చక్రములకు అధిష్ఠాన దేవతలైన విఘ్నేశ్వరుడు, బ్రహ్మ, విష్ణు, రుద్రుడు, జీవుడు, ఈశ్వరుడు వీనిని గురించి ఈ సూర్యోదయము మొదలు మరునాటి సూర్యోదయము వరకు జపము ఆచరించి, అర్పణ చేయుచున్నాడు. అందు గణపతికి 700, బ్రహ్మకు 6000, విష్ణువుకు 6000, రుద్రునకు 6000, జీవునకు 1000, ఈశ్వరునికి 1000, ఈ విధముగా జీవుడు అర్పణ చేయుచున్నాడు సహస్రారమందు ప్రకాశరూపుడై 1000 హంసలను శ్రీ గురుపరమాత్మకు అర్పణ చేయుచున్నారు. ఈ విధముగా సగుణ, నిర్గుణ రూపములయిన హంసలు 21,600. ఇట్టి పరమ రహస్యమును జీవుడు కనుగొనలేక అనేకసేవలు, అనేక తీర్థయాత్రలు చేయుచూ కాలమును వ్యర్థప్రయత్నములతో వ్యర్థపరచుచున్నాడు. సహస్రారమే శబ్దరూపమైన వాక్. అదే జ్యోతిస్వరూపము అదే ఊర్ధ్వకుండలినీ శక్తి స్వరూపము అదే అమృత భాండాగారము. అదే సర్వసృష్టికి మూలము ఇట్టి మార్గమును తెలియక అధఃకుండలి యందు ప్రవేశించి, భార్యాపిల్లలు, సంసారమను జంఝాటమున పడి వారే సర్వమని, వారే రక్షించగలరని, తన దేహమునందున్న అమృత భాండమును ఆస్వాదించలేక, దేహమే నేననుకొని కొట్టుమిట్టాడుచుండును.ఈ దేహమును ఎన్నిసార్లు పవిత్రగంగలో ముంచిననూ, బాహ్యకరణములైన ఎన్ని సుకర్మలు చేసిననూ, మోక్షము రాదు

ఇట్లు శ్రీ వీరబ్రహ్మంగారు తన శిష్యుడయిన సిద్ధయ్యగారికి వివరించి చెప్పినారు అది వినిన సిద్ధయ్య అతి పవిత్రుడయి తన జీవితమును ఒక ధర్మబద్ధమయిన, జ్ఞానిగా వెలుగొందు మార్గమేర్పడినది. ఇది అంతయూ సిద్ధయ్యగారికి చెప్పు సమయమున మాదిగకక్కయ్య- అను నతడు - చాటుగా విని ఇది ఏదియో వింతగా నున్నదని తలచి; దీనిలోని మర్మమును తెలిసికొనవలయునని, త్వరగా యింటికి వెళ్ళి నిద్రించుచున్న భార్య కంఠమును, ఉదరమును చీల్చి అందున్న దేవతలను చూడగా తలంచెను కానీ ఎవరునూ కానరాక స్వామివారు చెప్పినవన్నియూ అబద్ధములుగా నెంచి శ్రీ బ్రహ్మంగారిని దూషించదొడంగెను

విషయమును తెలిసికొనిన-శ్రీ బ్రహ్మంగారు కక్కయ్య మూఢభక్తికి ఆశ్చర్యము నొంది, ఈతని తప్పక కరుణించవలెనని తలంపుతో సిద్ధయ్యతో కలసి, కక్కయ్యకడకు ఏగి కక్కడా నిజముగా నీకు దేవతలను దర్శించుకొనవలయునను కోరిక కలిగివున్న యెడల తెల్పుము మీరు యిద్దరునూ మీ నేత్రానందకరముగా ఆ దేవతలను తనివితీరా దర్శించు కొనగలరు అని తెలిపిరి వారికిగల భగవత్ దర్శనాకాంక్షచేత స్వామివారిని ప్రార్థించి తమకు షట్చక్రమునందు గల ఆ దేవతల దర్శనము చేయించగోరిరి అంత స్వామివారు కక్కయ్య భార్యదేహము కడకు తీసుకొనిపోయి వారికి మూలాధారచక్రము మొదలు సహస్రారచక్రము వరకు గల అధిష్టాన దేవతలును-వివరించుచూ, వారికి భగవత్ దర్శనమును చేయించిరి తదుపరి నిర్జీవియైన కక్కయ్య భార్యను మంత్రజలముతో ప్రోక్షించి ఆమెను పునర్జీవితురాలను గావించి సిద్ధయ్య సమేతులై గృహంబునకు చేరిరి.

శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామివారు తన శిష్యులతో గ్రామములలో తిరుగుచూ, జనులకు హితవులు చెప్పుచూ, తమ ప్రయాణమును సాగించుచుండిరి నంద్యాల సమీపమును చేరు సరికి, ఒక గ్రామమున మజిలీచేయ నిశ్చయించి, స్వామివారికి అమితమైన దాహంబు కాగా, ఆ వూరియందలి విశ్వబ్రాహ్మణుని యింటికేగి దాహంబు తీర్చుకొనుటకు మంచినీరు అడిగిరి. అంతనాతడు పనిలో వున్నందున నీరు యిచ్చుటకు యింటియందెవరూ లేరని చెప్పి బావికడ దాహమును తీర్చుకొనమని చెప్పెను సిద్ధయ్య మరొకమారు అడిగిననూ, ఆతడు కోపగించుకుని కొలిమిలో కరుగుచున్న లోహమును మూసతో వుండగా దానిని పట్టుకారుతోతీసి స్వామివారికిచ్చి దాహము తీర్చుకొమ్మని పలుకగా, ఆతనిఅహంకారమును మాపవలెనని తలంచి శ్రీ బ్రహ్మంగారు ఆ మూసను చేతితోనే పట్టుకుని మంచినీటివలె త్రాగెను. ఇది తిలకించిన విశ్వబ్రాహ్మణునికి భయముకలిగి, నోటమాటరాక స్వామివారి పాదములపై బడి తన తప్పును మన్నింపమని వేడుకొనగా, వారు క్షమించి మృదువుగా,

నా గురించి తెలిసినవాడే నాకు యిష్టుడు నీవేమియూ చింతించవలదు. అని చెప్పి అతని ఆతిధ్యమును స్వీకరించి, అటునుండి మహానందిని దర్శించి అచ్చటినుండి నంద్యాల చేరిరి

నంద్యాలయందు విశ్వబ్రాహ్మణులలో ఒక తెగవారు పాంచాననము వారుగా పిలువబడుచుండిరి వీరు ధనికులమనే అహంకారముచేత కన్నుమిన్నుగానక ప్రవర్తించుచూ, వారి కడకు ఎవరు వచ్చిననూ వారిని ఎగతాళి చేయుచూ. పెద్దలను సహితము కించపరచుచుండిరి. అట్టివారి కడకు శ్రీ స్వామివారు వచ్చిరి. అయిననూ వారు ధనమధాంధులైన కారణమున స్వామివారికి భోజన వసతులేమియూ కలిగింపక. ఎవరును వచ్చి మాట్లాడక వుండిరి. ఆ వూరియందలి కొందరు భక్తులు స్వామివారికి భోజనాది వసతులు కల్పించి స్వామివారి ఆశీస్సులను పొందిరి ఇది తిలకించిన శ్రీ బ్రహ్మంగారు తానే పాంచాననము వారి వద్దకు వెళ్ళి నాయనలారా నా తప్పేమి? నేను మీకేమీ అపకారము చేయలేదే. అతి గొప్పవారు మీరు. అతి బీదవారమైన మేము క్షుద్బాధనోర్వలేక మా ఆకలి తీర్చగలరని మీవద్దకు ఏతెంచితిమి తమవంటి ధనికులు మాకు భోజన సదుపాయములు గూర్చి మా ఆకలి తీర్చగలవారు మీరొక్కరే అని తోచుచున్నది అందులకే మీ వద్దకు వచ్చి యుంటిమి అని పలికిన స్వామివారిని వారిలో ఒకరు మీకు తినుటకు ఎంత అన్నము కావలసి వుండును చెప్పమని పరిహాసముగా పలికెను మాకు సరిపోవు భోజనము పెట్టింపుడు అని స్వామివారి సమాధానమునకు ఒక పుట్టి బియ్యమును వండి వడ్డించగలవారము ఆరగింపుడు అని పరిహాసముగా మాటలాడిరి అదే విధముగా వారు ఒక పుట్టి బియ్యమును వండించి, స్వామివారిని శిష్యులను భోజనమునకు పిలువగా స్వామివారు తన శిష్యుడయిన సిద్ధయ్యను పిలిచి, ఈ అన్నము మొత్తమును నీ వొక్కడివే భోంచేయుము అని పలికి సిద్ధయ్య శిరంబున తమ కరంబుంచి ఆశీర్వదించి, ఆ అన్నపురాశి నుంచి ఒక పిడికెడు అన్నమును చేత పట్టుకుని నిల్చుండిరి గురుదేవుని ఆజ్ఞప్రకారము పుట్టి అన్నమును తృటికాలములో తినివైచి సిద్ధయ్య హాహాకారములు చేయుచూ, జ్యోతుల వంటి కన్నులతో ఇంకనూ కావలెనన్నట్లు కూర్చుండియుండుట చూచిన పాంచాననమువారికి దిక్కుతోచని పరిస్థితిలోపడి, యిది తమ అహంకారము నకు శ్రీ బ్రహ్మంగారు చెప్పిన గుణపాఠమని గ్రహించి, అందరూ మూకుమ్మడిగా స్వామివారి పాదములపైబడి క్షమాభిక్ష కోరుకొనిరి. అంత స్వామి కరుణించి తన చేతియందున్న అన్నపు ముద్దను సిద్ధయ్యకు తినిపించగా, ఆతడు సంతృప్తుడాయెను పాంచాననము వారు స్వామికి తగు విధముగా గౌరవ సత్కారములుచేసి తమకు తత్వోపదేశము గావింపుమని కోరుకొనగా స్వామివారు వారందరికీ బ్రహ్మోపదేశము వొసంగిరి.

స్వామివారు నంద్యాలనుండి బయలుదేరి అహోబిలముచేరి అచటనున్న శ్రీలక్ష్మీనరసింహస్వామిని దర్శించుకొని మరల బయలుదేరి మార్గమధ్యమున ఒక పెద్ద చెట్టు నీడను భోజనమునకు ఆగిరి. ఆ వృక్షముమీద ఒక బ్రహ్మరాక్షసి ఎన్నియో సంవత్సరముల నుండి నివసించుచూ, ఆ దారివెంబడి పయనించు బాటసారు లందరినీ చంపుచుండెను. అదే వృక్షము క్రింద స్వామివారు తమ శిష్యబృందముతో ఆగి భోజనము తయారు చేసుకొని, ఆరగించుటకు విస్తరాకుల కొరకు చెట్టుపైకెక్కి ఆ రాక్షసినిగాంచి భయముతో స్పృహతప్పి పడిపోవుచుండిరి. ఒక్కొక్కరు ఈ విధముగా స్పృహతప్పట చూసి సిద్ధయ్య గురువుగారిని సమీపించి విషయమును తెలియ పరుచగా, స్వామివారు చిరునవ్వుతో సిద్ధా! వీరందరూ, గురునామోచ్ఛారణ చేయుదురు గానీ, చిత్తమును స్థిరపరచు కోలేరు అందులకే యిట్లు ఆ చెట్టుపైగల రాక్షసినిజూచి భయపడి స్పృహతప్పట జరిగినది ఇపుడు నీవీ బెత్తమును చేతబట్టుకుని చెట్టుపైకెక్కి ఆ బ్రహ్మరాక్షసిని లొంగదీసుకొనుము. అని చెప్పగా సిద్ధయ్య అటులనే చెట్టు ఎక్కి ఆ రాక్షసి మాయలకు, కల్పించిన భ్రమలకు లొంగక రాక్షసినే జుట్టుపట్టుకుని లొంగ తీసికొని, చెట్టుదించి గురువుగారి దగ్గరకు యీడ్చుకొని పోయెను. స్వామివారు విభూతిని మంత్రించి జల్లిన తడవుగనే రెక్కలు విరిగిన పక్షివలె ఆ రాక్షసి కూలబడిపోయెను. స్వామివారు ఆ రాక్షసిచేత ఇకనుండి హింసామార్గమును విడనాడునటుల ప్రమాణము చేయించిరి. ఆ రాక్షసి స్వామివారి రక్షణ వేడుకొనగా, నీకింకనూ పాపపరిహారము కాలేదు. కొంతకాలమునకు ఈ దారి వెంటనే ఈశ్వరమ్మ అనునొక వీరమాత వచ్చును. ఆమె నీకు జన్మరాహిత్యమును కలుగజేయగలదు నీవీ హీన జీవితమును మరికొంతకాలము గడుపవలసి వున్నదని చెప్పి, తన శిష్యులకు తెలివితెప్పించి జరిగిన వృత్తాంతమంతయూ ఎరుకపరచి, కడప గ్రామమున బయలుదేరి వెళ్ళిరి. కడప చేరిన పిదప తమ రాకను నవాబునకు తెలియపరచిరి

నవాబుగారు తన పరివారముతో స్వామివారి వద్దకుపోయి, ప్రణామములచేసి, తగు రీతిని తమ మహలుకు తీసుకొని వెళ్ళి తగిన రీతిని గౌరవమర్యాదలు చేసి, భోజనముల ఏర్పాట్లుచూచి తన మందిరమునకేగి స్వామివారి మహిమలను తెల్సుకొను విధమును గూర్చి ఆలోచించసాగెను. తుదకు ఒక నిర్ణయమునకు వచ్చి వెంటనే స్వామివారివద్దకు అరుదెంచి, రేపు సాయంత్రము కచేరీకి ముందునగల మైదానమునందు జరుగు సభకు విచ్చేయుడని ఆహ్వానించెను. స్వామి చిరునవ్వుతో నీ మనస్సునందుగల కోరిక తెలిసినది నీకు తప్పక తెలియజేయగలనని చెప్పి పంపించెను నవాబు వెళ్ళినాడేకానీ, ఒకటే

ఆలోచనలు స్వామివారికి నామనంబు నందుగల కోరిక ఎట్లు తెలిసినది. ఈయన సామాన్య మానవుడు కాదు. వైకుంఠవాసుడే ఈ విధముగా మానవజన్మయందు యిట్లు కార్యములు నెరవేర్చుచున్నాడా యనిపించుచున్నది. వారి శిష్యుడే అన్ని మహిమలు చూపగా, ఈ మహాపురుషుని గూర్చి యింత ఆలోచన ఏలఅని అనేక విధములుగా తలంచుచూ మరునాటి సభకు ఆహ్వాన పత్రములను ఏర్పాటు చేయించి అందరికి పంచవలసినదని ఆదేశించెను.

మరునాడు సాయంత్రమగు సరికి జనులందరునూ సభాస్థలికి వచ్చి చేరిరి. స్వామివారు తమ శిష్యులతో సభకు విచ్చేసి ఆశీనులు కాగా, నవాబు లేచి నిలుచుండి, స్వామీ. నా యొద్ద ఒక చూడి గుఱ్ఱము కలదు. అది ఆడశిశువును కనునో లేక మగ శిశువును కనునో తెలియజేయుడని ప్రార్థించెను. స్వామివారు చిరునగవుతో ఆ గుఱ్ఱమును సభకు రప్పింపమని కోరగా, నవాబు స్వామివారి ఎదుటకు గుఱ్ఱమును తెప్పించిరి.

స్వామివారు ఆ గుఱ్ఱమును చూచి, దీని గర్భమున నాలుగు తెలుపు రంగు కాళ్ళు, నొసట చుక్క, పువ్వుల తోక కలిగిన మగగుఱ్ఱము జన్మించును. ఇది సత్యము నమ్ముము అని చెప్పిరి. అయిననూ నీ మనసునందలి కోరిక ఆ గుఱ్ఱము గర్భము నందలి శిశువును చూచుట కదా. అట్లే చూపింతును అని నలువైపులా తెరకట్టించి, గుఱ్ఱపు గర్భమునందలి శిశువునుతీసి నవాబునకు చూపించి, నవాబు జనులందరికి చూపించగా, అది స్వామివారు వర్ణించిన గుర్తులు కలిగియుండుట చూసి అందరును; స్వామివారి మహిమకు ఆశ్చర్యమును పొందిరి తిరిగి స్వామివారు, గుఱ్ఱపు శిశువును గుఱ్ఱము గర్భమునందు ప్రవేశపెట్టి గుఱ్ఱమును బ్రతికించి నవాబునకు వొసంగిరి. అంత నవాబు స్వామివారిని భవిష్యత్తు బోధించుమని వేడుకొనగా స్వామివారు యిట్లు చెప్పదొడగిరి.

## శ్రీ స్వామివారు కడప నవాబుకు కాలజ్ఞాన బోధ చేయుట

నేను శ్రీ వీరభోజుండనయి యీ ప్రపంచమున ఉద్భవించునాటికి, ఈ కలియుగమున 5000 సంవత్సరములు గడచుసరికి దుష్టశిక్షణ, శిష్టరక్షణకై వచ్చుదును ఈ లోపుగా సంభవించనున్న కొన్ని పరిణామములను తెలియపరుచు చున్నాను. ఉప్పుకొండూరులో వూరి చెరువుకింద వుత్పాతాలు పుట్టేను ఉత్తమ వైశ్యులు నశించిపోయేరు జలప్రవాహాల వలన పద్నాలుగు పట్టణాలు పాడయ్యేను. నేను వచ్చుటకు ముందిదొక నిదర్శనమగును. ముళ్ళపాడు వద్దకు మునులు చేరుకొని ముందు దోపిళ్ళకు వెళ్ళేరు నాలుగు వర్ణాలవారు

న్యాయముతప్పి నడచేరు దేశంలో మసిపాతమాడి కమ్ముదురు 5972 సంవత్సరము ధాతనామసంవత్సరం మాఘశుద్ధ బుధవారము రోజున పట్టపగలే పద్దెనిమిది పట్టణాలు కొల్లగొట్టబడేను. గుణవంతులు కొందరు రాచపాలెం రచ్చబండవద్ద ఆశపోతు ముండల గొంతులు కోసేరు.

కోటిదూపాటియందు కొచ్చెర్లకోటయందు కోడి మూడుమాటలాడేను. యిచ్చిన సొమ్ములు దిగమ్రింగి అబద్దాలాడి బాకీలు ఎగగొట్టేరు తప్పుడు ప్రమాణాలు చేసేరు. ముండమోపులంతా ముత్తయిదువలయ్యేరు. వారంతా యాగంటి చేరేరు. కోమటి కులమునందు మేలయిన ఇరువది అయిదు గోత్రములు వారు నిలచేరు. ఉత్తరే దేశమున ఉత్తమ బేరీకోమటి మహాత్ముడై నిలిచేను ప్రపంచమంతా కీర్తించేను మధుర మీనాక్షమ్మ మనుజులతో మాటాడేను మంచి గుణములు కలవారందరూ బనగానపల్లె చేరేరు బనగానపల్లె నవాబు కొంతకాలమే పాలన చేసేను. తరువాత యితరులు స్వాధీనపరచు కొనేరు. కారెంపూడిలో ఘనమైన్న బాలలు కందిమల్లయ్య పల్లెకు చేరేరు గుణము లేనివారు నశించేరు అద్దంకి న్యాంచారమ్మ ముందుగా మాటలాడేను. అందువలన ఎందరో నష్టపోయేరు. గోలుకొండపట్నం నుండి యిద్దరు బాలలు పట్టణము నేలేరు. మహా నంది మరుగున మహిమలు పుట్టేను నేను వచ్చు ముందు ఒక చిత్రము జరిగేను. దానినెరిగి ప్రవర్తించిన వారిని రక్షించేను. నాలుగు నిలువుల ఎత్తుగల అజానుబాహువులు వచ్చి మేమే వీరభోగవసంత రాయలమని చెప్పేరు. నా భక్తులు నమ్మకుండేరు. మూఢులైనవారు నమ్మేరు. మరియొక్క విచిత్రం పుట్టేను. వీపున వింజామరలు, అరికాలున తామరపద్మమువారు వచ్చేరు. వారిని నేనే అని భ్రమవద్దు. నా రాకకు గుర్తు నేవచ్చుసరికి కందిమల్లయ్య పల్లిలో నవరత్నముల మంటపము కలిగి పన్నెండామడల పట్టణమగును. రెండవ కైలాసమగును పట్టపగలు ఆకాశమునుండి పిడుగుల వానపడి, నిప్పులవాన కురిసేను అందునాకొందరు సమసేరు. శ్రీశైలపర్వతముపై జ్ఞానంబు తొలగేను ఎఱ్ఱచీమ ఏనుగు రూపమున కనిపించేను. అదే నా రాకకు గుర్తు అని తెలియ వలయును. మనుషులతో మాయాశక్తి మాట్లాడేను పంది కడుపున ఏనుగు పుట్టేను. కోడి మనిషివలె కూసేను. బనగానపల్లెలోని కాలజ్ఞాన పాతర మీది వేపచెట్టుకు జాజిపూలు పూసేను మేకకు అయిదు తలల మేకపోతు పుట్టేను కావేరీ తీరాన కలహములవల్ల గాజులు పూసలు తీసివేసేరు ఏకముహూర్తమందు ఏడుపుట్ల నల్లలు రాలేను సూర్యుడు గడగడ వణికేను జొన్నవాడకామాక్షమ్మ ఈ విపరీతాలను విచారించేను. నా రాకకు మీకు అదే

గుర్తు. కుంభకోణము గుడికూలేను. కుంభుడి రూపుమాసేను. కంచికి పడమర గాండ్లవాని యింట కామధేనువు పుట్టేను. కంభం చెరువులో బంగారము తీయించి కందిమల్లయ్య పల్లెకు తెచ్చేరు ముత్యాలరంగుడు రత్నములు తీయించి రాజయోగులకు పంచేను కంచికామాక్షమ్మ కన్నుల వెంట నీరు జలజల రాలేను. అందున కొందరు జచ్చేరు పోతులూరి హరిభక్తులు జ్యోతి స్వరూపులై వచ్చేరు. అయిదేళ్ళ బాలుడు అల్లాటపల్లె చేరేను కాళహస్తీశ్వరుని కళ లన్నియూబోయి కంద్రిమల్లయ్యపల్లె జేరేను. రామానుజ మతమ్ఖువారు నియమాలు లేక పాతకులై పోయేరు నా భక్తులయినవారు దరిద్రులయి వుండేరు. పసిబాలుర్రు మాటలాడేరు

ఆవు కడుపులోని దూడ అదేవిధముగా బయటి జీనులకు కన్పించేను. పల్నాట ధనమంధాంధులై గూలేరు. నాలుగు వర్ణములవారు న్యాయముతప్పి నడచేరు బందరు పట్టణమున భాగ్యమును తీసేరు కోనంగి కులము గొప్పదయ్యేను. గొడ్డుబోతు ముండలకు బిడ్డలు పుట్టేరు. లింగాలపురంలో ఒక బంగారుబొమ్మ ప్రజలచే అభివృద్ధి పొందేను కంభం చెరువువద్ద కోడి మనిషివలె మాటలాడేను రాజాధిరాజులు రాజ్యాలు వదలి భ్రష్టులయ్యేరు.

కృష్ణ, గోదావరుల మధ్య మహాదేవుడనువాడు జన్మించి శైవుడయిననూ, అన్ని మతాలనూ గౌరవిస్తూ గుళ్ళుగోపురాలు నిర్మించేను ప్రసిద్ధిపొందేను ఊరూరా గ్రామదేవతలు ఊగిసలాడేరు కళ్ళాణికి వాయువ్యాన సముద్రతీరాన గంగయని ఏర్పడేను.. అక్కడ రాయదుర్గం ఏర్పడుతుంది అందు ఆర్జాతివాడు రాజనిషించు కునేను. 55 ఏండ్లు పాలించేను కాశీ, కంభకోణం, గోకర్ణక్షేత్రాల మహత్తులు తగ్గేను కంచి మహత్తు పెరిగేను

పురాతనులు పుట్టేరు. భక్తులుగా మారేరు అప్పటికి నారాకఖరారవుతుంది. ఆనందనామ సంవత్సరాలు పదమూడు గడిచేవరకూ, ఈ నిదర్శనాలు కనిపిస్తుంటాయి. పతివ్రతలు పతితలౌతారు వావి వరుసలు పాటించకుండేరు. ఆచారాలు అన్నీ నమసి పోయేను. కళ్యాణానికి తొమ్మిది ఆమడల దూరంలో యిద్దరు బొందితో కైలాసమేగేరు అప్పుడు పూలురాలేను. త్రిపురాంతకుని గుడిముందున్న, కంబానవున్న రాతి తేలు నడిచి పోయేను. రాతికోడి కూత కూసి బయట మాయమ్యేను అచటి రాతినంది లేచి నలుదిక్కుల పరుగులెత్తేను. ఇక్కడి చెఱువునీరు ఎఱ్ఱబారేను.

రాయలవారి సింహాసనం లేస్తుంది. కురుమ సంతతి రాజులందరినీ జయించి దక్షిణముగా బోయి రామేశ్వరం దిక్కున, రాయల దళం వారిని తరిమి, యుద్ధాలు చేస్తి

నర్మదానదిలో కత్తులు కడిగి కాశీకి వచ్చి రాయల తల చూసేరు. ఆయన స్వర్గాన్ని చేరేను ఈ సమయాన 'హస్తినాపురిలో మహామారి అనే దుర్గిపుట్టి రామేశ్వరం వరకు ప్రజలను నాశనం చేసేను. విభవ పంచకంలో ధూమకేతు పుట్టేను. రాయలు విజయనగరం పాలించగా గజపతులతో పోరు జరిగేను.

నిప్పుల వాన కురిసేను. శ్రీశైల యాత్రలు జరిగే వీలు లేకపోయేను ఆరెదొండతీగె గుడిని చుట్టేను పులిపిల్లలు తీగలపై వుయ్యాలలూగేను పాతాళగంగలో జలం యింకేను శ్రీశైలక్షేత్రాన కల్లు, చేపలు అమ్మేరు. వేశ్యాగృహాలు వెలసేను అంతులేక కాకులు చచ్చేను 365 రకాల వ్యాధులు ప్రబలేను. మందులకు తగ్గకుండా పోయేను. మాల, మాదిగ, బోయలు బలవంతులయ్యేరు. బాగా సంపాదన చేసేను ఈ సంపదలు చివరకు నాకే దక్కేను

వీరభోగవసంతరాయలు గౌతమీనదీ తీరంలోని వైష్ణవుల యింట జన్మిస్తారు. ఫాలభాగంమీద కనులు, రెండు తలలవారు, అనే మాయవాదులు జన్మించడమే నా రాకకు నిదర్శనం వైష్ణవులు శివనామం జపించేరు. ఆరు మతాలవారు కడకు మూడు మతాలుగా కలిసేరు. స్త్రీ పురుషులంతా దురాచారులయ్యేరు. స్త్రీలు భర్తలను దూషించేరు. మహాత్ములు అమాయకులయి మెలిగేరు. ఢిల్లీ ప్రభువు అంతరించేను. అది కలియుగం తరువాత 4,794 సంవత్సరాలకి తెలిసేది.

తూర్పున సరస్వతీ నదీతీరాన విశ్వబ్రాహ్మణవంశాన ఒక పుణ్యమూర్తి జన్మించేను. ఆయన శివ సమానుడు ధర్మపరుడయి ప్రవర్తించేను శ్రీ శైల ప్రదక్షిణలు చేసేరు. కాశీలో జ్ఞానబోధలు చేసేరు రామేశ్వరంలో ఐదుగురు నేలనంతా మంట పెట్టేరు అలా ఐదు రోజులు వెలిగేను విభూతి, రుద్రాక్షలు మాయమయ్యేను. వైష్ణవ మతం పైకి వచ్చేను. శైవమతం తగ్గేను నిప్పుల వాన కురిసేను. గుండ్లు తేలేను బెండ్లు మునిగేను వ్యాధులు ముదిరేను. శివపూజలు మరుగు పడేను వీరభోగవసంత రాయలు చెన్న బసవన్నలు వచ్చువరకు శివశక్తి అంటూ లేకుండేను నేను వీరభోగవపసంతరాయలునై బయలుదేరి శ్రీరంగమందు ఐదు దినంబులుండి, త్రిపురాంతకమునకు తూర్పుగా బయలుదేరి శ్రీశైలం చేరెదను గంగా తీరాన ప్రమధలు కొందరు, పురాతనులు కొలువుదీరి శివుని అపహాస్యమాడేరు పాతాళగంగ శివపాదోదకమా? విష్ణుపాదోదకమా అను వివాదము పెరిగి వైష్ణవుని నామాలతో గంగను ముంచేరు. ఫలితం తేలదయ్యేను విభూతితో శివభక్తుడు మహేశుని పాతాళగంగలో ముంచేరు. గంగలో నీరంతా శివపాదాలలో యింకిపోయేను వైష్ణవులు ఓడి పాతాళగంగ శివపాదోదకమని అంగీకరించేరు.

చంద్రగుప్తుడు రాతిరూపాన పాతాళగంగవద్ద పడివుండేను. సూర్యకిరణాలు తగులగా చంద్రగుప్తుడు లేచేను. వీరవసంతరాయలు, మహేశ్వరుని, మల్లిఖార్జున దేవాలయాన లింగధారణ చేసేరు వారి భక్తికి భగవంతుడు మెచ్చేను. 5 వేల సంవత్సరాలు పాలించమని ఆశీర్వదించేను. విజయనగరాన కోటలోని రాయల సింహాసనం బయటపడేను. ఇందుకు గుర్తుగా గ్రామాలలోని రాతి విగ్రహాలు ఊగిసలాడేను. త్రిపురాంతమున రాతినంది రంకెవేసి నందాపురం పరిగెత్తేను. అప్పుడు బిజ్జలరాయని కొలువున రాయలసింహాసనం బయట పడేను. అద్దానిని ముప్పది ఆరు కలశాల అలంకరించేరు. శ్రీశైల మహోత్సవాలు నడిచేను. ద్వాదశమంత్రాక్షరీ జపం వలన మేలు జరిగేను. నేను వీరభోగవసంతరాయలనై వచ్చేసరికి నా వారు కొత్త సంఘాన్ని స్థాపించేరు. నా పాలనలో ప్రజలు సుఖసంతోషాలతో బ్రతికేరు. ఈ విధముగా స్వామివారు కడప నవాబుకు కాలజ్ఞానము బోధించి, మంత్రదీక్ష యిచ్చి ఆశీర్వదించిరి.

స్వామివారు కడపనుండి బయలుదేరి ప్రొద్దుటూరి మీదుగా అల్లాటపల్లెచేరి, అచ్చట స్వామివారి యిష్టదైవమగు వీరభద్రాలయమునందు పూజలుచేయించి, బయలుదేరిరి. సిద్ధయ్య, మిగిలిన శిష్యులు వెంటరాగా బండి నెమ్మదిగా పోవు చుండెను. ఇదే మార్గమున అరణ్యమునందు తొమ్మిదిమంది దొంగలు, దారినపోవు బాటసారులను కొల్లగొట్టుచూ, అమాయకులను చంపుచుండిరి. అందువలన ఆ మార్గమున ప్రయాణించుటకు ఎవరునూ సాహసించరైరి. ఆ మార్గముననే శ్రీవీరబ్రహ్మంగారు ప్రయాణించుచుండిరి. కొంత తడవునకు సిద్ధయ్యగారి అనుమానములు నివృత్తి చేయుచూ, అదీ యిదీ మాటలాడుచూ వచ్చుచున్న స్వామి వారి బండికెదురుగా ఆ తొమ్మిదిమంది దొంగలు నిలువబడియుండుట, వారిని చూచి బండివాడు బండిని ఆపివేయుట జరిగెను. బండినందున్న స్వామివారి దగ్గర ధనముండునని వారిని కొట్టి ధనమును అపహరించవలెనని చేతనున్న కఱ్ఱలు ఎత్తి స్వామి వారిపైకి పోయిన దొంగలు స్వామివారి దృష్టి పడినంతనే ఎత్తిన చేతులు ఎత్తినట్లే వుండిపోయి, నోటిమాటరాక శిలలవలె నిలిచి పోయిరి.

అదిచూచి స్వామివారు బండిదిగి, వారందరినీ తన దగ్గరకు లాక్కురమ్మని సిద్ధయ్యకు చెప్పగా, సిద్ధయ్య అందరినీ నెట్టుకుంటూ స్వామివారి వద్దకు చేర్చిరి

శ్రీ బ్రహ్మంగారు దొంగలందరి చేతులను క్రిందికి దించి, నన్ను కొట్టి ఈ బండి యందున్న ధనమును సంగ్రహింపుడని పలుకగా, వారినోట మాట రాకుండెను. స్వామివారు

కొంత విభూతి వారి నోటియందు వేయగా, వారు మాట్లడుదొడగిరి తలలు మాత్రము ఎత్త లేకపోయిరి వారి స్వామిని ప్రార్థించిననూ, తలలు వుండునే కానీ, తిరిగి తలెత్తుట చేయలేరని ఈ జన్మకింతియే ప్రాప్తమని చెప్పి వారలను క్షమించి వదలివేసిరి

స్వామివారు పుష్పగిరి అగ్రహారముచేరి నడివీధిగుండా అపరశంకరునివలె ప్రకాశించు వదనము కలవారై బండియందు కూర్చుండి, సిద్ధయ్య వింజామరలు వీచుచూ, శిష్యులందరూ బండివెంట నడచి వచ్చుటను ఆ వూరి వైదిక బ్రాహ్మణు లందరునూ గమనించి ఎవరోయని ఆరాతీయగా, సిద్ధయ్య తాను దూదేకుల వర్ణస్థుడనని, స్వామివారు శ్రీ జగద్గురు విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామివారని చెప్పినంతనే ఆ బ్రాహ్మణులు కోపముతో సిద్ధయ్యను దూదేకులవాడవయి, సద్బ్రాహ్మణునివలె విభూతి, రుద్రాక్షలు, జపమాల ధరించితివి, ఒక విశ్వబ్రాహ్మణుని వెంట పెట్టుకుని, మీరిద్దరునూ మా బ్రాహ్మణజాతినే అవమానపరచుచున్నారేయని కోపమున దూషించదొడంగిరి బ్రహ్మముఖ సంజనిత వంశజులమైన మాకు మాత్రమే వేద పారాయణముచేయు అర్హత వున్నది మీకు ఎక్కడిదీ అధికారము అని ప్రశ్నించుచూ స్వామివారి బండిని కదలనీయక ఆపివైచిరి

ఎవ్వరైననూ, భగవంతునియందు నిష్టతో, సదామనస్సున నిల్పి, కఠినమైన అభ్యాసమును చేసిన యెడల జన్మరాహిత్యము కలుగునని శ్రుతులు చెప్పుచున్నవి కావున భగవత్ వుపాసనకునూ, వేదపారాయణమునకున్నూ చాతుర్వర్ణములవారూ అర్హులేయనుట సమంజసము అని సిద్ధయ్య పలుకగా, ఆ బ్రాహ్మణులు కోపోద్రేక్తులయి వారందరినీ చుట్టుముట్టి వేదపారాయణ అర్హత బ్రాహ్మణులమైన మాకుగాక చాతుర్వర్ణముల వారికెట్లు కలుగును అని నిలదీయగా శ్రీ వీరబ్రహ్మంగారు కల్పించుకుని వృత్తి బేధము వలన ఎక్కువ తక్కువలు కలిగించు కుంటిరేగానీ, భూతత్వము వలన అందరున్నూ ఒక రకముగా జన్మించిన వారలమే, అజ్ఞానము శూద్రత్వము, విజ్ఞానము బ్రాహ్మణత్వముగా తెలియుడు. వశిష్టుడు బ్రహ్మకు జనియించినవాడు. ఆ వశిష్టుడు కృతయుగమున హరిశ్చంద్రునకు గురువై యుండలేదా? త్రేతాయుగమున శ్రీరామునకు కులగురుడు కాలేదా? ఈ వశిష్టుడు ఎవరు? అని ప్రశ్నించిన, ఆతని వృత్తాంతమును తెలిసికొనుడు వశిష్టుని భార్య ఛండాలి వారి కుమారుడు శక్తి అతని భార్య చపలాత్మ, చపలాత్మ కుమారుడు పరాశరుడు ఆతని భర్య కైవర్తి. ఈమె కుమారుడు వ్యాసభగవానుడు ఈతని కుమారులు ధృతరాష్ట్ర పాండురాజులు శ్రీ శుకమహర్షులు అల్పజాతియందు జనియించి, వారి నియమ నిష్టల వలన, ఎంత ప్రఖ్యాతి గాంచిరో తెలియును కదా? భక్తి జ్ఞానము కలవాడే బ్రాహ్మణుడని

సర్వశాస్త్రములు తెలియపరచుచున్నవి కదా? అల్ప గుణములు కలవారికి బ్రాహ్మణత్వము ఎట్లు కలుగును బ్రహ్మముఖమునుండి పుట్టినవారే బ్రాహ్మణులు అని మీరు చెప్పునటుల్ల, బ్రాహ్మలకు ఆదిపురుషుడైన బ్రహ్మ, విష్ణుమూర్తి నాభినుండి జనియించలేదా? మరి దీనిననుసరించి బ్రాహ్మణులకు బ్రాహ్మణత్వము ఎట్లు ఆపాదించబడును. అయిననూ బ్రహ్మ ముఖోద్భవులయిన బ్రాహ్మణులెవరునూ ఈ ప్రపంచమున లేరు. విష్ణుమూర్తి పాదముల యందు జనియించిన గంగ సర్వదేవతాభిషేకములకు మూలమై ప్రపంచమునంతయూ పావనమొనరించు గంగామాతకు మీ వ్వలన శూద్రత్వము కలుగుచున్నది. భగవంతుడు విరాట్ స్వభావుడు ఆయన శరీరమే ఈ ప్రపంచము. ముఖము ప్రధానమైనది కాబట్టి ఉత్తమమైనదనియూ, భుజములు మధ్యమములనియూ, తొడలు అధమమనియూ, పాదములు అధమాధమమనియూ చెప్పబడినవి. శరీరము మొత్తములోని భాగములనే యిటుల ఉత్తమ, మధ్యమ, అధమ, అధమాధములుగా పేర్కొనబడినంత మాత్రమున శరీరమంతయూ అధమము కానేరదు గదా! భగవత్ సృష్టి అయిన మానవులయందు బ్రహ్మనిష్టాపరులను ఉత్తములుగను, కొంత వివేకము కలవారిని మధ్యములని, ఇంకొంచెము తక్కువ వివేకులను అధములనియూ, వివేక శూన్యులయిన వారిని అధమాధములని తెలియవలయును. వీరినే బ్రహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులుగా, చాతుర్వర్ణములుగా తెలియవలయును. ఇదియేగాక బ్రాహ్మణులు, శూద్రులనగా, జ్ఞానులు, అజ్ఞానులు అని తెలిసికొనుడు. అన్ని జాతుల వారికి వేదాధ్యయమునకు అర్హత కలదు అని శ్రీ వీరబ్రహ్మంగారు ఎన్ని విధములుగా చెప్పిననూ, పుష్పగిరి బ్రాహ్మణులు వినిపించుకొనక తిరిగి తిరిగి రెట్టించుచుండిరి. అందులకు శ్రీ బ్రహ్మంగారు విసుగుచెంది పుష్పగిరి అగ్రహారమువైపు తమ తీక్షణ దృష్టిని సారించిరి. అంత అచటి యిండ్లన్నియునూ కాలిపోవుచున్నట్లు ఆ వూరిజనమెల్లరునూ తిలకించిరి. అప్పుడు ఆ బ్రాహ్మణులు భయము చెంది స్వామివారిని తమ తప్పులు మన్నించి తమను రక్షింపుమని వేడుకొనగా, స్వామివారు ఏ వర్ణమువారయిననూ, నన్ను త్రికరణశుద్ధిగా నిండు మనస్సుతో పూజించురో వారికి సకలసౌఖ్యములు కలుగును అని తిరిగి కాలిపోవుచున్న యిండ్లవైపు చూచినంతనే అవి యధావిధిగా నుండిపోయెను అంతట పుష్పగిరి బ్రాహ్మణులు స్వామివారికి బ్రహ్మరధము బట్టి, స్వామిని పురమంతయూ వూరేగించి, నాలుగు దినములు స్వామివారికి సేవ లొనరించుకుని, తమకు కాలజ్ఞానమహిమను తెలియజేయమని ప్రార్థించగా స్వామి సరేయని ఇట్లు బోధించిరి.

# పుష్పగిరి హాసులకు స్వామివారు కాలజ్ఞానమును బోధించుట

నేను శ్రీ వీరభోగవసంతరాయలుగా, కలియుగము 5000 సంవత్సరములలో దుష్టశిక్షణ, శిష్టరక్షణార్థము భూమిపై అవతరించు వాడను దేవతలు, మునులయొక్క వరములను తీసుకొనివచ్చు కాలమునకు మీరాక తెలియజేయగలందులకు మార్గశిర మాసమున దక్షిణభాగమున ధూమకేతువనే నక్షత్రము ఉదయించగలదు మీ అందరికీ కన్పించును క్రోధినామసంవత్సరమున, మార్గశిరశుద్ధ పంచమిరోజున పునర్వసు నక్షత్ర కర్కాటక లగ్నమునందు శ్రీ వీరభోగవసంతరాయలుగా వచ్చు సమయమున దక్షిణమున ఉత్పాతమైన నక్షత్రము ఒకటి బుట్టేను.

నాలుగు వర్ణములవారు సురాపానము చేత భ్రష్టులయిపోయేరు వేదములు అంత్య జాతుల పాలయేను బ్రాహ్మణులు కలియుగమున 5000 సంవత్సరముల వరకు మాత్రమే పూజలందేరు తదుపరి మా వంశీకులయిన దేవబ్రహ్మణులు వృద్ధిలోనికి వచ్చేరు నేను వచ్చుసరికి దేవబ్రాహ్మణులు, పౌరోహిత్యము పంచాగ రచనలు, కర్మకాండలు నిర్వహించేరు బ్రాహ్మణులకు పీటలు, మాలలకు మంచాలు అమరేను. విప్రులు కులహీనులై పంచలు చేరేరు విప్రులు విధవ వివాహాలు నెరపేరు. స్వవృత్తి ధర్మాలుమాని విప్రులు పరులకు బానిస వృత్తి చేసేరు బ్రాహ్మణులను పిలుచువారు లేకుండేను బ్రాహ్మణులు యితర విద్యలకై పంటభూములమ్మేరు. నేను వచ్చుసరికి వారికి తినుటకు తిండియు, కట్టుగుడ్డ లేకుండేరు బ్రాహ్మణులకు, దేవబ్రాహ్మణులకు నెప్పుడూ వైరంబుండేను వీరిండ్లలో యింటి కిద్దరు విధవలుండేరు. బాపల ప్రభుత్వాలు పండుకొనేను. నీచుల స్నేహాలు నిలిచేను. నామాట యందలి సత్యాలు నిలకడమీద తెలిసేను.

మీనరాశికి సూర్యుడువచ్చు సమయమునకు నేను వీరభోగవసంతరాయుండ నయి, నాలుగు మూరల ఖడ్గముపట్టి శ్రీశైల పర్వతము మీదికి వచ్చి, అచ్చటి ధన మంతయూ, పుణ్యాత్ములయిన వారికి పంచియిచ్చేను ఇది సత్యము నేను ఎట్లు వచ్చుదునో చెప్పు చుంటిని వినుడు కేదారివనంబునందు నిరాహారినై తపంబొనరించి, శ్రీరాములవారిచే మూడు వరములు పొంది; అచ్చటినుండి విక్రమనామసంవత్సరం చైత్రశుద్ధదశమి బుధవారం ఇంద్రకీలాద్రి పర్వతమునకుబోయి అచట మహా మునులను, మహర్షుల దర్శనము గావించుకొని, కార్తవీర్యార్జునితోనూ, దత్తాత్రేయుల వారితోనూ కొన్ని విద్యలు నేర్చి, శ్రీశైల మల్లికార్జునుని సేవించి, ఆది దత్తాత్రేయుల వారిని దర్శించి, మహానంది ప్రవేశించి, అచ్చట

రెండు నెలలుండి, అచ్చటినుండి, శ్రావణశుద్ధపౌర్ణమి నాటికి వీరనారాయణపురముజేరి, అచట ఒక పక్షము నివసించి, తరువాత వచ్చెదను. నేను వచ్చుసరికి ధనమధాంధులు అజ్ఞానులయి అడుగంటి పోయేరు. నా మాటలందు నమ్మకముంచినవారు పల్లెలు, పట్టణములుయందు జనులు లక్ష్మీభోగములు కలిగి మదించి వుండేరు

నా రాకకు ముందు సముద్రములోని జీవరాసులన్నీ నశించేను. పర్వతాలమీద జనులు నిభానీలు ఎత్తి బంగారు గనులు కనిపెట్టి బంగారంకోసం కొండపగులగొట్టేరు. కొండల యందు మరుగులు చూచి వాసము చేసేరు. ఇంటియందు చిచ్చుపెట్టి చెఱుకు గానుగ గుండములలో దుమికేరు. కాశీదేశములో కలహాలు కలిగేను. చిటివేలు తాలూకాలో ఘనముఖులు రాజ్యాలనేలేరు. జుఖ్టేటి ఒడ్డున సృష్టికలిగిన యోగులు బుట్టేరు. యాగంటీశ్వరుడు భక్తులకు మోక్షమిచ్చేను నేను వచ్చుసరికి విధవా వివాహాలు విరివిగా జరిగేను. మామూలు అయిపోయేను. నెల నెలకు భోగాలు కలిగేను వావివరుసలు లేకుండా వివాహాలు జరిగేను. పార్వతీ అవతారములు మేరదప్పి రొక్కములకు అమ్మేరు. (ఇది కన్యాశుల్కం అయి వుండవచ్చును) కులగోత్రములు, నీతిజాతులు లేకుండా పెండ్లిండ్లు జరిగేను

రెట్టాల చెరువుకింద అనేక వుత్పాతాలు పుట్టేను. వినాయకుడు వలవలా ఏడ్చేను. మేలుకొచ్చెర్లకోటలో చెల్లపిళ్ళరాయుడు జనులతో మాటలాడేను. కృష్ణదేవరాయలు వచ్చినపుడు, కలియుగంలో నా స్వరూపము చూపేను. అరణ్యాలలోనూ, భూమిలోనూ అమితమైన ధనముండేను నేను భూమిపై పెక్కు దుష్టాంతమ్ములను బుట్టించేను. అవి ఏమనగా, పాతాళమున నీరు యింకిపోయేను. భూమిమీద మంట లెగసేను. నాలుగు సముద్రముల మధ్యనున్న ధనమంతా శ్రీశైలము చేరేను నూట యిరువై తిరుపతులు పాడయ్యేను (అంటే 120 పుణ్యక్షేత్రములు నశించిపోవునని అర్థమయి వుండవచ్చును) ఇది నా రాకకొక నిదర్శనమయ్యేను. భూమి అలా యిదాగా కన్పించేను. గండికోటలోని ముండలవారలంతా కర్నూలు చేరేను. వాలలాడుతూ గోల్కొండ క్రిందనున్న రాజ్యాలు బాలలు ఏలేరు మహానంది మరుగున మహిమలు పుట్టేను. భూమిమీద దుష్టులు నశించేరు. పంపదేశము వారు ప్రబలమై వుండేరు

నా రాకకుముందు అనేక చిత్రములు కలిగేను. శృంగేరి, పుష్పగిరి పీఠములు పాంచాననము వారి పాలయ్యేను. ఉత్తరదేశము కత్తులతో తెగేను. కనకం తొలగేను.

తూర్పుదేశము ధూళియైపోయేను. ధనములేక విలవిలలాడేరు. ఆకాశవాణి, అన్నపూర్ణాదేవి, పొదలినిమ్మవ్వ, శ్రీశైల భ్రమరాంబ ఈ నలుగురు కనకదుర్గాంబకు మంగళహారతులు పాడేరు. శ్రీగిరిపట్టణము సిరితో వెలిగేను శీలవంతులు ఆదియందే అణగిపోయేరు కాశీ దేశమందు ఘనముఖులు కళకళలాడుతూ వుండేరు. పడమర దేశం ప్రబలమై వుండేను భూమిమీద స్త్రీ పురుషులుస్థితి లయాదులచే బాధలు పడేరు. కాశీనుండి వెనుక ముఖముల వారు వచ్చేరు. శిలానందియందు ఆచారములు తప్పిపోయేను. బ్రహ్మకపాలంలో రామచిలుక రాజ్యమేలేను హరిద్వారమందు మఱ్ఱిచెట్టుపై మహిమలు పుట్టేను హరిద్వారమున దేవాలయం వాకిలి మూసి వుండేను అహోబిళమందు ఉక్కుస్థంభమునకు కొమ్మలుబుట్టి జాజిపువ్వులు పూసేను ఇదియే నా రాకకు మీకు నిదర్శనంబు. నా రాకకు ప్రతివారునూ ఎదురు చూచుచూ సదా నన్ను మరువక నమ్మిన వారికి నా రక్షణ కలిగేను "ఓం, హ్రీం, క్లీం, శ్రీం, శివాయ శ్రీ వీరబ్రహ్మేంద్ర స్వామినే నమః" అనే మంత్రాన్ని సదా జపించేవారి రక్షణ బాధ్యత నేను స్వీకరించేను

మరికొన్ని విషయమలను చెప్పేను శుక్లనామ సంవత్సర, వైశాఖశుద్ధసప్తమీ, సోమవారంనాడు, అనేక దివ్యాభరణములు ధరించి, అప్సరసలు ఆడగా, గంధర్వులు గానం చేయగా, ధనుర్లగ్నపుష్యమీ నక్షత్ర ప్రథమ పాదమునందు సూర్యనందికి నేను వచ్చేను వైశాఖశుద్ధపంచమినాడే నేను బయలుదేరి సూర్య మండలమునుండి కొలువుపాకకు వచ్చేను. అక్కడినుండి అహోబిలము, తర్వాత సూర్యనంది చేరేను దీనికి గుర్తు ఏమన రాయనీ మఘనక్షత్రానికి అక్బరీ గుజ్జాలు తుంగభద్రలో నీరు తాగేను. దానితో కొంత జన క్షయమయ్యేను

శ్రీకృష్ణనిర్యాణం ఆదిగా 4999 సంవత్సరాలకు కలిరూపం కొంత నాశంబయ్యేను ప్రజోత్పత్తి నామ సంవత్సర, ఆశ్వీయుజ బహుళ ఏకాదశినాడు శ్రీ కృష్ణ నిర్యాణం జరిగింది, ఆ ప్రజోత్పత్తి నామ సంవత్సరముననే మాకు పట్టాభిషేకము జరిగింది వికారి మూడేసి విష్ణు నామాలమీద వేంచేసి, ఆరునూళ్ళ పదునెనిమిది అయిన పిదప మేము ఉద్భవించేము

అక్బరీ గుజ్జాలు తుంగభద్ర నీరు త్రాగిన మూడురోజులకు, అనగా మూడు సంవత్సరాల మూడునెలలకు నారాక జరిగేను. పూర్వము అయోనిజులమై జన్మించి,

అత్రికుమారులు, దత్తాత్రేయుల పేరుగలిగి, ఆత్రేయనగోత్రప్రసిద్ధులమై, మహా మునులతోబాటు అనేక బ్రహ్మ కల్పాలు తపమాచరించి, బనగానపల్లెకు వేంచేసి 53 సంవత్సరములపాటు తపస్సు చేసెదము.

అచటినుండి వైకుంఠమునకుబోయి, లక్ష్మీదేవికి మ్రొక్కి, మాధవసేవ చేసుకొని, చతుర్విధముక్తులను తీసుకొని, అచటినుండి వైకుంఠానికి దగ్గరలోని కూర్మసింహాసన మధిష్ఠించి, అనేక బ్రహ్మకల్పాలు రాజ్యపాలనజేసి, తరువాత ప్రధమావతారమెత్తి, ఆనందా శ్రమాలకు శిష్యుడనై తిరిగి అనేక బ్రహ్మకల్పముల తపంబాచరించి, 16 అవతారాలను ధరించి, మరల అనేక బ్రహ్మకల్పాలు తపస్సుచేసి, తరువాత పదకొండవ అవతారాన మానవజన్మ ధరించడం జరుగును ఆ జన్మమందు బనగానపల్లెలో 25 సంవత్సరములు తపమాచరించి, నా భక్తులకు భూత, భవిష్యత్, వర్తమానములను తెలియజేయుచూ, అన్నాజయ్యకు మరోపేరైన వెంకటాద్రికి కుమరపద్దునిచ్చి, పాణెంలో వీరానారాయణ సముఖంలో ధ్యానం చేయమనిచెప్పి పంపెదను. ఆ మానవరూపం చాలించి, తిరిగి సూర్య మండలము చేరేము.

పిదప కొన్ని దినములు నాదబ్రహ్మమున వెంకుంతాద్రిచేత సాంద్రసింధు వేదములు 6 లక్షల 93వేల గ్రంధములు, ప్రమాదాచనామ సంవత్సరం మొదలుకొని మూడు సంవత్సరముల తొమ్మిది నెలలు వ్రాయించితిమి. తరువాత గోపరాజు దగ్గర వుండు కత్తితెమ్మని మనుష్యులు, కందనూరునుండి సూర్యనందికి వచ్చి జితేంద్రియునకు జెప్పి అవుల చెర పట్టుకపోయేరు.

కలికి అవతారం కలియుగాంతాన వచ్చేను. పూర్వులు గ్రంధములయందు కలియుగము, కలికి అవతారమును వివరించియుండేరు. వ్యాసభగవానుడు, శాంతిపర్వం చివరన మా అవతారాన్ని గూర్చి వివరించియున్నారు. విద్యారణ్యస్వామి వారు 'విజయదక్ష' గ్రంథంలోనూ, సంకీర్తనలయందు మా మహిమలగూర్చి వర్ణించి యున్నారు విజయనగరంలో శాశనాలు వేయించారు. శంకరాచార్యులవారు సరస్వతీ పీఠమైన శృంగేరియందు శాసనములు వేయించినారు కృష్ణమాచార్యులవారు వ్రాసిన చాతుర్లక్ష, సంకీర్తనలలోనూ, మారాక, అవతార విశేషాలను, నిర్ణయించేసి వున్నారు. ఇటువంటి సమయాన మేము భూమిపై అవతరించకున్న గోహత్యాపాతకము అంటును



మరికొన్ని వివరించేను. శ్రీశైలాన పొగమంటలు పుట్టేను. బసవడు నాట్యమాడ 'గణగణ మువ్వల మోత వినబడేను. నాగభోగప్రతిమ 'మావారొచ్చేరని' కిలకిలా నవ్వేను. మాయింటి ప్రాకారాన ఆరెదొండ తీగ పుట్టేను. భ్రమరాంబ దేవాలయాన ఒక మొసలి 7 రోజులుండి అదృశ్యమయ్యేను. భ్రమరాంబ మెడలోని మంగళసూత్రం తెగిపడిపోయేను. ఆమె కంటనీరు పెట్టేను. ఆయమ్మ స్తనాలపాలు గారేను. మల్లేశ్వరుని కోవెలలో బంగారురంగు మొసలి 7 రోజులుండి మరలిపోయేను సిద్ధాపురం వీరన్న కుడికంట నీరు కారేను. అలంపురం జోగులాంబ కంట నీరు, స్తనాల పాలు కారేను. కందనూరి గోషాలుని గుడిముందు తింతిణీ మాను (చింతచెట్టు) పుట్టేను మహానందిలో ఈశ్వరుని విగ్రహం కదిలేను. దేవాలయమున రెండు పాములు పారాడేను. ఆ రెండింట పెద్దపాము శిఖరాన మూడు దినాలుండి తరువాత అదృశ్య మయ్యేను.

సూర్యనందీశ్వరుని ముందట పనసమాను పుట్టేను. ఆచెట్టు ఆ క్షణాన పూలు పూచి, కాయలుకాచి, పండ్లుపండి వెను వెంటనే మాయమయ్యేను శిరువెళ్ళ నరసింహుని గుడిముందర గంగరావిచెట్టు మొలిచేను నంద్యాలలో పదియారు కొమ్మలు ఎదురెదురుగా పెనవేసుకొని, పెట్టేను బహుధాన్యనామ సంవత్సర, వైశాఖశుద్ధ తదియ, శుక్రవారంనాడు పల్లెకు తురకలు వచ్చేరు జుఝిగడ్డి వెంగళనాధుని గుడి ముందున్న వేరునుండి చెట్లు మొలిచేను బహుధాన్యనామ సంవత్సరాన బనగానపల్లెలో నాగయ్య అను బ్రాహ్మణ బాలుడు వేదాలు వల్లించేను. బనగానపల్లి పేటలో పులి జొరబడేను నల్లముఖం వానరుడు గ్రామం చుట్టి తానుగా వెళ్ళేను.

అహోబిలాన అనేక అశుభాలు పుట్టేను తాడిపర్తి చింతలరాయని యింటిముందు 'ఓం' అని శబ్దం చేసేను. తాడిపర్తిలో, కాకులు, గ్రద్దలు ఒకటిగా ఆడుతూ వచ్చేను బనగాన పల్లెలోనే మేకపోతు పాలు పిండేరు. చెలియలి మసీదులో కల్లు బసవన్న రంకెవేసేను తిరువళ్ళువరు వీరరాఘవస్వామికి చెమటలు పట్టేను. భద్రకాళి ఊగేను. కంచికామాక్షమ్మ దేహాన చెమటలు పుట్టేను. ఆమె కంట నీరు స్తనాల పాలు కారేను. ఆదిగానున్న కట్టుబాట్లు తప్పేను దుర్జనులు అధికప్రేలాపనతో నశించపోయేరు. ఇంజేటిపాడు, అహోబిలం ప్రాంతాలలో పట్నం కట్టదలచి నిర్వంశమై పోయేను. నంది మండలాన అనేకులు మృతిజెందేరు ఆడమండలంవారు జయప్రదంగా వుండేరు.

శాలివాహనశకం 1541 న ధూమకేతువు పుట్టేను. కందనూరువద్ద యుద్ధం జరిగేను రాచవీటి మూకలు కందనూరులో మరణించేను. రక్తము ప్రవహించేను అది తుంగభద్రలో

కలిసేను పంచాత్రమదేశంలో ప్రజానష్టం జరిగేను. వ్యాధుల మూలన జనం నష్టపోయేరు. కందనూరి గోపాలుడు వడ్డిమడుగులో పడిచచ్చేను. శాలివాహనశకం 1555 నాటికి వివిధ దేశాల్లో జననష్టం జరిగేను. పెమ్మసాని తిమ్మనాయుడు వంశం నిర్వంశమయ్యేను. ఉదయగిరి, నెల్లూరులు రూపుమాసి పోయేను గండికోట. గోలకొండ, అదలేని, కందనూరు పట్టణాలు నశించి తురకలు పారిపోయేరు విజయపురంలాంటి పట్టణాలు క్షయనామ సంవత్సరం నాటికి నశించేను ప్రభవనామ సంవత్సరాన ఈతాకు రాలేను. వృక్షాలు నశించేను. తరువాత పదిరెండు వత్సరాలకు మాధవుడు పడిపోగా, అతని భార్యలు ఆయుధాల చేత మరణించేరు. అశ్వాన నైజాం చెల్మిమల నరసింహారెడ్డి మరణించేను. అంతకు ముందు గనే బ్రాహ్మణ రూపాన మారాక తెలిసేను.

స్త్రీల కన్నులనుండి నెత్తుటి బిందువులు రాలేను. వడగండ్ల వానలు, బాణవర్షాలు కురిసేను తూర్పునాడు ధూళిలో కలిసేను. చెరువులు, బావులు, నదులనీరు ఇంకిపోయేను అయిననూ జుత్తేరు నీరు ఇంకకుండేను

## శ్రీస్వామివారు దృక్కాత్మ నిర్ణయమును సిద్ధయ్యగారికి తెలియజేయుట

స్వామివారు పుష్పగిరినుండి వచ్చు మార్గమధ్యమున ఒక వృక్షము నీడన విశ్రాంతి నొందు సమయాన శ్రీ సిద్ధయ్య గారు స్వామివారిని పాదములు ఒత్తుచూ, దృక్ ఆత్మయొక్క నిర్ణయమును బోధించుమని కోరగా, సిద్ధయ్యా వినుము. జ్ఞానేంద్రియములు ఐదు. కర్మేంద్రియములు ఐదు. ప్రాణములు ఐదు, శబ్దములు ఐదు, కరణములు నాలుగు, ఇవి అన్నియూ కలసి ఇరువది నాలుగు తత్వములగును ధవళ, శ్యామల, రక్త, పీత వర్ణముల మధ్య ప్రకాశించునది 'ప్రకృతి' అనబడును. అదియే 'క్షేత్రము' అదియే 'శిఖరము' అదియే అంతర్లక్ష్యము. అదియే సముద్రము. అదియే విద్యుల్లేఖ. అదియే మేరు శిఖరం అదియే శివుని స్థానము అదియే వైకుంఠము. అదియే కైలాసము అదియే సర్వసాక్షి అయిన సచ్చిదానంద స్వరూపము. క్రిందట చెప్పిన ధవళ, శ్యామల, రక్త, పీతవర్ణంబులలో మొదటి రక్త వర్ణము స్థూల కాయము. శ్వేతవర్ణమే సూక్ష్మ దేహము. శ్యామలవర్ణమే కారణ కాయము. వీటినడుమ ప్రకాశించునట్టి పీత వర్ణమే మహాకారణ దేహము. ఇన్నిటిమధ్య కైవల్యమనే శరీరము ప్రకాశమునొందుచుండును దీనిని శ్రుతి, స్మృతి.అనెడు ఇతిహాసములు

తెలియ జేయుచున్నవి. ఈ కాయముల యొక్క ప్రమాణము యిట్లుండును. స్థూలకాయము ఒకటిన్నర అంగుళాల వ్యాసము గలది. కారణకాయము అంగుళముపై నుండును. వీటిని మించి ప్రకాశించుచూ, అణువయి, అఖండమై యుండునదియే ఆత్మ. అదియే సచ్చిదానందరూపమైన చైతన్యము ఇవన్నియూ కంటికి కన్పించునవేయని నిరూపించి సిద్ధయ్య గారిని తృప్తిపరిచిరి. తరువాత సిద్ధయ్యగారికి భాగవతోత్తమ ధర్మంబులను కూడా వివరముగా బోధించిరి పిమ్మట కందిమల్లయ్య పల్లె చేరుకొనిరి

## శ్రీస్వామివారు పాంచాననము వారికి కాలజ్ఞానమును బోధించుట

శ్రీముఖనామసంవత్సరమున శ్రీ వీరభోగవసంతరాయుడనై వచ్చి ప్రసిద్ధులైన వారిని పరిపాలించెదను. నేను 5000 సం మీదట వచ్చునప్పటికి బ్రాహ్మణులు సంకరవృత్తులను చేయుచూ, తమ వైభవములను కోల్పోయివుందురు. పదునెనిమిది వర్ణములవారునూ బ్రహ్మవంశస్థులయిన బ్రాహ్మణులను గౌరవించరు. సిద్ధులు, యోగులు జన్మించిన ఆ బ్రాహ్మణకులము పూర్తిగా వర్ణసంకరమయ్యేను. దేవ బ్రాహణులకునూ గౌరవము లేకుండేను నేవత్తునని తెల్సి మన్నెరాజులు మారి పోయేరు ఆనాటికి ప్రజలలో దుర్బుద్ధులు అధికమయ్యేను. దురాశాపరులైన దొరలు నశించేరు. మా కులమువారైన దేవబ్రాహ్మణులు పల్లకీలు, అంబారీలలో పూరేగేరు ఉన్నతులయ్యేరు. అందరిచే పూజింపబడేరు

మా రాకకు కృష్ణవేణమ్మ పొంగిపోయి కనకదుర్గమ్మ ముక్కుపోగును తాకేను విప్రులలలో జాతి; వర్ణాశ్రమ ధర్మాలు లేకపోయేను. అన్ని వర్ణాలవారు అచారాలను పాటించకుండేరు రాజాధిరాజులే అణగివుండేరు. శూద్రులు కేళివిలాసాన వుండేరు. వారి విషయాన మహాలక్ష్మమ్మ నృత్యాలు చేయుచూవచ్చి మాయకోతులనాడించేను ఈతముక్కలమన్నారు వద్ద రామలింగస్వామినుండి కళలు తొలగిపోయేను. జ్వాలమ్మ జనులతో వాదులాడేను. అపుడంతయూ వర్ణసంకరమయ్యేను. మహానందికి ఉత్తరాన అనేకమంది మునులు పుట్టుకొచ్చేరు. భూమి మీద పలుమాయలు జూపేరు. తెల్లని గుడ్ల దేశాన తేలికయ్యేను. తెల్లని కాకులు ఊరి పొలిమేరలందు ఏడ్చేను దాని ఫలితాన కొంతజన నష్టమయ్యేను. నా భక్తులయిన వారికి నేనప్పుడే దర్శనమిచ్చేను. జితేంద్రియ

కానివారి నెత్తురు భూమి మీద పారేను. కొంతభూభారము తగ్గేను. దుర్మార్గుల రక్తముతో భూమి తడిచేను వినాయక నంది, సోమనందుల మధ్య గుడ్డారాలేసుకుని పాలెగాండ్రు అయిదు దినములుండేరు. కందనూరివారు పర్వతప్రాంతాలకు బొయ్యేరు.

చీమలుండు బెజ్జాల చోరులు దూరేరు స్త్రీలందరూ చెడు తలంపులతో నుండేరు అందుచే చోరులు ప్రత్యేకముగా గానరయ్యేను. అహోబిలం మేరగా మహా నంది పర్వతము విడిచివెళ్ళును కందనూరు వరకు కాళీలు దహించుకపోయేరు. గడగ్, లక్ష్మీపురం, రాయచూరు, చంద్రగిరి, అలిపేది, అరవరాజ్యము, వెలిగోడు, మొరస రాజ్యము అన్నే నగరము, పున్నాళి, ఓరుగల్లు, బరిగె, గోలుకొండ మొదలైనవి అభివృద్ధి చెందేను. అహోబిలం. మూరకానరం, నాదబ్రహ్మం వలన పుట్టిన వాక్యాలు తప్పవి కావు ప్రభవనామ సంవత్సరాన రామధర్మజులు కీర్తి విస్తారమయ్యేను. నా మఠము నందు ఏడుసార్లు దొంగలు పడేరు క్షత్రియులు అంతరించేరు. చలనేంద్రియులు, ఆయుధంబులచేత, బాణములుచేతను నిర్మూలమయ్యేరు. ఉత్తరదేశాన బేరికోమటి "గ్రంధి" అనెడి మహాత్ముడు అవతరించేను. అందరిచే పూజింపబడేను. కొన్ని ధర్మములు స్థాపించేను. కందనూరు నీటగలిసేను మహ్మదీయులు, బోయలు, అంత్యజాతులవారు యుద్ధాన హతులయ్యేరు. ఏలూరులో మహాతోరణాలు కూలిపోయి ప్రజలు నశించేరు. భక్తులు కానివారు బాణవర్షము చేత నష్టపోయేరు. నా భక్తులయిన వారు మాత్రం నిలిచేరు. మనసారా నన్ను నమ్మి నా స్మరణ జేయువారు నదులను నిలువమంటే నిలిచేను.

కొన్ని ధర్మంబులజెప్పెద వినుడు. తాము భోజనము చేయక ముందుగా యింకొకరికి పెట్టుట ఉత్తమ ధర్మం తాము భోజనము చేసి యింకొకరికి పెట్టుట మధ్యమ ధర్మం ఫలాపేక్షచే ఒకరికి అన్నము పెట్టుట అధమ ధర్మం చాలకుండా అన్నం పెట్టుట అధమాధమము దానములన్నింట, అన్నదానము శ్రేష్ఠముగాన, ఈ ధర్మమును మనస్సు పూర్వకముగా చేసిన శ్రేయస్కరము అన్నదానము చేస్తూ, సదానన్ను ధ్యానించు వారికి నేను ఎల్లపుడూ రక్షణ కల్పిస్తూనే వుంటాను

కలియుగం 4808 సంవత్సరములు గడచిన తరువాత ధర్మదేవత పుణ్యక్షేత్రాల లోనే సంచారం చేసేను. పాపాలు, కొట్లాటలు ఎక్కువగును నిద్రాహారాల కాల పరిమితులు పాటించక మానవులు పాడయిపోతారు. శాంతస్వభావం కలవారుకూడా కోపాన్ని ఆపుకోలేకపోతారు. పిల్లలు పెద్దలను ఆశ్రయించుటకు బదులుగా, పెద్దలే పిన్నలను ఆశ్రయిస్తారు. దుష్టమానవుల బలం పెరుగుతుంది రాజ్యాలేలినవారు భిక్షాటనకు దిగుతారు

భిక్షమెత్తినవారు ఐశ్వర్యమును పొందుదురు. విరోధాల వల్ల కొంతజననష్టం జరుగుతుంది కుటుంబముల యందు సామరస్యత తొలగిపోతుంది. వావివరుసలు నశిస్తాయి బ్రాహ్మణనింద, వేదనింద, గురువుల నిందలు ఎక్కువ వుతాయి జారత్వము, చోరత్వము, అగ్ని,రోగ దుష్టులవలన ప్రజలు పీడింపబడతారు అడవిమృగాలు పట్టణాలు, పల్లెలలో తిరుగుతాయి. మాల మాదిగలు వేదమంత్రాలు చదువుతారు. ఏనుగు కడుపున పంది, పంది కడుపున కోతి జన్మిస్తాయి.

చోళమండల అస్తమించిపోతుంది శిలలు గండలు కక్కడం అక్కడి కండలు తినటానికి గ్రద్దలువచ్చి అవికూడా చస్తాయి. చచ్చిన గ్రద్దలను పట్టి జనులు ఆనందంతో గంతులు వేస్తారు. బెండ్లు మునుగుతాయి గుండ్లు తేలుతాయి ఇది తప్పక జరుగును రక్తవాంతులు, నోటిలోపుండ్లు వలన, తలలు పగలడం వలన జనం రకరకాలుగా మరణిస్తారు. కొండలమీద మంటలు పుడతాయి జంతువులు గుంపులు గుంపులుగా మరణిస్తాయి. భారతదేశము పరులపాలనలోకి వెళుతుంది సీమవారిపాలనలో అన్ని వర్ణాలవారు చదువుకుంటారు. కులము ఆచారము అనేవి నశిస్తాయి. మనుషు లందరూ కలసి మెలసి, కులమత వర్ణబేధాలు లేక ప్రవర్తిస్తారు అధికారము మొత్తము పరదేశీయుల యందే వుండును.

ఎద్దులేకుండా బండ్లు నడుస్తాయి. మంచినీటితో జ్యోతులు వెలుగుతాయి. గాలిలో వార్తలు వినిపిస్తాయి. ఒకే రేవున పులిమేక నీరు త్రాగుతాయి. వెంపలి మొక్కకు నిచ్చెనలు వేయు మనుష్యులు పుడతారు. విజయనగర వైభవము తొలగిపోతుంది. కాశీదేశము మండలము రోజులు పాడుపడిపోతుంది. కురుక్షేత్రమునందు జనులు ఒకరినొకరు నరుకుకొని గుంపులు గుంపులుగా మరణిస్తారు గోదావరినదిలో నీరు పన్నెండు దినాలు యింకిపోయి తిరిగి పొంగిపోవును కాళహస్తీశ్వర దేవాలయం ద్వారపాలకులు పరస్పరం కొట్టుకుంటారు వేంకటేశ్వరుని కుడిభుజం అదురుతుంది మంగళగిరిలో వైష్ణవులు కొట్టుకు చస్తారు. కుక్కలు గుఱ్ఱాలనుచంపే స్థాయికి వస్తాయి ఆకాశంనుండి చుక్కలు రాలిపడతాయి. కార్తీక బహుళద్వాదశినాడు ఉత్తరాన వింతవింత చుక్కలు కన్పిస్తాయి అవి అయిదు నెలలపాటు వుంటాయి. కర్నాటక దేశాన లక్ష్మి కదలాడుతుంది. మళయాళ దేశాన మందపాలుడు జనులతో మాట్లాడ తాడు నేలనెత్తురుతో తడిచిపోతుంది చనిపోయినవారి ఎముకలు గుట్టలుగా పడి వుంటాయి. దుష్టశక్తులు విజృంభిస్తాయి అందువలన జననష్టం జరుగుతుంది. కాకులు కూస్తాయి. నక్కలు విషధీతంగా వూళలు

వేయడం వలన ఇంకా జననష్టం జరుగుతుంది. కొండవీటి రాతిస్తంభం కూలి కొంత ప్రజా నష్టం జరుగుతుంది.

కలియుగాన 5000 ఎండ్ల నాటికి కాశీలో గంగ కనపడదు కంచికామాక్షమ్మ కొంచెంసేపు గిరగిర తిరుగుతుంది. బెంగుళూరు కామాక్షమ్మ రక్తం కక్కుతుంది. వేపచెట్టునుండి అమృతం కారుతుంది. శ్రీశైలానికి దక్షిణాన కొండలనుండి గుండ్లు దొర్లిపడి జననష్టం జరుగుతుంది పగిలిన రాతిముక్కలు లేచి ఆకాశాన ఎగురును అవి కాకులని భ్రమకలుగుతుంది. రాతిగుంటలయందు చీము, నెత్తురు ప్రవహిస్తాయి. దుష్టులారని బిడ్డలు మాట్లాడతారు ఆకాశాన పొగమంటలు పుట్టుతాయి ఆరు మతాలు ఒక్కటవుతాయి. హాహాకారాలు ఆకాశాన్ని చేరుతాయి. అర్ధరాత్రులందు ఘంటానాదాలు, శంఖనాదాలు వినపడతాయి ఒకరి భార్య మరొకరి భార్యగా మారుతుంది. పుణ్యాత్ములు మాత్రము నా మహిమలు చెప్పుకుంటారు. సుఖంగా వుంటారు పాపులకు రక్షణ వుండదు వేంకటేశ్వరుని సొమ్ము దొంగలు అపహరించేరు తిరువళ్ళువరు వీరరాఘవస్వామి ఒంటికి బంక చెమటలు పడతాయి. పుణ్యక్షేత్రాలలో ఆరుగురు దుర్మార్గులు పుడతారు కృష్ణా గోదావరి నదులమధ్య ప్రాంతమందు జనులు ఎక్కువగా నశిస్తారు. ప్రజలు గ్రామాలు వదలి అడవులకు వెళ్ళిపోతారు అనేక రకాలయిన జబ్బుల వలన పలువురు మరణిస్తారు. కృష్ణానది మధ్యలో బంగారు రథం కనిపిస్తుంది ఆ రథాన్ని చూచిన వారి కళ్ళు పోవును అంటే అంధులవుతారని అర్థము. కర్ణాటక దేశమందలి దేవాలయాలను మహ్మదీయులు ధ్వంసం చేస్తారు రాతి రథాలు విరిగిపడిపోతాయి.

అనాచారాల మూలాన బ్రాహ్మణులు దారిద్ర్యబాధలను పొందుతారు. శ్రీశైలభ్రమరాంబ గుడిలో రెండు తలల బంగారు మొసలి కనపడి అమ్మవారిలో లీనమైపోతుంది. అమావాస్యనాటి అర్ధరాత్రి సమయాన ఉదయగిరి శిఖరం మీద చక్రాంకితుడైన ఒక పరమహంస ఎక్కి నిలిచి వుండడంచూసి, చంద్రగ్రహణమా అని జనులు ఆశ్చర్యం చెందుతారు. ఆకాశమార్గాన రెండు బంగారు హంసలు వచ్చి, పట్టణాల్లో సంచరిస్తాయి. దురాశాపరులు వాటిని పట్టుకొనుటకు ప్రయత్నించి సర్వనాశనమైపోతారు. ఆకాశాన తూర్పు పడమరలు కాషాయరంగున కన్పిస్తాయి. కొండలనుండి పెద్ద పెద్ద ధ్వనులు వినిపిస్తాయి. వీరభోగవసంతరాయలునై నేను వచ్చులోపల ఇలాంటి వింతలు అనేకం జరుగుతాయి. సర్వకాల సర్వావస్థలయందు నన్ను కీర్తించువారికి, కాలజ్ఞానాన్ని చదివితే దానిని భక్తితో పూజించు వారికి నేను తప్పక రక్షణ కల్పించగలను. ఇట్లు పాంచాననము వారికి జ్ఞానబోధను ముగించిరి

తరువాత స్వామివారి భోజనానంతరము సిద్ధయ్యగారు స్వామివారి పాదసేవ చేసికొనుచూ, స్వామీ! తమరు యిదివరలో కృత, త్రేతా, ద్వాపరయుగములలో దశావతారములలో వుంటిరని కాలజ్ఞానమున వివరించిరిగదా. ఎక్కడెక్కడ ఎన్ని యుగంబుల నుండి మీరు చేసినవి తెలియ జేయగలందులకు కోరుచున్నానన అడుగగా స్వామివారు నీవు కోరినది దేవరహస్యము. అయిననూ నీవు తెల్సుకొనుటకు అర్హుడవు కావున నీకు తెలియజేసెదనని కాలజ్ఞానములోని సప్తమాశ్వాసములో తాము వివరించిన తమ అవతార విశేషములను యిట్లు తెలియజేసిరి.

# శ్రీ వీరబ్రహ్మంగారు సిద్ధయ్యగారికి కాలజ్ఞానమును బోధించుట

బ్రహ్మలోకమున నేను భైరవుడనేనామముతో అనేక బ్రహ్మకల్పాలు రాజ్యపాలన చేసి వుంటిని తరువాత వెండికొండ మీదికి వెళ్ళి యాభయిమూడు బ్రహ్మకల్పములు రాజ్యపాలనచేసి, కైలాసమునకు బోయి రెండువందల నలభై మూడు బ్రహ్మ కల్పములు రాజ్యపాలనచేసి, వైకుంఠమునందు మూడు యోజనములపొడవున్న కూర్మసింహాసనమును నిర్మించుకుని ముప్పది మూడు బ్రహ్మకల్పాన్ని పాలించి రెండువందల తొంబది బ్రహ్మకల్పాలు మాధవస్వామిసేవ చేసితిని అందులకు మాధవస్వామి 'పంచవిధముక్తి' ప్రసాదించినారు. అందువలన ఆయన దయతో ఆయన వద్ద 10 దివ్య సంవత్సరములు గడపి; 1550 సార్లు భూప్రదక్షిణము గావించి, సిద్ధాంత శిరోమణులయిన ఆనందాశ్రితువు ఆశ్రమము వద్ద సర్వవిధ్యలూ సాంగంబుగా అభ్యసించి, మూడేండ్ల తరువాత అనేక యోగశాస్త్ర విధ్యలను, 12009 గ్రంథములను పరిశీలించి, అందుండు మర్మములన్నియూ గ్రహించి, కాల అకాల మృత్యువులను జయించి, నా యోగబలము వలన దివ్య శరీరము ధరించి 3333 బ్రహ్మకల్పములు వుంటిని. ఆ తరువాత నా అవతారముల గురించి వివరముగా తెలుపుచున్నాను వినుము

మొదటి అవతారమెత్తి ఆనందాశ్రితులకు శిష్యుండనై 99,662 బ్రహ్మకల్పాలు వున్నాను రెండవ అవతారమున ఆనందాశ్రితులకు శిష్యుండనై 795 బ్రహ్మకల్పాలు వున్నాను. మూడవ అవతారమున ఆనందాశ్రితులకు శిష్యుడనై 1,09,00,000 ఒక కోటి తొమ్మిది లక్షల

బ్రహ్మకల్పాలు వున్నాను. నాల్గవ అవతారమున ఆనందాశ్రితులకు శిష్యుడనై ఒక కోటి పదమూడు వందల పదిహేడు బ్రహ్మకల్పాలు వుంటిని అయిదవ అవతారమున ఆనందాశ్రితులకు శిష్యుండనై నాలుగుకోట్ల పద్నాలుగు లక్షల యాభై అయిదు వేల బ్రహ్మకల్పాలు వున్నాను అరవ అవతారమున ఆనందాశ్రితులకు శిష్యుండనై ఆరువందల బ్రహ్మకల్పాలు వున్నాను. ఏడవ అవతారమున ఆనందాశ్రితులకు శిష్యుడనై (27 62,03,400)ఇరువది ఏడుకోట్ల అరవై రెండు లక్షల మూడువేల నాలుగు వందల బ్రహ్మకల్పాలు వుంటిని ఎనిమిదవ అవతారమున ఆనందాశ్రితులకు శిష్యుండనై ఇరువది రెండు లక్షల అరవై వేల (22,60,000) బ్రహ్మకల్పములు వుంటిని. తరువాత తొమ్మిదవ అవతారమున ఆనందాశ్రితులకు శిష్యుండనై యజ్ఞేంద్రునకు కుమారుడనై, డెబ్బదికోట్ల ముప్పది తొమ్మిది లక్షల, ముప్పది ఆరు వేల బ్రహ్మకల్పాలు వుంటిని. (70,39,36,000) తరువాత పదియవ అవతారమునందు ఆనందాశ్రితుల శిష్యునిగా, కనిగిరి వాసుడనై, డెబ్బది లక్షల మూడు వందల అరువది అయిదు బ్రహ్మకల్పములుంటిని (70,00,365) అటు పిమ్మట బనగానపల్లెలో వీరప్పయాచార్యుడనై 125 సంవత్సరములు తపమొనరించి కలియుగము 3800య్యేండ్లకు సరిగ్గా వికారినామసంవత్సర ఆషాఢశుద్ధ త్రయోదశి, తదారభ్య (మొదలుగా) ఏకవింశతి వికారినామ సంవత్సరములోగా, వీరవసంత రాయల పేర నందికొండలో ప్రఖ్యాతి పొందగలను. వీరబ్రహ్మేంద్రస్వామిగా మొత్తము 175 సంవత్సరములు జీవించి జీవసమాధిని పొందగలను.

ఈలోగా హరిహరరాయ్షలు మొదలు రామరాయలవరకు చరిత్ర అంతమయ్యేను తరువాత కాలాన ఈ ఖండము మహ్మదీయుల పరమయ్యేను (ఈ అవతార వివరాలను బ్రహ్మంగారు అచ్చెమ్మగారికి, ఇతర భక్తబృందానికి కూడా, అచ్చమ్మగారిచే నిర్మించబడిన నేలమరమున కాలజ్ఞానబోధచేసెడు సమయమున చెప్పియున్నటుల తెలియును) కలియుగాన 4999 సంవత్సరముల తర్వాత ఉత్తరాన గంధి అను మహావ్యక్తి జన్మిస్తారు. రాజకీయ్య చిక్కులుబడని చివరకు మహాత్ముడని ప్రసిద్ధి చెందును ఆయన ధర్మసంస్థాపన చేస్తాడు. బందరు పట్టణము సముద్రపు నీట మునుగును. శ్వేతముఖులు (ఇంగ్లీషువారు) రాజ్యాన్ని ఏలుతారు. జనులు సామాన్య జీవులు అవుతారు. ప్రాణులు లేకుండా బండు నడుస్తాయి. ప్రపంచాన మంచినీట దీపాలు వెలుగును.

పల్నాటిసీమలో నరులు వచ్చి ఆకులు తిని జీవిస్తారు. మొగలాయి రాజ్యాన ఒక నది పొంగి చేలు నాశనమయిన రీతిగా, జనాన్ని నశింపచేస్తుంది. నెల్లూరి సీమ నీటిమయమై కోట్లాది జనులు మరణిస్తారు. వ్యభిచార వృత్తి అంతరించిపోతుంది. ఆ వృత్తిలోని వారు వివాహాలు చేసుకుని కాపురాలు చేస్తారు తమను తాము తెల్సుకోగలిగిన గురువులు కనిపించరు నిజమైన గురువుల మాటలకు విలువ లేకుండా పోతుంది. దొంగ గురువులు ఆడంబరంగా బ్రతుకుతారు. కుటుంబము నందు సఖ్యత వుండదు తల్లి, తండ్రి. పిల్లల మధ్య వాత్సల్యాలు వుండవు. ఒకరిమీద మరొకరికి నమ్మకం నశిస్తుంది

నాతోపని గలిగిన నా భక్తులకొరకు నేను వీరభోగవసంతరాయలుగా రావలసి యున్నది నారాకకు ముందుగా, నా భక్తులు వారి శక్త్యానుసారము, నా ధర్మ పరిపాలనకు అంకురార్పణలు చేస్తారు. నేను వచ్చి ధర్మపాలనను అందిస్తాను. నారాక అనంతరము దేశము సుభిక్షమవుతుంది. ధర్మం ఉన్నతస్థానాన నిలబడుతుంది. నేను రాయలనాటి బంగారు సింహాసనాన్ని అలంకరించి, అధిష్ఠించి, పరిపాలన చేస్తాను. మరికొన్ని దేవరహస్యాల్ని గుప్తంగానే వుంచుచున్నాను. అని సిద్ధయ్య గారికి బోధించిరి.

శ్రీ పరంజ్యోతి స్వరూపిణి అయిన గోవిందమ్మగారు గ్రామములో స్ఫోటకములు మొదలైనవి వుండుటచేత, గ్రామవాసులందరునూ, పోలేరమ్మకు పొంగలులు చేయ వలయునని తలంచి, ఎవరి శక్తి కొలది వారు పొంగలులు చేసిరి గోవిందమ్మగారు కూడా పోలేరమ్మకు చద్దిపెట్టిన మంచిదని తలంచి, చద్ది తయారుచేసి పోలేరమ్మకు నైవేద్యము పెట్టుకు పనులు చేసుకొనుచుండెను అంత శ్రీ వీరబ్రహ్మంగారు చూచి, నవ్వుచూ, రాతిని పూజించి నైవేద్యము పెట్టిన ఆరగించునా, అదిసరికాదు. నా పూజ ముగియు సమయానికి వంటకములను నైవేద్యమును తయారు చేసి వుంచుము ఆ పోలేరిని మన యింటికివచ్చి భోజనము చేయునట్లు చేసెదననిచెప్పి తన పూజా కార్యమున వెడలిరి ఇది తెలిసిన ప్రజలందరూ స్వామివారి గృహము వద్ద గుమికూడిరి. వారిని లోనికి రప్పించి కూర్చుండమని చెప్పిరి. అదే సమయమున కర్నూలు నవాబు కూడా స్వామివారి దర్శనార్థము వచ్చెను. విషయము తెల్సికొనిన నవాబు తను యిచ్చటకు వచ్చుట, అమ్మవారి దర్శనము కలుగబోవుట తన అదృష్టముగా భావించిరి. వంట తయారయినదని గోవిందమాంబగారు చెప్పగనే, స్వామివారు స్నానమాచరించి, నిష్ఠయందు గూర్చుండి, కొంతసేపటికి లేచి ముందుగా దేవదేవి అయిన పోలేరి మహాదేవికి ఒక ఇస్తరియందు నీవుచేసిన సకల భక్ష్యభోజ్యములను ముందుగా వడ్డించి, తదుపరి మాకందరికినీ వడ్డన చేయమని,

గోవిందాంబగారికి స్వామి చెప్పిరి, స్వామివారి ఆజ్ఞానుసారము ముందుగా దేవికి వడ్డించి, తరువాత స్వామివారికి, కుమారులకు, కుమార్తెకు పిదప సిద్ధయ్యకు, నవాబుకు అందరికీనీ వడ్డించిరి అంత స్వామివారు మనంబున 'పోలేరిదేవిని' తలంచినంతనే, యుక్త వయస్సున బాలికా రూపమున ఆ తల్లి శ్రీ వీరబ్రహ్మంగారి ఎదుట నిలువగా, తల్లీ! మీ అమ్మయైన గోవిందమ్మ నీ కొరకు ఏవియో చేసినదట ఆరగించమని చెప్పగా, ఆ తల్లి నాయనా! అట్లే భోజనము చేసెదనని అందరూ చూచుచుండగనే భోజనము చేసి, తండ్రీ నేను యిక వెళ్ళుటకు శెలవు తీసుకొందునని పలుకగా, స్వామివారు తల్లీ నేను కొద్దికాలములో సమాధి నిష్ఠను పొందబోవుచున్నాను నా రెండవ కుమారుడయిన పోతులూరయాచార్యులకు నీవొక వుపకారము చేయవలయును కనుక మీ తల్లి అయిన గోవిందమ్మ నిన్నెప్పుడు తలంచునో అప్పుడువచ్చి ఆమె ఏమి చెప్పునో అది చేయమని చెప్పిరి ఆ తల్లి సరేనని శలవు తీసుకుని స్వామివారి నమస్కారములు గైకొని అంతర్ధానమయ్యెను. అచటకు జేరిన అందరునూ, ఆ తల్లి దర్శనభాగ్యమును పొంది మిగుల సంతోషించిరి. అంత కర్నూలు నవాబు తనకు మరికొన్ని కాలజ్ఞానరహస్యములు చెప్పెదనంటిరి కాన యిటు వచ్చితిని నాకు పుణ్యము దక్కినది యింకొకసారి కాలజ్ఞానమును తెలియపరచవేడగా, స్వామివారు అంగీకరించి, ఆ మహాజనమును అట్లే కూర్చుండమని, కాలజ్ఞానమును బోధించిరి.

## కర్నూలు నవాబునకు స్వామివారు కాలజ్ఞానమును బోధించుట

క్రోధినామ సంవత్సర మర్గశిర శుద్ధపంచమి, సోమవారమున పునర్వసూ నక్షత్ర కర్కాటక లగ్నంబున శ్రీ వీరభోగవసంతరాయుడనై నేను వచ్చు సమయమునకు దక్షిణాన ఉత్పాత కారణమైన ఒక గొప్ప నక్షత్రముబుట్టి జనులకు కాన్పించేను. యాగంటి కొండవద్ద పన్నెండు లక్షల గుఱ్ఱాలు చేరేను. కామధేనువులు చేరేను. శ్రీ విరూపాక్షరాయలు గుత్తి, బళ్ళారి పోవుటకు, గిద్దలూరుచుట్టి రంగాపురానికి పోవలసి వుండేను వేయి గుఱ్ఱాలు, పదివేల ఏనుగులు, అయిదు వేల కాల్బలములతో రంగాపురానికి పోవలెను. ఆ రంగాపురము నుండి కడపకు ఉత్పాతాల్లు కలిగేను. అవి రంగాపురము నుండి పులివెందకొండకు చేరేను. పులివిందనుండి, చనుకొండకు వచ్చి అక్కడినుండి గుత్తిచేరి, వారితోకలసి, ముందు చెరువు దగ్గర వారిని మంచి పుణ్యస్త్రీలు, గంధము, కస్తూరి, పరిమళద్రవ్యాలు అయ్యవారుకోరినారు

గనుక వాటిని అమర్చిపెట్టేరు. విద్యారణ్య స్వాములవారికి, ప్రతిబింబాన శుకయోగిపుట్టి, వీరేశ్వర స్వాములవారు, వీరభోజునకు జంబూద్వీపాన్ని స్వాధీనం చేసేరు పది పరమార్థాలు, సప్తవాయువులు కలసి, సప్తరాత్రములు విసురుతాయి. చుండిపర్వతము, ఆలంపూరు మొదలయిన స్థలములందు ఉత్పాతాలు పుట్టేను. ఈ ప్రాంతాన పాలెగాళ్ళు రాయపట్నగట్టుకొని, తమలో తాము కలహించి, చెడి అడవులపాలై భ్రష్టులైపోయేరు. నలుదిక్కులయందు దివ్యమైన నక్షత్రాలుపుట్టి కంటికి కనిపించి రాలిపోయేను. భృగు మహర్షికి అరికాలున నేత్రము నిచ్చితిమి. శాపదగ్ధులయినవారికి శాపాలను వుపసంహ రించి వారికి ఉన్నతస్థానాలు కలుగజేసేము. తక్కినవారు నిర్వంశమైపోయేరు. నా భక్తులు మాత్రమే నిలిచేరు. శ్రీమన్నారాయణుని మహిమ నా భక్తులకు కూడా యిచ్చేము దేశములోని దుష్టులు తెల్లనెల్లికాయ పీచువలె అనావృష్టి దోషంబు తగిలి ఆసనానగండమాల పుండ్లు, నెత్తిన పెదశిపుండ్లుపుట్టి, వివిధ వ్యాధులు పుట్టి, వేదాంత-శూన్యులై పెద్ద ఆముదపు గింజ చిట్లినట్లు చిట్లిపోతారు. అమావాస్య రోజున పూర్ణ చంద్రుని జూచి జనులు నసించేరు కార్తీకం నిజమని నా మహిమను తలచుకునేరు. కార్తీకశుద్ధ ద్వాదశినాటికి విష్ణుభక్తి పుట్టేను. అప్పటికి సామవేద ఘోష వినిపించేను. జ్ఞానశూన్యులైనవారు నన్ను తెల్సుకోలేరు. చందోబద్ధమనుచోట, పెయ్యివీర్యాన బుట్టినవారికిగానీ తెలియదు. సూర్యనందియందు ఉద్భవించేను. అపుడు పువ్వుల వర్షము కురిసేను. తూర్పున శిరస్సు, పడమర తోకగా, తోక వెడల్పుగా ఇరువది బారల పొడవుగల నల్లని ధూమకేతువనే నక్షత్రం బుట్టేను. పుట్టిన ముప్పది రోజులకు అందరికీ కన్పించేను. అదే సమయాన పుణ్యాత్ములందరకూ, సూర్యమండలాన మనుష్య రూపము కన్పించేను. ఆకాశము ఎఱ్ఱబడి, ఆవులు పైకి చూచి అరచేను. ఆకాశాన 'భగుళ్ళు, భగుళ్ళు' అనుశబ్దం పుట్టేను. సూర్యనందియందు అయిదు దినంబులుండి భూమిమీద ప్రఖ్యాతమయ్యేను అప్పటికి వన్నైన జనులంతా నిలిచేరు దేశాన్ని పాలించేను. జగత్తును ఏలేను. కలియుగాన 5000 ఏండ్లు గడిచిన మీదట నా రాకకు మీకు దృష్టాంతాలు కనపడేను ఈలోగా వ్రాసిన ప్రకారము అనతికాలమునకు కొన్ని దృశ్యాలు జరిగేను. అదే మీకు నిదానమని తెలిసేది ఈశ్వరమ్మగారిని, రంగరాజునకిచ్చి వివాహం చేసేనాటికి కందిమల్లయ్య పల్లె నవరత్న మండపాలతో పన్నెండామడల పట్నమయ్యేను నా భక్తులు యావన్మంది యిచ్చటకు వచ్చి కళ్యాణం జూచేరు. అదే మీకు నిదర్శనము. ఆ మీదట నూట తొంబది ఐదు సంవత్సరములు ధర్మనంద్నుడు

ధర్మంబు నెరపిన రీతిన నేను ధర్మమును నడిపేను. ఇది సత్యము. వీరగురు వాక్యము. కొలదిదినములు మాత్రమే ఈ కలియందువుండి, సమాధిలోనే కొన్ని వందల సంవత్సరాలు తపస్సుచేసి, తిరిగి ధర్మసంస్థాపనార్థము వీరభోగవసంతావతారుడనై కలియుగంబునకు వచ్చెదనని వివరించెను.

## చోరులకు జ్ఞానబోధ

నవాబుగారి భక్తి ప్రపత్తుల వలన స్వామివారికి అనేకములయిన బహుమతులను అందజేసిరి. ఆ బహుమతులను, బ్రహ్మంగారి మఠంలోనే వుంచిరి ఈ విషయమును తెలుసుకొనిన కొందరు చోరులు వాటిని దొంగిలించుటకు రాత్రియందు మఠమున ప్రవేశించి, ఆ వస్తువులను తాకినంతనే, నరములు లాగివైచి, నియంత్రించినట్లు బొమ్మల్లా నిలబడిపోయిరి. శరీరం వారిఆధీనంలో లేదు. పారిపోవటానికి ప్రయత్నించినా విఫలమయ్యారు శరీరం ఆధీనం తప్పి ఏమీ చేయలేని అయోమయ పరిస్థితి. అతి తేలికగా పట్టుబడిపోయారు. ఆ దొంగల విషయంలో వీరబ్రహ్మంగారు జాలి ప్రదర్శించి, దయార్ద్ర హృదయంతో వారికి బుద్ధి చెప్పటానికి మారుగా కాల జ్ఞానాన్ని ఉపదేశించారు అమూల్యమైన విషయ జ్ఞానాన్ని వారికి పంచి యిచ్చారు. చోరులకు వినిపించిన కాలజ్ఞాన సారాంశం యిది.

మనదేశానికి ఆపదలు తప్పవు. ప్రళయానికి సూచనగా ఆకాశం ఎఱ్ఱనయ్యేను. ఆరుమతాలు ఒక్కటయ్యేను. నిప్పులవాన కురిసేను నెల్లూరు జలమయమయ్యేను. నేలపై నెత్తురు ఏరులై పారేను ఏడు గ్రామాలకొకగ్రామం, ఏడిళ్ళకొకయిల్లయ్యేను. ప్రజలు కత్తులతో కొట్లాడుకునేరు పార్వతి, బసవేశ్వరుడు కంటనీరు కారేను. మహాదేవుడు జడలేగసి ఆడేను కప్పలు కోడికూతలు కూసేను ఉప్పుగుండూదిలో విలయతాండవం జరిగేను భూమి కంపించేను. ఆనాడు నేను సమాధిలోనుండి వీరభోగవసంతరాయలుగా అవతరిస్తాను అని తెలియపరచిరి.

## కాలజ్ఞాన సౌజన్య పత్రిక

శ్రీ వీరబ్రహ్మంగారు కొన్ని దినములు జరిగిన పిమ్మట, సమాధి నిష్టను పొందుటకు కోరిక గలవాడై తన పెద్ద కుమారుడయిన గోవిందయాచార్యస్వామికి పట్టాభిషేకము

చేయదలచి, యీ విషయమై తన భక్తులందరికినీ లేఖలు వ్రాసి, వాటితోగూడ కాలజ్ఞాన సౌజన్య పత్రికను కూడా వుంచి పంపెను. ఆ కాలజ్ఞాన సౌజన్య పత్రికయందు యిట్లుండెను

మేము ఈ వైశాఖ శుద్ధదశమి ఆదివారం పగలు రెండున్నర గంటలకు ఈ లోకమును విడిచి జీవసమాధి సిద్ధిని పొందదలచితిమి కనుక ఈ పీఠాధిపత్యమును నా జ్యేష్ఠ కుమారుడైన గోవిందాచార్యస్వాముల వారికి పీఠాధిపత్య పట్టాభిషేకమును చేయ నిర్ణయించినాను అది కన్నులారా తిలకించి నా వద్ద మూడు దినములుండి, నేను సమాధి గతుడనగుట్చూడవచ్చును. అందులకే ఈ ఆహ్వానము. ఆ కాలమున నేను వివరించబోవు కాలజ్ఞాన విశేషాలను విని తరించవచ్చును. అలా స్వయముగా వచ్చి కాలజ్ఞానాద్వైత తత్త్వబోధ వినలేనివారి కోసం ఈ పత్రికతో కొన్ని కాలజ్ఞాన విశేషాలను వివరించియుంటిని ఈ పత్రికనే వారు దీపారాధన, నైవేద్యములతో పూజించిన వారికి సకల శుభములు కలుగును.

నేను ఈ వీరబ్రహ్మేంద్రస్వామి అను పేరు ధరియించి యిప్పటికి 175 సంవత్సరములు గడచినవి. ఇప్పుడు నేను సమాది నిష్టయందు వుండ నిర్ణయించు కున్నాను..నేను మరల భూమిమీదకు వీరభోగవసంతరాయలుగా రానున్నాను నేను వచ్చు సమయానికి పాప భూయిష్టమైన ఈ లోకంలో, ఈ కలియుగమున ఎఱ్ఱ బోయీలు శ్వేతద్వీపవాసులు వచ్చేరు. శాలివాహన శకమునందే, వీరు మహ్మదీయులు స్నేహముపొంది, భరతఖండమేలేరు. నేను గూడా అవతారమును దాల్చి అనేక శాస్త్ర విషయముల పరిచయము వుంచుకొని, అనేకమంది పండితులను, చతురలుగనూ, యుక్తిపరులుగను జేసేను. హరాహరాదుల గుళ్ళల్లో పూజలు హరించి పోయేను. గుళ్ళలో శక్తులకు మూర్తిపంతాలు కళలు అధిక మయ్యేను. గ్రామాలలో శక్తులావిర్భవించేను. ధనమధాంతతచే సాధువులను, జ్ఞానులను ధూషణ చేసేరు. భూమిపై పైరులు పండినట్లుగానే వుండేను. వర్షములు కురిసినట్లుగానే వుండేను కానీ పంటలు పండకుండేను ఒక్కొక్క స్థలంబున సృష్టి వేలన పంటలు పండేను. పాపాత్ముల గుడ్లలో పల్లేరులు పడి ముఖాలు పగిలి చచ్చేరు. మేము నంది పర్వత మందు తపస్సు చాలించి, ఉత్తరాన వింధ్యగిరి పట్నంవచ్చి, అక్కడ కొన్ని ఏండ్లు నివసించేము. ఆ సమయాన మీకు ఒకని ధర్మం కనిపించేను. బహుధాన్యనామ సంవత్సరములో, కనకదుర్గ మొదలయిన శక్తులు భూమిమీదకు వచ్చేను కర్నాట దేశమునకు కాళీపంపు, తురక

దేశమునకు దుర్గిపంపు, మహనంది దేశమునకు భరతుని పంపు, కందనూరు రాజ్యానికి నాగేంద్రుని పంపు, మొరసరాజ్యానికి చక్రి పంపు, ఉత్తర దేశాలకు అర్కసోమునిపంపు, పశ్చిమదేశాలకు కంచికామాక్షమ్మ పంపు, మాతంగి అనే శక్తి యీ విధముగా నశింపుచేసేను. నందనామ సంవత్సరానికి అక్కడ నుండి, శ్రీశైలాద్రికివచ్చి, మల్లికార్జునుని దర్శనంబొంది వారినుండి అనేక వరములను బడసి, శ్రీశైలాన తపమాచరించేను. నందనమ సంవత్సరాన నేను తపమునకు కూర్చుండేముందు, భూమి మీద కొన్ని నక్షత్రాలు రాలిపడేను భూమి గడగడ వణికేను. అనేకమంది ప్రజలు మరణించేరు. శుభకృతునామ సంవత్సరాన, కార్తీక మాసాన, దక్షిణభాగాన అనేక ఉత్పాతాలతో ధూమకేతు నక్షత్రం బుట్టేను. అందువలన అనేకులు నశించేరు. పరాభవనామ సంవత్సరమున మల్లికార్జునస్వామివద్ద వరాలు గైకొని, వింధ్యపర్వతాలకుబోయి, అక్కడ ఋషుల దర్శించుకొనేను. నేను సమాధి విడిచి అయోని సంభవునిగా, విష్ణు అంశచే, కలికావతారమెత్తేను ప్రమాదీచనామ సంవత్సరమునకు ఎనిమిదేండ్ల వాడనై ఎఱ్ఱిబోయీలతో కలసి, వారికి అంతర్య బుద్ధులు వేరుగా కల్పించి, అచటినుండి శాలివాహనశకం 5047 సంవత్సరము నాటికి, సరిగా పింగళనామ సంవత్సరములో ఘోరమైన కొట్లాటలు ప్రారంభమయి. కాళయుక్త నామ సంవత్సరము వరకూ, ఉత్తరదేశాన పోట్లాటలు విపరీతంగా జరిగేను

ఆనందనామ సంవత్సరాన మార్గశిరబహుళ అష్టమి గురువారం మల్లికార్జునుడు భ్రమరాంబా సమేతంగా, వింధ్యపర్వతానికి చేరేను. మల్లికార్జున వీరభోజయా చార్యులు, వీరభోజవసంతరాయలనే పేర్లతో, దుర్మతినామ సంవత్సర, కార్తీక శుద్ధ పౌర్ణమీల వరకు, పదహారు వత్సరముల వయస్సుగలగి, దుష్టశిక్షణచేసి, శిష్టులను రక్షించుటకు, నా భక్తుల పాలించుటకు వచ్చేను. రక్తాక్షినామ సంవత్సరము, బెజవాడకు వచ్చి, అక్కడ మాతృవంశజులైన పోతులూరి వారి కన్యను పెండ్లియాడి, పట్టాభిషిక్తుడు నయ్యేను. దుర్ముఖినామ సంవత్సరం, కార్తీకశుద్ధ చతుర్దశి మొదలుకొని, దుష్టనిగ్రహం ఆరంభించేను మహాప్రళయంగా నేను పరిపాలించేను. ఆ ప్రళయాలకు రౌద్రినామ సంవత్సర కార్తీకమాసాన పోట్లాటలు ఆరంభమై వుండేను నేను వచ్చుసరికి కలియుగ ప్రమాణం 4094 అయ్యేను అప్పటినుండి పదియారు ఆనందలకు మీకు చెప్పిన భవిష్యత్‌లు జరిగిపోయేను.

నా భక్తులయిన వారును సదానమ్మి ఓం, హ్రీం, క్లీం, శ్రీం, శివాయ శ్రీవీరబ్రహ్మణే నమః అను బీజసంపుటియైన యీ మహామంత్రమును ఏ వర్ణస్థులైననూ, మడి, మైలలని మనస్సున దలచక సదా జపించినయెడల వారిని తరింపజేసేను ఈ పత్రికను ధూపదీప నైవేద్యములతో పూజించి, దాన ధర్మములు చేయువారు నా రక్షణ పొందగలరు.

# పుత్రుడు గోవిందాచార్యులస్వామికి బ్రహ్మంగారు తెల్పిన భవిష్యత్

శ్రీ వీరబ్రహ్మంగారు, తన కుమారులకు వినిపించిన కాలజ్ఞానాన్ని అనుసరించి మొదటగా, శ్రీ బ్రహ్మంగారు విశ్వనాధ అవధూతగా పుడతారు ఆ తరువాత ముప్పరంలో స్వర్ణ అమరలింగేశ్వర స్వామిగా, చెరుకూరి శివరామయోగిగా జన్మిస్తారు అటు తరువాతనే వీరభోగవసంతరాయుల అవతారం.

నాయనా! నేను కందిమల్లయ్యపల్లె చేరి వీరబ్రహ్మనామంతో యిప్పటివరకు 175 సంవత్సరాలు గడచిపోయాయి. ఇప్పటి వరకూ నేను ఈ కలియుగమందలి జనుల మనస్సులను మార్చి, కేవలం పరబ్రహ్మ వుపాసకులుగా మార్చగలిగితిని. నా తరం అయిపోయి, నీ తరము వచ్చినది ఈ పామరుల మనస్సులు ఏ విధముగా మార్చగలవో అది నీ యిష్టము. నేను ఈ రోజు మధ్యాహ్నం రెండున్నర గంటలకు సమాధి నిష్ఠయందు ప్రవేశించ నిశ్చయించితిని. నీ సోదరసోదరీమణులను కాపాడు కొనుము. నీకొక పరమార్ధమును తెలియజేయుచున్నాను. నీ గర్భవాసమున పరమేశ్వరియే జన్మించును ఆమె వీరమాత కాగలదు. ఆమె భూత, భవిష్యత్, వర్తమానములను తెలిసిన పుట్టు బ్రహ్మజ్ఞాని ఈ కలియందలి మూఢులకు నేనెట్లు మహిమలు చూపితినో, అటులనే ఆమె కూడా, అత్యద్భుతములను, మహిమలు జూపును ఆమె వాక్కులు వెంటనే ఫలించి తీరును చివరికామె నాలాగునే సమాధి నిష్ఠను బొందును. నాకు మఠములున్నట్లే, ఆమెకును మఠము లుండును నాకెట్లు పూజలు జరుగుచున్నవో అట్లే ఆమెకునూ పూజలు జరుగును. నీ పూర్వ పుణ్యఫలము చేత జగదీశ్వరి నీకు పుత్రికగా జనియించుచున్నది. నీ కొరతలు, సర్వజనుల అనుమానములు ఆ పరమేశ్వరియే తీర్చగలదు. ఆ మహాదేవిని ఈశ్వరమ్మ

అని పిలుచు కొనుము ఇక సిద్ధుని విషయమును వినుము ఆతడు ఈశ్వరాంశ సంభూతుడు ఈతడు ఒక క్షత్రియుని యింటబుట్టి గోహత్య చేయుట వలన నిటులు మహమ్మదీయ వంశమున జన్మించినాడు. ఆ గోహత్య పాపపరిహారమునకై యిట్లు నా పాదసేవకుడయినాడు ఆతడు గురుదీక్షా ప్రసిద్ధుడు, అతని భక్తి అపారము. అతడు ఈ లోకమునే విసర్జించిన జ్ఞానయోగి పూర్వజ్ఞానం గల పుణ్యమూర్తి. అతడు అద్వైత విషయములందు ఆసక్తి గలవాడు ఆ కార్యము సిద్ధించి సిద్ధుడయ్యాడు అందులకే సిద్ధయ్యను నా ప్రధమ శిష్యునిగా ఎంచి సకలమును బోధించితిని. అతడు ధన్యజీవి.

స్వామివారు యీ విధముగా తన వాక్కుతోనే పదిసార్లు కాలజ్ఞానమును వివరించారని తెలియుచున్నది.

## శ్రీ వీరబ్రహ్మంగారు గోవిందమ్మకు జ్ఞానబోధ చేయుట

వైశాఖశుద్ధ దశమి, ఆదివారం అభిజిత్ లగ్నం మధ్యాహ్నం రెండున్నర గంటలకు శుభ సమయమైనందున తాను సమాధి పొందగలనని వీరబ్రహ్మంగారు చెప్పినంతనే గోవిందమ్మగారు విలపించి, తనను ఒంటరిచేసి వెళ్ళవద్దని స్త్రీ సహజమైన బేల తనముతో మాట్లాడు గోవిందమ్మనుచూచి, శ్రీ బ్రహ్మంగారు 'నాకు మరణంలేదు నీకు వైధవ్యంలేదు నీవు సుమంగళిగా జీవించు' సమాధిని చీల్చుకుని నేను వీరభోగవసంతరాయులనై భూమి మీద అవతరించేను నా ధర్మపాలనతో భక్తులను కంటికి రెప్పలా కాపాడుకుంటాను. నేను అవతరించు వరకు జరుగు విషయమలను తెలియజేసెద వినుము అని కాలజ్ఞాన బోధ చేసిరి

బెజవాడ కనకదుర్గమ్మ భక్తులతో స్వయముగా మాటలాడేను. మహాలక్ష్మమ్మ నృత్యం చేస్తూ వచ్చి మాయకోతులను ఆడించేను కృష్ణవేణి ఉప్పొంగి దుర్గమ్మ ముక్కుపోగు అంటేను కంచికామాక్షి కన్నీరు వొలికేను. కాళహస్తీశ్వరుని కళలు చెల్లాచెదురయ్యేను. కుంభకోణంలోని ఆలయం కుప్పకూలేను బనగానపల్లెలో నా ప్రధమ భక్తురాలు అచ్చమ్మ గారి వంశము అంతరించేను వారి ఆలమందలు పూర్తిగా నశించేను. మన నారయణమ్మ వంశస్థులే మఠాధిపతులయ్యేరు. ధర్మపత్నీ ఇక భ్రాంతి వీడుము. నీవు సాక్షాత్తు లక్ష్మీ అవతారం. నేను వీరబ్రహ్మ అవతారుడైన మహావిష్ణువును భూదేవి భారమును తగ్గించుటకే మనమిటుల అవతరించితిమి శంకరుని అవతారమే సిద్ధయ్య. అన్నాజయ్య బ్రహ్మస్వరూపం అని చెప్పి గోవిందమ్మ గారి చింతను మాపినారు

# శ్రీ వీరబ్రహ్మంగారు సమాధి ప్రవేశమునకు ముందు భక్తులకు కాలజ్ఞానము వినిపించుట

ఇప్పటికి కలియుద్ధం జరిగి 4694 సంవత్సరాలు గడిచినవి ఇది మొదలు 16 ఆనందలకు కలియుగం 5000 ఏండ్లపైన మరల వీరభోజయాచార్య రూపంతో బెజవాడ సమీపమునకు రాబోయెదను. ఒక ప్రమాణము తెలియజేసెదను. నంది కొండయందు తపస్సు చేయుచున్న యనమదల వీరభోజ్యాచార్యులవారు పదమూడు ఆనందల తరువాత వచ్చు కార్తీకశుద్ధ పౌర్ణమిరోజున సమాధిని వదలి వింధ్య పర్వతమునందు దివ్యమంగళ విగ్రహముగా ప్రకాశించి, అక్కడనుండే మహా పురుషులను వెంట తీసుకుని తిరిగి నందికొండ చేరేరు. ఆ కాలమునకు ఒక దాఖలా చెప్పేను వినుడు. అనేక నక్షత్రాలు భూమిపైన రాలేను, ఏడు గ్రామాలకు ఒక గ్రామమయ్యేను. అనేక పశువులు చనిపోయేను. ధూమకేతువనే నక్షత్రం పుట్టేను. చిన్న చిన్న పాలెగాళ్ళు నశించేరు ఎఱ్ఱబోయీలవల్ల వారి జీవన విధానాలకు కట్టు బడేరు. బదరికాశ్రమమందున్న పరపురుషులను వెంటతీసుకొని, వారి వారి మంత్రార్ధములు తెలిపి, నిజస్వరూపాన నందికొండయందు వీరప్రతాపం చేయించేను. విరోధినామ సంవత్సరాన లింగాలపాటిలో ఒక శక్తిని పుట్టించేను ఆ శక్తి 'అంకమ్మ' అను నామాన లోకమంతా ప్రకాశించి, చికాకులు పెట్టి దక్షిణాది అంతయూ, దగ్ధముచేసి తిరిగి నందికొండ వచ్చేను. ప్రమాదీచనామ సంవత్సరము వరకూ ఎనిమిదేండ్ల వాడనయి నేను వీర భోజయాచార్యుడనై వెలిగేను. పింగళనామ సంవత్సరములో ఉత్తరాన పోట్లాటలు ఆరంభమయ్యేను. కాలయుక్తినామ సంవత్సరాన ధూమకేతుబుట్టి నందికొండ మూలకు వచ్చి అదృశ్యమయ్యేను అక్కడ నుండి అనేక శక్తులుద్భవించి, ఊరూరా అనేకమందిని నశింపచేసేను. ఉత్తరదేశాన వారిలో వారికి అన్యోన్య కలహాల నశించిపోయేరు గొప్ప దేశములు, దేవాలయములు పాడయ్యేను పాంచాననము వారికి వృత్తులు నశించేను. సిద్ధార్థినామ సంవత్సరాన అద్దంకి సీమయందు భూమి వణికేను పర్వతాలు కూలేను రౌద్రినామ సంవత్సరాన ఆషాఢమాసమున, మహాధ్వనిచే నక్షత్రాలురాలేను అప్పుడు పర్వతగుహల యందు వుదకపానీయములు చేసేము బంగాళదేశమందు కాళి ప్రత్యక్షమై శక్తిరూపిణియై ప్రజారక్తము గటగటా త్రాగేను పశ్చిమాన

మాతంగి అనే శక్తి జనమెడలను విరచి రణోత్సాహాన కేకలు పెట్టేను. బెజవాడ గోలకొండ అంతా పట్నమయ్యేను కనకదుర్గగుడి ముఖద్వారాన తూర్పుదిక్కున ఏడుపుట్ల నల్లలు రాలేను. నక్షత్రాలు రాలేను. సూర్యుడు గడగడ వణికేను. అనేక ఉత్పాతాలు బుట్టేను. మేఘమందు అగ్ని సర్పాకారముగా వచ్చి అనేక ధ్వనులు చేసేను పిడుగులు పడేను అవి నందికొండ తటాకంలోనే పడేను. కొండవీటి సీమయందు దుర్గంలో మంటలు పుట్టేను. మాల రంగమ్మ అనే శక్తి కేకలు వేసేను.

శ్రీశైలాన నందిచెరువులో ఆరెదొండచెట్టు పుట్టేను భ్రమరాంబ గుడిలో మొసళ్ళు జొరబడటంతో గుడి పాడయిపోయేను ఈశాన్యమందు పాతాళగంగ క్రుంగి మల్లిఖార్జునుడు అదృశ్యమై పోయేను. పాతాళగంగయందు శాపానపడియున్న చంద్రగుప్తునకు కలికావతార పురుషుని పాదము సోకి. శాపవిముక్తుడయ్యేను ఆకాశాన విషగాలిపుట్టి, ఆ గాలివలన రోగాల జనులు నశించేరు. తిరుపతి వేంకటేశ్వరుని గుళ్ళో మొసళ్ళు ప్రవేశించి, మూడు రోజులు పూజలు లేక తలుపులు మూసి వుంచేరు. గరుడధ్వజమందు ఓంకార నాదాలు పుట్టేను. తిరువళ్ళువరు వీరరాఘవస్వామికి చెమటలు బుట్టేను. మేము వచ్చు కాలాన భూమియందు జలము అద్భుతముగా పుట్టేను. లోకమంతా తల్లడిల్లిపోయేను. అనేక ధూమ కేతువులు పుట్టేను మనువు అవతరించే వరకు ధూమకేతువులు ప్రకాశించి, తరువాత అదృశ్యమయ్యేను పాంచనమువారి వంశమందు నేను జనియించి. మల్లిఖార్జున వీరభోజయాచార్యుండనై మహాలక్ష్మితో రాజ్యము పరిపాలన చేసేను. ప్రమాదినామ సంవత్సరము నుండి, అన్ని దేశములుయందు క్షామం, అనావృష్టి కారణాన పంటలు పండకుండేను ప్రజలు వివిధ వ్యాధులచే పీడింపబడేరు. అనేక రకాలుగా దుఃఖించేరు.

ఆకాశాన మూడు నక్షత్రములుదయించి, కన్పించకుండానే అదృశ్యమయ్యేను. పాంచాననము వారు తిరిగి పంచాంగ, పౌరోహిత్యాదులు జేసేరు. ఆనందనామ సంవత్సరాన శ్రీశైలమల్లిఖార్జునుడు, ఉత్తరాన వింధ్యపర్వతాలకుపోయి, నిజరూపం చూపగా, ఆ రాజ్యం తల్లడిల్లి ప్రజలు కాకుల్లా విలపించేరు. కాబట్టి నా భక్తులకు ఒక మంత్రము చెప్పెదను ద్వాదశాక్షరీ మంత్రమును, అంగన్యాస, కరన్యాసములలో జపిస్తూ నన్ను నమ్ముకొన్న నా రక్షణలో వుండేరు. సర్వవర్ణములవారు ఈ మంత్రాన్ని స్త్రీ పురుష బాల వయోబేధములేక జపంచేయవచ్చును ప్రత్యేక నిష్టలు, ఆచారములు, మడి, మైల పాటించబనిలేదు. నాయందు విశ్వాసం, నమ్మకం, జపసమయాన శ్రద్ధ, భక్తి కలిగిన చాలు. యోగినీ శక్తులు

మిమ్మేమియూ చేయలేవు. సకల ఆపదలు నా ధర్శనాన తొలగేను. భక్తుల కుటుంబీకుల కోరిక వలన మరికొన్ని రహస్యంబులను తెలియజేసెను.

శ్రీ యనుమలకొండ శివరామమూర్తినై తిరిగి జన్మించేను. మరల స్వర్ణలో అమరలింగ స్వామిగా జన్మించేను. ఈ అవతారాన నందికొండయందు పరమహంస రూపాన వుండేను తరువాత వీరభోజుడనయి అవతారమెత్తేను. కృతయుగ ధర్మాల నిలిపేను.

పుత్రుల కోరిక మన్నించి వారికి వివరిస్తూ, గోవిందయాచార్యలవారికి పంచమహా వీరమాతలు జన్మించేరు. అందు ముందుగ జన్మించిన ఈశ్వరమ్మ మహాతల్లి. నా యంతటి శక్తివంతురాలు. యధావాక్కుల ఈశ్వరమ్మగా ప్రసిద్ధిపొందేను. ఆమె మాట తక్షణమే జరిగి తీరేను. ఆమె సోదరీమణులుగా, పార్వతమ్మ, శంకరమ్మ, గోవిందమ్మ, గిరిరాజమ్మ అను వీరమాతలుద్భవించేరు. నా మఠమున సూర్యచంద్రులున్నంత వరకు పూజలు జరుగును. మన వంశము నశించును. మన వీరనారాయణమ్మ గర్భమున ఉదయించువారలు నా మఠమునకు ధర్మకర్తలయ్యెదరు. నేను సమాధి అయిన తరువాత సిద్ధయ్య వలన మీరు నా మహత్యము తెలుసుకొనగలరు.

నేను వీరభోగవసంతరాయలుగా భూమిని పరిపాలించేందుకు వచ్చుసరికి దుష్ట శిక్షణ జరుగునను గుర్తుగా, మార్గశిరమాసాన దక్షిణదిక్కున తోకచుక్క పుట్టేను. క్రోధినామ సంవత్సరాన మార్గశిరశుద్ధ పంచమీ ఆదివారాన పునర్వసు నక్షత్రయుక్త కర్కాటక లగ్నాన నేను వచ్చుసరికే ఆ తోకచుక్కను జనం చూస్తారు దేశాన కొత్త కొత్త జాతులు పుట్టుకొచ్చేను. అన్ని కులాలవారు మధ్యపాన ప్రియులయ్యేరు.

కలియుగాన 5000 సంవత్సరాలు గడిచేదాక బ్రాహ్మణులకు గౌరవం వుండేను. అప్పటినుండి కాలక్రమేణ వారి గౌరవాలు, మర్యాదలు, మన్ననలు, ప్రఖ్యాతులు క్షీణించి పోతాయి. వితంతు వివాహాలు జరుగుతాయి. కులాంతర వివాహాలు ఎక్కువౌతాయి. ఆచారాలు తొలగిపోయిన విప్రులు తక్కువ కులాలవారి క్రిందసేవ చేస్తూ జీవించవలసిన పరిస్థితులను చూచెదము. విశ్వకర్మల వృత్తులు ఇతర కులస్థులకు దక్కుతాయి స్వర్ణశిల్పానికి అనేక బాధలు కలుగుతాయి. చీమంత బంగారం కూడా దొరకక అంతా సీమ చేరుతుంది. ఆభరణాలు చేయించుకునే వారు తగ్గుతారు. శిల్పులకు, కామందులకు మధ్య దళారీలు అధికమయి శిల్పులకు అతి స్వల్పంగా గిట్టుబాటు అవుతుంది. పెట్టుబడి శ్రీమంతులవంతయి. శిల్పులపై వారి పెత్తనం పెరుగుతుంది.

రాజులకు రాజ్యాలుండవు. వ్యవసాయవృత్తినే అవలంభిస్తారు. అన్ని జాతులవారు వింత వింత వస్త్రాలు ధరిస్తారు. బ్రాహ్మణులకు పీటలు, యితరులకు మంచాలు వస్తాయి. బ్రాహ్మణులు విదేశీ విద్యలు, విజ్ఞానానికి భూములను అమ్ముకుంటారు. ప్రభుత్వ బంట్లుగా ఉద్యోగాలుచేస్తూ బ్రతుకుతారు వానిలో కూడా బ్రాహ్మణులకు ఆధిక్యత లేకపోగా అన్య కులాలవారే ఆధిక్యతపొంది వారిక్రింద పనిచేస్తారు జీవనోపాధికోసం ఏ వృత్తినయినాచేసే స్థితికి వస్తారు పౌరోహిత్యం కూడా కొనసాగక బ్రాహ్మలు బాధలు పడతారు. దేవబ్రాహ్మణులు పౌరహిత్యం బాగా కొనసాగుతుంది. వారు కూడా ప్రభుత్వ ఉద్యోగాలు పొందుతారు విదేశీ విజ్ఞానం విద్యలు నేర్చు కుంటారు ఉద్యోగాలలో వ్యాపారాలలో ఉన్నత స్థితికి చేరుకుంటారు.

ఫాల్గుణమాసంలో నేను నాలుగు మూరల ఖడ్గాన్ని ధరించి వీరభోగ వసంత రాయలునై శ్రీశైలంవెళ్ళి అక్కడి ధనాన్ని బీదలకు పంచి యిస్తాను. తరువాత కేదారంలో కఠినమైన తపమాచరించి, శ్రీరామచంద్రమూర్తి నుండి మూడు వరాలు పొంది, విక్రమనామ సంవత్సరం చైత్రశుద్ధ దశమి బుధవారం రోజున బెజవాడ ఇంద్రకీలాద్రికి వచ్చి అచ్చటి ఋషి పుంగవులను దర్శించి, తరువాత కార్తవీర్యార్జున దత్తాత్రేయులవారి వద్ద పలువిద్యలనభ్యసించి, ఆది దత్తాత్రేయుల వారిని దర్శించి, అచటినుండి మహానందికి పోయి రెండునెలలున్న తరువాత శ్రావణ శుద్ధపౌర్ణమి, శ్రవణా నక్షత్రయుక్త కుంభలగ్నాన వీరనారాయణపురం చేరతాను. అక్కడ పదునైదు దినములు గడుపుతాను.

కలియుగాన 3040 సంవత్సరాలు గడచిపోయేటప్పటికి పుణ్యతీర్థాలు మెల్ల మెల్లగా తమ పవిత్రతను కోల్పోవటం జరుగుతుంది. గంగానది లేకుండా పోతుంది. సోదిముక్కుల వారు సామ్రాజ్యాలు పాలిస్తారు. కచ్చేర్లకోట బెల్లపిళ్ళరాయుడు ప్రజలతో మాట్లాడతాడు. కృష్ణావతారం, విష్ణు అవతారాలు వచ్చినపుడు నా రూపాన్ని కలి యుగంలో చూపించగలను. ప్రపంచాన ధనమే అన్నిటికీ మూలమౌతుంది. పాతాళ గంగలో నీరు యింకిపోయెను నూట యిరువై తిరుపతులు నీటిపాలయిపోతాయి. నాలుగు సముద్రాలమధ్యనున్న ధనమంతా శ్రీశైలం చేరుకుంటుంది దేశంలో పంటలు ప్రజ్వరిల్లును.

నేను వస్తున్నాను కనుక ధనమధాంధులు అంతా నశిస్తారు. సముద్రాలు కలుషితమయి పోతాయి. జలజంతువులు ఎక్కడివక్కడే నశించిపోతాయి. బంగారు గనులకోసం కొండలను త్రవ్వుతారు. కొండప్రాంతల బ్రతికేందుకే ప్రజలు మక్కువ జూపిస్తారు. కాశీనగరంలో పోట్లాటలు సంభవిస్తాయి. వర్ణాంతర వివాహాలు మతాంతర వివాహాలు ఎక్కువ అవుతాయి మితిమీరిపోతాయి. కుటుంబమందు సామరస్యత వుండదు. వావివరుసలు వల్లకాట కలుస్తాయి.

జుట్టేటి ఒడ్డున సృష్టిమొత్తం తెలిసిన యోగులు పుడతారు. యాగంటేశ్వరుడు భక్తులందరినీ కాపాడుతాడు. రెంటాల్ చెరువుక్రింద ఆపదలు పుట్టేను. వినాయకుడు వలవల ఏడుస్తాడు. నా మాటలు నమ్మినవారికి సర్వసుఖసౌఖ్యాలు కలుగును. గండికోటలో ముండలవారు కర్నూలు చేరగలరు. గోలుకొండక్రింద బాలలు పట్నాలు ఏలుతారు. శృంగేరి, పుష్పగిరి పీఠాలు పంచాననంవారి పరమవుతాయి ఆకాశవాణి, అన్నపూర్ణాదేవి, పాదిలినిమ్మవ్వ, విజయవాడ కనకదుర్గమ్మకు మంగళహారతులు పాడుతారు కాశీదేశంలో వెనుకముఖాల వారు వస్తారు. హరిద్వారాన మఱ్ఱిచెట్టుమీద మహిమలు పుడతాయి. హరిద్వారానికి పోవుదారి మూసుకుని పోతుంది. అహోబిలంలోని ఉక్కుస్థంభం కొమ్మలు రెమ్మలతో, జాజిపూలు పూస్తుంది. నా రాకకు గుర్తుగా స్త్రీలు అధికారాన్ని అందుకుంటారు వృత్తియందు ఎక్కువ తక్కువలు అంటూ లేక అందరూ సమానమౌతారు. నేను వచ్చుటకు ముందు యిటువంటి విచిత్రాలు అనేకం జరుగుతాయి.

# సమాధినుండి తిరిగి సిద్ధయ్యకు దర్శనమిచ్చుట

నవమినాటి రాత్రికి సిద్ధయ్యను బనగానపల్లెకు పంపి పుష్పములు తెప్పించమని గోవిందమాంబగారికి చెప్పి స్వామివారు శయనించిరి. ఈ విషయము సిద్ధయ్యగారు తెలిసికొని స్వామివారు నిద్రించుచున్నారని తెలిసి వెంటనే బయలుదేరి బనగానపల్లెకు వెళ్ళిరి. సిద్ధయ్య తిరగివచ్చుసరికే స్వామివారు సమాధియందు ప్రవేశించుట జరిగి పోయినది. అది తెలుసుకొనిన సిద్ధయ్య పరిపరివిధములుగా చింతించి ప్రాణత్యాగము చేయుటకు సిద్ధయ్యగారు సిద్ధపడగా, సమాధి నుండి అది గ్రహించిన శ్రీ బ్రహ్మంగారు సిద్ధయ్యను పిలిచి, సమాధిపైనున్న బండను తొలగించమని చెప్పి పైకి వచ్చి సిద్ధయ్యకు దర్శనమిచ్చి సిద్ధయ్యగారి కోరిక మీదట "పరిపూర్ణమును" బోధించిరి

బ్రహ్మంగారి వ్యక్తిత్వం గురించి చెప్పాలంటే, చాలాగొప్పది. శాంతస్వభావులు, సహనం ఆయన్న భూషణం. ఒక విషయాన్ని పూర్తిగా వివరించి చెప్పి, మంచి విషయాలను జనులకు బోధించాలనే వారి తత్వం ఎదుటివారిని ఏ విధంగానూ, మనసు నొప్పించకుండా చెప్పడం. ఏ పనినయినా చేయడం వారి వ్యక్తిత్వానికి ఒక గీటురాయి.

వీరి జన్మసమయాన్ని గురించి, వివిధములైన అభిప్రాయములున్నవి. శ్రీ బ్రహ్మంగారి కాలజ్ఞానం ప్రకారం వారి జీవితకాలం 189 సంవత్సరములుగా తెలియును. 14 సంవత్సరముల వయస్సులో కాలజ్ఞానాన్ని వ్రాయడం ప్రారంభించి మూడు సంవత్సరాలలో పూర్తి చేశారు కాలజ్ఞానాన్ని ప్రచారంచేస్తూ, వివధ ప్రాంతాల్ని తిరగిన కాలం 175 సంవత్సరాలుగా తెలియవచ్చును. కాలజ్ఞానంలో చెప్పిన అనేక విషయాలు జరిగాయని అందరూ ఒప్పుకున్న విషయమే ఇకా చెప్పినవన్నీ తప్పక జరుగుతాయనే నమ్మకం కూడా .. సుమారుగా 6000 సంవత్సరాలకు ముందుగానే భవిష్యత్‌ను వివరించిన అపరబ్రహ్మ అనటంలో ఏ మాత్రం అతిశయోక్తి వుండదేమో. అంతటి మహావ్యక్తి కారణజన్ముడు 189 సంవత్సరాలు జీవించారంటే అతిశయోక్తి కాదు.

శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామి వారు కీలకనామ సంత్సరం అంటే క్రీ శ. 1608 సంవత్సరం అని నిర్ణయింపబడినది ఆయన 1693లో సమాధిగతులయినారని కూడా నిర్ణయించారు అపుడు వారి జీవించిన సమయం 85 సంవత్సరాలు మాత్రమే అవుతాయి. కానీ యిది శ్రీ బ్రహ్మంగారు తన సమాధినిష్టకు ముందుగా చేసిన కాలజ్ఞాన బోధలో తానిప్పటికి 175 సంవత్సరాలుగా కందిమల్లాయపల్లెలో వున్నానని చెప్పడం జరిగింది క్రీ శ. 1608 సంవత్సరమున స్వామివారు జన్మిచినట్లయినచో, మన దేశమునకు ఈస్టిండియా కంపెనీవారు వచ్చినది 1600 సంవత్సరములో అంటే అప్పటికి వారు జన్మించలేదు. బ్రిటీష్ వారు వచ్చిన 8 సంవత్సరములకు జన్మించారని తెలియవచ్చును. ఆ సమయాన మొఘల్ రాజులు భారతదేశాన్ని పాలిస్తున్నారు బ్రహ్మంగారు ఎఱ్ఱబోయీలు, శ్వేతముఖులు వస్తారు అని వారి కాలజ్ఞానంలో చెప్పినది మనకు తెలును. క్రీ శ. 1693 వరకు ఆయన జీవించివుంటే, వారు చెప్పినవి కాలజ్ఞానం, భవిష్య విషయాలు కాజాలవు గదా! అవన్నియూ సమకాలీన పరిస్థితులు గానే పరిగణించాలి పైగా ఆ కాలమున పాలించన మొగలాయి చక్రవర్తుల కనీస ప్రస్తావన కూడా లేదు కదా! వారు చెప్పిన కాలజ్ఞానంలోని విషయాలు

చాలావరకు 128వ శతాబ్దం ఆఖరునుండి జరగుతున్న వింతలను తెలియజేస్తున్నాయని అర్థమౌతుంది వారి భవిష్య దర్శినిలో వింతలు, ఉత్పాతాలు, వరదలు, గ్రహణాలు, తోకచుక్కలు, సాంఘీకపరమైన మార్పులు, సామాజిక మార్పులు, కులతత్వాలు మతబేధాలు యివన్నీ 19వ శతాబ్దానికి ఎక్కువగా అన్వయించుకోవలసి వస్తున్నాయి ఇవన్నీ దృష్టిలో వుంచుకుంటే ఆయనయొక్క మహోన్వితతత్వాన్ని, ఆయన కారణ జన్ముడని అంగీకరించేక తప్పదు.

ఆయన జీవితకాలం 189 సంవత్సరాలుగా నిర్ణయించుకుంటే, ఆయన జీవసమాధిని పొందినది క్రీ.శ. 1693లో అని నిర్ణయానికొస్తే వారి జననం క్రీ.శ.1503 సంవత్సరము అని గ్రహించవచ్చు. కొందరి లెక్కలప్రకారం వారు 125 నంవత్సరాలు జీవించారని అంటున్నప్పుడు వారు 1568లో జన్మించినారని తెలియాలి వీరి జననం గురించి పలువురు పలు అభిప్రాయాల్లో ఉన్నారు. అయినా వారు పుట్టినది శ్రీముఖనామ సంవత్సరం వైశాఖ బహుళదశమి గురువారం అని చెప్పబడింది కనుక శ్రీ ముఖనామసంవత్సరమనేది ప్రతి అరవై సంవత్సరాలకు ఒకసారి వస్తుంది కనుక, లెక్కకట్టడం జ్యోతిషశాస్త్రవేత్తలకు సులువే కదా? పైగా జ్యోతిష్యంలోని కొన్ని యోగాలలో, పితృమరణయోగం, మాతృమరణ యోగం లాంటివాటిని అనుసరించి, ఆ రోజున గ్రహస్థితి ననుసరించి గణన చేయలేరా? ఇవన్నీ అప్రస్తుతమనుకోవచ్చు. ఇప్పటివరకు ఎక్కువగా నమ్ముతున్న శ్రీస్వామివారి జనన సంవత్సరం క్రీ.శ 1503 అనీ, సమాధిగతులైనది 1693 అని నిర్ణయం

తెల్లవారు, బ్రిటిష్, ఫ్రెంచ్ దేశస్థులు మొదలైన విదేశీయులు మన భారతదేశంలో అడుగుపెట్టడానికి 97 సంవత్సరాల పూర్వమే బ్రహ్మంగారు జన్మించారు. దీనినిబట్టి వారు వ్రాసిన గ్రంథమంతా భవిష్య గ్రంథమేనని, కాలజ్ఞానబోధ నిజంగా భవిష్యత్‌ను తెలియజేసేదిగా వుందని తెలియవచ్చును బ్రహ్మంగారు వారు కాలజ్ఞానాన్ని వ్రాసిన తరువాత నుంచీ ప్రజలకు ముందుగా జరగబోయే ఉత్పాతాలను, పరిస్థితులను వివరించారు. వివరిస్తూ తనను ఆశ్రయించిన వారికి ఏ కష్టములూ అంటవని చెప్పారు. ఈ విషయంగా ఎవరినీ, నిర్బంధపెట్టినట్లుకానీ, ఆకర్షించడానికి ప్రయత్నించినట్లుగానీ కనిపించదు కేవలం బ్రహ్మజ్ఞాన బోధన, మంచి ప్రవర్తనులై మెలగమని చెప్పడం, అవసరమైనపుడు మాత్రమే తన మహిమలు ప్రదర్శించడం వరకే పరిమితం చేశారు

మొట్టమొదటిసారిగా, బనగానపల్లెలో అచ్చమ్మగారి గోవుల పాలించుచూ, రవ్వల కొండ గుహలో కాలజ్ఞాన రచనను రహస్యంగా కొనసాగిస్తున్న దశలో, అచ్చమ్మగారు,

ఆమె భర్తచూసి ప్రశ్నించినా, ఏకాంత భంగమయినందులకూ, రహస్య లేఖనం బయల్పడినందుకు ఏ విధమైన కోపమూ తెచ్చుకోలేదు. పైగా వారి కోరికపై మొట్టమొదటిసారిగా కాలజ్ఞానాన్ని బోధించారు కూడా. అంత సాధు స్వభావులు శ్రీ స్వామివారు

11 సంవత్సరాల వయస్సునందే తల్లికి పిండోత్పత్తి, శిశుజనన విధానం తెలియజెప్పి తారక బోధించి, ఆమె మాతృప్రేమనుండి బయటపడి యిల్లు వదలిరావడం ఆయన శాస్త్రపరిజ్ఞానాన్ని, ఓర్పు నేర్పును తెలియజేయుట లేదా?

బనగానపల్లె నవాబు వారిని పరీక్షించుటకో లేక మతభ్రష్టత చేసి, ఇస్లాం మతంలో చేర్చుకోవటానికో గోమాంసంపెట్టినా, ఓర్పుతో అన్నీ సహించి సంయమనం పాటించి కాలజ్ఞానమును బోధించి, తనయందు భక్తి కలిగేటట్లు, నవాబు అమాయకత్వాన్ని క్షమించగలిగిన క్షమా స్వభావులు వారు

వారు ఆర్ష ధర్మములను ఎంతగా అవలంభించినా, కులమతాతీతులుగా, ప్రవర్తించారే తప్ప ఏనాడు కులాభిమానమును గానీ, మత ద్వేషమును గానీ దరి చేరనీయలేదు.

దూదేకుల కులస్థుడైన సైదులును తన ముఖ్య శిష్యునిగా గ్రహించి, తారకం బోధించి, అనేక విషయాలను, శాస్త్రరహస్యాలను అతనికే కట్టబెట్టుట జరిగింది. తుదకు సమాధిగతులైన తరువాత కూడా అతనికే దర్శనమిచ్చి దండకమండల పాదుకలు, ముద్రికను గూడా అతనికే ప్రసాదించారు చివరకు తమ పుత్రులకు కూడా యివ్వని ప్రాముఖ్యత ఆ దూదేకుల కులస్థునికిచ్చినటువంటి సర్వమత సామరస్యులు శ్రీస్వామి ఉత్తమోత్తములు. సైదులును సిద్ధునిగామార్చి "సిద్ధా" అనే మకుటంతో అనేక పద్యాలు చెప్పినవారు అటులనే కడప, బనగానపల్లె, హైదరాబాదు, కర్నూలు నవాబులకు కాలజ్ఞానబోధచేసి, వారిని శిష్యులుగా స్వీకరించారు.

పుష్పగిరి బ్రాహ్మణులతో వాదించి, వారికి నచ్చజెప్పి బ్రాహ్మణులు, దేవ బ్రాహ్మణుల యొక్క బాంధవ్యాన్ని తెలియజెప్పి అగ్రవర్ణము వారనే వారి అహంకారాన్ని తొలగించి, కులవ్యవస్థ పరిణామాలను తెలియజెప్పి అహంకారంకన్నా, ఆదరణ గొప్పదని, వారితో సయోధ్య నెరపిన మహాజ్ఞానసంపన్నులు శ్రీ బ్రహ్మంగారు.

కనీసం తన మఠంలో దొంగతనానికి వచ్చిన చోరులను కూడా క్షమించి, తన మహిమను ప్రదర్శించి, వారిని సంస్కారులుగా తీర్చిదిద్ది, వారికి తగిన వృత్తులను కల్పించి వారిని మనుష్యులను చేసిన మహాసంస్కర్త శ్రీ స్వామివారిలో కన్పిస్తారు కందిమల్లయ్యపల్లె చేరిన

తర్వాత అక్కడ జరిగే జీవహింసను మాన్పించడంకోసం పోలేరమ్మ వారిచేత వైరాల మూకుడు తెప్పించి చుట్టకు నిప్పు యిప్పించుట అనేది తన మహిమను ప్రదర్శించడానికి కాదు తనయందు నమ్మకం కలిగి తన మాట మీద జంతు బలులను నిషేదింపజేయవచ్చునను ఒక సదుద్దేశ్యమేకదా. 'అహింసా పరమోధర్మః' అను దానిమీద నమ్మకమున్న సంఘసంస్కర్త వారిలో కన్పిస్తారు.

సిద్ధి పొందడానికి రాజయోగం కూడా అర్హమేనని, బ్రహ్మచర్యము మాత్రమే తరుణోపాయం కాదని, సంసారజీవితాన్ని గడపుతూ సర్వసిద్ధులు పొందవచ్చునని, కైవల్యాన్ని పొందవచ్చునని తన జీవితమే యిందుకు తార్కాణమని, తన శిష్యుడయిన సిద్ధయ్యను కూడా రాజయోగిగా జీవించి, సాధించమని ఆశీస్సులొసగిన యోగి పుంగవులు శ్రీవీరబ్రహ్మేంద్రస్వామివారు.

బనగానపల్లెలో గోపాలునిగా పనిచేయడం, కాలజ్ఞానాన్ని రచించినా, తన కుల వృత్తియైన వడ్రంగం, శిల్పిగా, దారువిగ్రహ శిల్పిగా, కష్టించి పనిచేసి జీవితాన్ని గడిపిన శ్రమ ఫలితాన్ని తెలిసిన మహావ్యక్తి. శిల్పిల్లాడపల్లిలో వారు చెక్కిన పోలేరమ్మ విగ్రహం ఈనాటికీ పూజలందుకోవడం మనం గమనించవచ్చు. కాలజ్ఞానాన్ని రాశాననే గర్వంకానీ, ఆధిక్యతకానీ లేక శ్రమయొక్క ఔన్నత్యాన్ని తెలియజేసిన అత్యుత్తమ తత్వజ్ఞానులు ఇలా శ్రీ స్వామివారి యొక్క ఔన్నత్యాన్ని, వ్యక్తిత్వాన్ని గ్రహించగలము

ఇప్పుడు స్వామివారి యొక్క విశిష్టత గూర్చి కొంత తెల్సుకొనుట మంచిదే కదా?

అత్రిమహాముని వీరప్పయ్యవారిని శ్రీయనమదల వీరభోజ్యాచార్యుల వారికి దత్తతనిస్తూ చెప్పిన మాటలు ఒకసారి మననం చేసుకుంటే శ్రీ స్వామివారి పవిత్రత స్ఫురిస్తుంది బ్రహ్మంగారికి దేవసర్పం పడగవిప్పి నీడనిస్తుందని, ఆ బిడ్డనీడ నేలపై పడదని చెప్పినారు. ఎండలోకానీ వెలుగులోకానీ, జంగమ, స్థావరములకు నీడపడటం సృష్టి సహజమే కదా! మరి శ్రీ స్వామివారికి ఆ విధంగా నీడపడదని తెలిస్తే వారు దైవస్వరూపులనే కదా అర్థం. వారు జన్మతః సిద్ధులని తెలియుట లేదా?

అతి చిన్న వయస్సులోనే తల్లికి పిండోత్పత్తి శిశుజననం, తారక మంత్రోపదేశమును తెలియజెప్పి విశ్వరూప సందర్శన చేయించడమనునది సామాన్య మానవులకు అసాధ్యమని అందరూ ఎఱిగిన సత్యమే దైవాంశసంభూతుడు, కారణజన్ముడు, అవతార మూర్తి అయిన శ్రీ స్వామివారికి మాత్రమే అది సాధ్యమయింది. ఈ విధమైన ఉపదేశాలు, విశ్వరూప సందర్శనము ద్వాపరమందు శ్రీ కృష్ణభగవానుడు చేసి చూపగలిగారు. ఇప్పుడు కలియుగంలో శ్రీ వీరబ్రహ్మంగారు మాత్రమే అనేది సత్యము

కాలజ్ఞాన రచన విషయమై తాళపత్రాలు బ్రహ్మంగారికి ప్రకృతి స్వయంగా ప్రసాదించినది అనే చెప్పాలి లేకుంటే వారు వచ్చుసరికి తాడిచెట్టు వంగి వుండి, పత్రములు తీసుకోగానే మరల యధారూపానికి వచ్చుట అనునది నిజంగా ఒక మహత్తుగదా! అది వారికి ఆత్మనిశ్చలత, ప్రకృతిపైగల ఆధిపత్యాన్ని మనకు కళ్ళకు కట్టినట్లు తెలియజేయుచున్నవి అటులనే గుంభ్రటి గిరిగీసి ఆలమందలను బయటకు పోకుండా చేయగలగడం, మేత గిరిలో లేకుండానే అవి పూర్తిగా కడుపులు నింపుకొని, పాలు యివ్వగలగటం యివన్నీ సిద్ధులు మాత్రమే నిర్వహించగల పనులు ఆ గిరిని దాటి లోనికి పోగల సామర్థ్యం ఎవరికీ లేకుండుట ఆయన శక్తికి నిదర్శనం

అచ్చమ్మగారి ప్రార్థన విని పుట్టంధుడయిన ఆమె కుమారుడు బ్రహ్మానందరెడ్డికి భూతకాల విషయాన్ని పూర్వజన్మలో భార్య కళ్ళుపొడిచినందున జాత్యంధుడయిన విషయం తెలియజేసి తన స్పర్శమాత్రమున దృష్టినివ్వగలిగిన మహత్తు గలిగినవారు. ఈ విషయము తెలిసి బనగానపల్లె నవాబు బ్రహ్మంగారి శిష్యరికం చేశారు గోమాంసం పెట్టి పరీక్షించినది కూడా ఈ నవాబుగారే నవాబు అమాయకత్వమును క్షమించి శిష్యునిగా చేసుకున్నారు.

కందిమల్లయ్య పల్లెలో పోలేరమ్మకు జంతుబలులు గూర్చి ఆందోళనచెంది, అవి మాన్పించడంకోసం, అమ్మవారిచేతనే మునసబుగారి చుట్టకు నిప్పు తెప్పించి, జనాలకు విశ్వాసం కల్పించి, బలుల వలన నష్టాలను వివరించి, ఆరోగ్యసూత్రాలను పాటించాల్సిన ఆవశ్యకత తెలియజేసి, భక్తి ఎట్లుండునో, వారు చేయునవి మూఢభక్తితో కూడుకున్నవని సోదాహరణముగా తెలియజెప్పి, అహింసను ప్రజల మనస్సుల్లో నాటుకునేటట్లు చేసిన యోగి పుంగవుడు.

పెద్దకొమర్లలో రెడ్డిగారి శవాన్నిచూచి రెడ్డిగారు బ్రతికి వున్నారని తెలియజెప్పి, పాడెమీదనున్న రెడ్డి బ్రమను తొలగించుకోమని చెప్పి స్పర్శ మాత్రాన్నప్రాణాలు తెప్పించిన స్వామివారి మహిమ, అపరబ్రహ్మ కదా? అనిపించుటలేదా? అదే పెద్దకొమర్లలో తనను ఎగతాళి చేయబోయిన కుర్రవాళ్ళకు గుణపారం నేర్పించలేదా! ఒకనిని పాడెపై పరుండబెట్టి చనిపోయినట్లు నటింపచేయగా; సంకల్పమాత్రముచేతనే అతనిని మరణించినట్లు చూపి, తిరిగి పశ్చాత్తాపపడిన వారియందు దయగలిగి పునరుజ్జీవింప చేసిన మహాశక్తిశాలి. వారి ఆధిపత్యం మాటలకందనిది మనుష్యులెరగలేనిది

తనకు కుమార్తెనీయుటకు అనుమానిస్తున్న శివకోటయాచార్యుల వారికి, వారి భార్యకు సోదెకత్తెరూపాన మంచీ చెడులను తెలియపరచి, ఈ వివాహం జరుగునట్లు పరిస్థితులను సానుకూలపరచుకోవడం వీరి యుక్తిని తెలియజేస్తుంది. వారి సంకల్ప బలం ఎంత గొప్పదో కూడా ఋజువవుతుంది. గోవిందమ్మగారి కలలో కన్పించటం, ఆమెను సమ్మోహన పరచడం, వారినితప్ప వేరొకరిని వివాహమాడబోనని చెప్పడం శ్రీ బ్రహ్మంగారి శృంగార తత్వానికి ఒక ఉదాహరణ.

శివకోటయాచార్యుల్వారు తమ సహపంక్తిన భోజనమునూ స్వామివారిని ఆహ్వానించడం, స్వామివారు తాను తెచ్చుకున్న రాగిసంకటినే వడ్డించమని స్వామివారు కోటయాచార్యులవారి సహధర్మచారిని కోరారు ఆ రాగిసంకటే వేడి పంచభక్షములుగా మారడం. ఆయన మహిమకు ఆ దంపతులు వారిని కీర్తించడం వారి విచిత్రాల్లో ఒక చిత్రం.

మానవదేహం గురించి సిద్ధయ్య గారికి వివరిస్తునపుడు షట్చక్రాలు, వాటియొక్క అధిదేవతలను గూర్చి చెప్పుసమయాన మాదిగ కక్కయ్య విని తన భార్యను ముక్కలుగా చేసి చక్రాలుగానీ, దేవతలుగానీ కనబడక, బ్రహ్మంగారు చెప్పినవన్నీ తప్పని, అనవసరంగా భార్యను చంపుకున్నాని కోపంతో బ్రహ్మంగారి మీదకే కత్తిదూసిన ఒక అమాయక భక్తునికి దివ్యత్వాన్నిచ్చి, మానవదేహంలో చక్రాలెలా వుంటాయో, చూపించి వారి జీవితాల్ని ధన్యం చేసిన బ్రహ్మంగారు ఎంతటి మహాత్ములో కదా.

శిష్యబృందంతో సంచారంచేస్తూ నంద్యాలలో మధ్యాహ్నసమయానికి దాహమయి ఒక విశ్వబ్రాహ్మణుని యింటికి వెళ్ళగా, సాయిబు కులస్థులను చేర్చుకుని కులాన్ని కూలద్రోసిన నీకు సాటికులస్థులను నీరు కూడా యివ్వరు అంటూ కొలిమిలో కరుగుతున్న లోహద్రవమున్న మూసనుతీసి యివ్వగా, చిరునవ్వుతో ఆ ద్రవాన్ని చల్లని నీళ్ళవలె త్రాగిన శక్తివంతులు. అప్పటికి గాని నంద్యాల విశ్వబ్రాహ్మణులలో చలనము కలిగి స్వామి శక్తి సామర్థ్యములను గ్రహించి, కాలజ్ఞాన బోధకోసం తహతహలాడే స్థితికి వచ్చినవారు.

నంద్యాలనుండి అహోబిలం వెళుతూ మార్గమధ్యమున ఒక చెట్టుపైనున్న బ్రహ్మరాక్షసిని సిద్ధయ్యగారి వలన పట్టుకుని క్రిందికి దించి స్వామివారి పాదాలపై పడవేయగా స్వామివారు ఆ రాక్షసిని మందలించి ఈ విధేముగా ప్రజలను భయ పెడుతూ బ్రతుకు సాగించుట మంచిదికాదు జనం నీ వలన అనవసరంగా బాధలు పొందుతున్నారు. కాబట్టి శిలవు కమ్మని శపించి, మరల రాక్షసి ప్రార్థించడంవలన తన మనుమరాలు ఈశ్వరమ్మ ఈ దారిన వచ్చును అపుడు నీకు శాపము తీరిపోతుందని భవిష్యత్ సూచించిన భవిష్యకర్త.

కడపనవాబు శ్రీ స్వామివారి మహిమలు విని నమ్మికూడా పరీక్షించదలచుట ఒక విశేషమే కదా! సగౌరవంగా తమ మహాలుకు ఆహ్వానించి, చూడితోవున్న అశ్వాన్ని చూపించి స్వామీ ఈ గుఱ్ఱము కడుపునందువున్న పిల్లయొక్క లింగబేధమేదియో తెలియజేయ మనగా, గుఱ్ఱపు పిల్లయొక్క రూపురేఖలు వర్ణించి, నవాబుగారి మనసు నందున్న పూర్తి కోరిక ఇదియే కాదని గ్రహించి ఒక తెరతెప్పించి గుఱ్ఱము కడుపునందలి పిల్లను బయటకుతీసి, నవాబునందు, సభయందున్న వారందరకు చూపించి, తాను వర్ణించిన వర్ణనకు సరి పోయినదని చెప్పిన తరువాత మరల తెరలోనికివెళ్ళి గుఱ్ఱపు పిల్లను తల్లి కడుపునందు వుంచినారట. అంతలో ఆ గుఱ్ఱం ప్రాణంపోసుకుని నకిలించటం, ఈ మహత్తునకు ఆశ్చర్యపడిన నవాబుగారు బ్రహ్మంగారికి పాదాభి వందనంచేసి, ఆయన శిష్యుడుగా మారి పోయారు. స్వామివారి ద్వారా కాలజ్ఞానం బోధ చేయించుకుని కందిమల్లయ్యపల్లె యందలి బ్రహ్మంగారి మఠమునకు 14 ఎకరాల మాగాణి భూమిని మాన్యంగా యివ్వటం నిజంగా స్వామివారి ఉన్నతిని గమనించియే కదా!

తిరుపతి నుండి కడపప్రయాణ సమయములోనే గర్విష్టులైన తన శిష్యులకు గర్వభంగం చేయించి ఒక గుణపాఠం నేర్పాలనే తలంపుతో, దారిలో తన మహిమచే కుళ్ళిపోయి పురుగులు పట్టిన ఒక కుక్క కళేబరాన్ని సృష్టించారు. అతి జుగుప్సాకరంగా, దుర్వాసనతోవున్న ఆ శవాన్ని తినవలెనని తన శిష్యులను కోరగా, శిష్యులందరూ దూరంగా, అసహ్యంతో తొలగిపోగా, గురువుగారి ఆజ్ఞ పాటించే సిద్ధయ్యగారు మాత్రం, బ్రహ్మంగారి పాదాలకు నమస్కరించి మనస్సున గురువుగారిని తలచుకుని, ఆ శునక కళేబరాన్ని మొత్తంగా తిని వేశారట అపుడు స్వామివారు గురుభక్తికి ప్రతిరూపం సిద్దయ్య అని శిష్యవాత్సల్యంతో శిరస్సు నిమిరి, ఆయన్ని కొనియాడి, మిగిలిన శిష్యులకు ఒక గుణపాఠం నేర్పారు

అదే మార్గమున ఒక వృక్షము నీడన శిష్యసమేతులై విశ్రాంతి తీసుకుంటూ, సిద్దయ్య అడిగిన సందేహాలకు సమాధానమిస్తూ ఆధ్యాత్మికపరమైన విషయాలోచనలో నున్న సమయాన, కుష్టురోగియైన ఒక బ్రాహ్మణుడు తన భార్య ఒడియందు పవళించి, తన దీనస్థితికి చింతించుచూ, కుమిలి ఏడ్చుచున్న దృశ్యం వారికంటపడి, శిష్య సమేతంగా, ఆ దంపతుల వద్దకుచేరి, వారికి కొన్ని ఫలములుయిచ్చి, అవి భుజించగా, విషయమును గ్రహించి, ఈ భార్యాభర్తలిరువురూ రోగమును గూర్చి చింతించు చున్నారని తెలిసికొని దయాళులై ఆ బ్రాహ్మణుని శరీరాన్ని వారు తడిమినంతనే వ్యాధి మాయమై మామూలు రూపం కలుగుటవలన ఆ దంపతుల్లు, స్వామివారి పాదాలపైబడి నమస్కరించి, శెలవు

సుకుని వారి గ్రామమైన పుష్పగిరికి వెళ్ళినారు. ఇది స్వామివారి అతి చిత్రమైన మహత్తు కాదా?

స్వామివారి సంచారసమయాన పుష్పగిరి వెళ్ళిన సమయాన పీఠముమీదుగా బండిపై పాదుకలు ధరించి వెళ్ళరాదని పుష్పగిరి బ్రాహ్మణులు స్వామివారిని అవమానించగా, స్వామి పైరాళ్ళు విసరగా, ఆయన కోపించి, బండి దిగి, గ్రామము వైపునకు అగ్రహార భాగమును తీక్షణంగాచూడగా, ఆ ప్రాంతంమొత్తం అగ్నిజ్వాలలు వ్యాపించినవట బ్రాహ్మణులు భయపడి, ఏమీతోచని పరిస్థితియందు కొట్టుమిట్టాడు చుండగా, ఇంతకు ముందు స్వామివారివలన కుష్టువ్యాధి నివారించబడిన బ్రాహ్మణుడు సతీసమేతంగా వచ్చి, స్వామిని ప్రసన్నునిగా చేసుకొని కరుణించమని ప్రార్థించగా, ఆయన మంటలవైపు చేయి చూపగానే మంటలు ఆరిపోయి చల్లబడి పోయినదట. ఆయన మహత్యానికి ఆశ్చర్యపోయి, బ్రాహ్మణ సమాజంవారు, తన కుష్టువ్యాధి నివారించినది ఈ స్వామివారే అని ఆ బ్రాహ్మణుడు తెలుపగా, బ్రాహ్మణులు అందరూ తమ తప్పు క్షమించమని, స్వామివారికి భక్తితో నమస్కరించడం జరిగి, స్వామివారి వలన కాలజ్ఞానం వినడం, పుష్పగిరివారు స్వామికి బ్రహ్మరథంపట్టి తమ ఊరియందు ఊరేగించుట అతిపెద్దచిత్రం కాదా!

స్వామివారికి కడప నవాబుగారులాంటి శిష్యులు యిచ్చిన విలువయిన బహుమతులు, వెండి, బంగారు వస్తువులు మఠంలో వుండటం తెల్సుకున్న దొంగల ముఠా, మఠంలో ప్రవేశించారు కానీ, అక్కడ ఒక్క వస్తువును కూడా తాకలేకపోయారట, ఎంత ప్రయత్నించినా, కాళ్ళు చేతులు కదిలించడానికి కూడా అశక్తులై తెల్లవారు వరకూ, అటులనే వుండిపోయారట. బ్రహ్మంగారు సంధ్యాసమయానికివచ్చి వారిని చూచి వారి చేతులు కదల్చి తలలు దించుకునేట్టు చేశారట గ్రామస్థులద్వారా వారికి జీవనోపాధిని కల్పించి, ఎప్పుడూ దొంగతనాలకు పోవద్దని నీతిబోధచేసి, దొంగలలో మార్పుతేవడం బ్రహ్మంగారు ఔదార్యాన్ని చాటుతుంది.

బ్రహ్మంగారి సతీమణి గోవిందమ్మగారు గ్రామంలో అందరూ పోలేరమ్మకి చల్ది పెడుతున్నారని తెల్సుకొని, అంటువ్యాధులు కలగకుండా, పిల్లలున్న యిల్లాళ్ళు చేయు మంచిపని అని తలచి, భర్తకు తెలియకుండా చద్ది తయారుచేయుట బ్రహ్మంగారు చూచి చిరునవ్వుతో పోలేరమ్మ మన యింటికివచ్చి ఆరగిస్తుందిలే అని పలికి, తర్వాత భోజన సమయాన పోలేరమ్మను ఆహ్వానిస్తే, ఆమె బాలికా రూపానవచ్చి బ్రహ్మంగారి కుటుంబంతో సహపంక్తి భోజనంచేసి వెళ్ళినదట సంకల్పమాత్రమున గ్రామదేవతలను తన అదుపు నందుంచున్న స్వామి మహామహిమ గలవారని విశ్వసించవలదా?

ఒకసారి పంచాననము వారు స్వామివారిని, వారి శిష్యులను ఎగతాళి చేయుటకు పుట్టెడు బియ్యం అన్నం వండించగా, స్వామివారు వారికి గర్వభంగం చేయదలచి, సిద్ధయ్యను పిలిచి, శిరమున చేయివుంచి, నిమిరి, ఆ పుట్టెడు అన్నమునుండి ఒక పిడికెడు మాత్రము తీసి, ఆ మొత్తము అన్నమును సిద్ధయ్య ఒక్కడే కణంలో తినే విధంగా తన మహిమను చూపించి, గరుశిష్యుల అనుబంధాన్ని ప్రకటించారు.

మరొకసారి కడప నవాబు తనకు సిద్ధయ్య సలాము చేయలేదని కోపించి, అడుగగా తాను వీరభట్టయ్యగారి శిష్యులమని, తాము నమస్కరిస్తే స్వామివారు మాత్రమే భరించగలరని యితరులకు అపాయము కలుగగలదని, అందుకు నిరూపణకు ఒక నల్లరాతి గుండును తెప్పించమని, ఆ రాతిగుండుకు నమస్కరించ గానే, ఆ నల్లరాతిగుండు ముక్కలుగా పగిలిపోవడం జరిగిందట. ఇదీ గురుశిష్యుల అనుబంధానికి మరో మచ్చుతునక.

తను లేకుండానే, స్వామివారు సమాధిలోకి వెళ్ళుటను జీర్ణించుకోలేకపోయిన సిద్ధయ్య సమాధి ఎదుట గండకత్తెరతో మెడ కత్తిరించుకుని మరణించడానికి సిద్ధ పడడం, అది తప్పిపోయి పద్మాసనాన కూర్చుండి పంచప్రాణములు సహస్రారానికిదెచ్చి సహస్రారము బేధించుటకు సిద్ధపడిన తన శిష్యుని సమాధి నుండియే పిలిచి, దర్శనమిచ్చి, స్వామి సిద్ధయ్యను అనుగ్రహించడం, సిద్ధయ్య గురుభక్తి ఎంత దీక్షకలిగినదో తెలియగలదు. తన పుత్రులకు కూడా దండము, ముద్రికనీయక తన శిష్యులకే వాటిని ధారాదత్తం చేయుట గురుశిష్యుల అనుబంధానికి మరొక ప్రతీక.

స్వామి ఈ జపసమాధిలోనికి వెళ్ళుముందు సిద్ధయ్య లేకుండా చేయుట, తరువాత సమాధినుండి లేచివచ్చి దర్శనమిచ్చుట అనునది సిద్ధయ్యయొక్క గురుభక్తిని పదిమందికి తేటతెల్లము చేయుటకేనని తెలియవలసివున్నది. అన్యులకు దక్కని ఆ స్వామి సాక్షాత్కారము సిద్ధయ్యకు కలుగుట ఆతని గురుభక్తికి ఒక నిదర్శనము కాదా! తన శిష్యులకుగానీ పుత్రులకు కానీ, యివ్వని విద్యలు, మంత్రములు, రహస్యములు తన శిష్యుడయిన సిద్ధయ్యకే యిచ్చుట స్వామివారి గురుఔదార్యమని గ్రహించవలయును

## కందిమల్లాయపాలెము - చింతచెట్టు

కందిమల్లాయపాలెం (కందిమల్లయపల్లె)లో గరిమిరెడ్డి అచ్చమ్మగారి యింటి ఆవరణలో, పదునాలుగువేల (14,000) కాలజ్ఞాన పత్రాలను పాతరయందు దాచి, పైన ఒక చింతచెట్టును నాటినట్లు తెలియుచున్నది. అది ఈ నాటికి అనగా సుమారుగా 600

సంవత్సరాలకు కూడా రెండు చీలికలు కలిగి, సుమారుగా 20 గజముల ఎత్తు కలిగి, గుబురుగా వుంటుంది. ఒక చిన్న గది వెడల్పు మాత్రమే కలిగివుంటుంది. ఆ గ్రామంలో ఏవైనా వ్యాధులు, మరేవైనా ప్రమాదాలు కలిగేముందు. సూచనగా ఆ చెట్టుకువున్న మొత్తం పూత ఒక్కరాత్రికే రాలిపోయి అశుభాన్ని సూచిస్తుంది. అటులనే ఈ చెట్టు చింతకాయలు లోపల నల్లగా బూజుతో కాటుక పడినట్లు, తినడానికి పనికిరాకుండా వుంటాయి. చెట్టు పంగనుండి ఎఱ్ఱని రక్తమువంటి ద్రవముకారి, గడ్డకట్టి కుంకుమలా వుంటుందట దాన్ని గమనించి ప్రజలు వ్యాధులు, ప్రమాదాలు నివారణకోసం జాగ్రత్తలు తీసుకుంటారు. బనగానపల్లెనందలి వృద్ధులందరూ ఆ చెట్టునుగూర్చి ఇదే వివరిస్తారు ఆ చెట్టుకు ఈనాటికినీ నిత్యదీపారాధన, ధూమము, నైవేద్య సమర్పణ జరుగుతూనే వుంటుంది ఈ 21 శతాబ్దంలో కూడా ఒక చెట్టు అలాంటి సూచనలివ్వటం, బ్రహ్మంగారి మహత్యానికి నిదర్శనమే మరి.

## కాలజ్ఞానం - సత్యం

ఎక్కడయినా ఏదయినా వింత జరిగితే "ఇది బ్రహ్మంగారు ఎప్పుడో చెప్పారు" అనటం పరిపాటి అంటే బ్రహ్మంగారి కాలజ్ఞానంలో చెప్పినవి చాలా జరిగినందు వలననే కదా ఇటువంటి ఒకమాట పుట్టడం జరిగింది. సుమారుగా బ్రహ్మంగారు 1517 సంవత్సరంలో బ్రహ్మంగారు కాలజ్ఞానం రాస్తున్నట్టు మనకు తెలియవచ్చింది అంటే 500 సంవత్సరాలు ముందే జరగబోవునవి చాలా మన పూర్వీకులకు తెలుసు అవి జరిగాయని మనకు యిప్పుడు తెలుస్తుంది. అయితే బ్రహ్మంగారు అన్నీ పూర్తిగా అర్థమయ్యేట్టు చెప్పారా? అంటే లేదు. ఎంతో నిగూఢంగా, గూఢార్థాలతో కూర్చి చెప్పారు. పైగా భాష కూడా, యిప్పటి మన వాడుకలోనిది కాదు. అర్థం చేసుకోవటానికి భాషా పరిజ్ఞానమే కాదు, భాషలో అఖండమైన పాండిత్యం కావాల్సి ఉంటుంది అందుకే మన జ్ఞానమునకు ఎంతవరకు అర్థమగునో అంతే అన్వయించుకుని అర్థం చేసుకోవటానికి ప్రయత్నించడమేకానీ, లేనిపోని. ప్రక్షిప్తాలతో కాలజ్ఞానాన్ని చెడగొట్టకుంటే అదే మేలు

1999లోనే కలియుగం అంతరించి పోతుందంటూ ప్రజల్ని భయపెట్టి స్వలాభాపేక్షతో లాభపడ్డవారు ఎందరులేరు. నేను కల్కి అవతారమని, నేను అవతార పురుషుణ్ణని, నేను వీరభోగవసంతరాయుడనని ఎంతమంది చెప్పలేదు. ఎంతమంది ఈ విధంగా జేబులు నింపుకోవడంలేదు. స్వామిగారు కాలజ్ఞానంలో చాలా మార్లు చెప్పారు. దొంగస్వాముల

గురించి. అందుకు భయపడవలసినది ఏమీలేదు స్వామివారు వీరభోగవసంతరాయలుగా రావడానికి ముందు జర్గే చిత్రాలు చెప్పారు. అందులకు యింకా సమయం ఆసన్నం కాలేదు! అయినా 1999లో ఏమైయింది సాధారణంగా గడచిపోలేదా! అతి సాధారణంగా గడచింది కదా.

కాలజ్ఞానంలో ఎప్పుడు ఏఏ సంవత్సరాల్లలో (Chronological Data) ఏమేమి జరిగాయని కాలాన్ని లెక్కవేసే బదులు, చెప్పినవి జరిగినవి ఎన్ని, యింకనూ జరగాల్సినవి ఏమిటి? అని ఆలోచిస్తే మంచిదేమో!

కాలజ్ఞానం చెప్పిన విషయాలన్నీ కలియుగాంతమున 5000 సంవత్సరాలు గడచిన తరువాత 108 సంవత్సరాల కాలవ్యవధిలో జరుగుతాయని శ్రీబ్రహ్మంగారు తెలియజేసి వున్నారు కదా! ఈ నూట ఎనిమిది సంవత్సరాల కాలంలో ప్రభవ, పార్థివనామ సంవత్సరములోనూ, మరలా 60 సంవత్సరాల అనంతరం వచ్చే ప్రభవ, పార్థివనామ సంవత్సరాలలో ప్రపంచస్థితి అల్లకల్లోలంగా వుంటుంది. వర్ణించనలవికాని పరిస్థితులు నెలకొని వుంటాయి ఈ శ్లోకాన్ని ఒకసారి పరిశీలించండి.

*శ్లో॥ ప్రభవా పార్థివా మధ్యే! బహుప్రళయం నిశ్చయం.*
*అనంతరే రక్తపాతౌ! రణరంగభూమౌ!॥*
*భీభత్సే ప్రపంచ స్థితి॥*

ఇందుకు ఋజువుగా మొదటి ప్రపంచయుద్ధం కాలజ్ఞానంలో పేర్కొన్న ప్రభవనామ సంవత్సరం 1927లో జరిగిందని చరిత్రాధారము పార్థివపేరుగల సంవత్సరం 1945లో వచ్చింది. అది 2వ ప్రపంచయుద్ధ సమయమయింది. తిరిగి ప్రభవనామ సంవత్సరం 1987లోనూ, పార్థివనామ సంవత్సరం 2005లోనూ వస్తుంటాయి. ఈ రెంటిమధ్య సరిగ్గా చూస్తే 1999 సంవత్సరం వుంటుంది కదా? అంటే 1987 - 2005 సంవత్సరాల మధ్య 1999 సంవత్సరం వుందని అదే సంవత్సరాన భయంకర పరిణామాలు జరగాలని ఎక్కడా లేదు కాలజ్ఞానంలో ప్రభవ పార్థివలనే చెప్పబడింది. ఆ మధ్యకాలమంతా అని శ్రీ బ్రహ్మంగారు ఎక్కడా చెప్పి ఉండలేదు అందుకే కాలగతి, నక్షత్రగతి ననుసరించి 1999లో జరిగే నష్టము లెక్కించదగినది కాదని విజ్ఞులయినవారు తేల్చిచెప్పారు. అట్లే ఆ చెప్పబడిన విపత్కర సంవత్సరాన ఏ విధమైన పెద్ద ప్రళయాలు కానీ, గొప్ప ఆపదలుకానీ సంభవింపలేదు

హిందూమతం నమ్మిన సత్యం ఒక్కటే కలియుగాంతాన ప్రళయం సంభవించి పాపాత్ములు నశిస్తారు. కొందరు పుణ్యాత్ములు మిగులుతారు. కృతయుగ త్రేతాయుగ ధర్మాలతో దేశం సుభిక్షంగా వుంటుందని. ఇతరమతాల్లు కూడా ప్రళయం సంభవమని అప్పుడు పాపుల్ని భగవంతుడు శిక్షించి, పుణ్యాత్ములకు యింకో లోకం చూపిస్తాడని, త్రలొక విధంగా నమ్మకం.

# శ్రీ స్వామివారు చెప్పిన భవిష్య వాక్యాలను ఒకసారి గమనిద్దాం

1. ఇచ్చిన సొమ్ములు తినేసి తప్పుడు ప్రమాణాలు చేయడం, గుడిలో దీపములనార్పి అసత్య ప్రమాణములు చేయుట మనం నిత్యం చూస్తూనేవున్న సత్యం కదా।
2. ముండమోపులు ముత్తయిదువు లవుతారు. వితంతు వివాహాలు చాలా ఎక్కువగా జరుగుతున్నాయి.
3. పుణ్యక్షేత్రాన అధర్మాలు. దర్శనానికి కూడా లంచాలిచ్చి వెళ్ళటం మనకు తెల్సిందే.
4. పుణ్యక్షేత్రాల్లో పాపాలు పెరుగుతాయి భగవంతునిమీద భక్తికన్నా విహార యాత్రగా రావడం. అనేక వ్యసనపదార్థాలు పుణ్యక్షేత్ర స్థలాల్లో లభించటం, నకిలీ ప్రసాదాలు దేవాలయాల వద్ద అమ్మటం మనకు తెలుసు.
5. అధికనిద్ర, అధిక ఆహారం. భోగలాలసత, రోగాలు పెరిగేను అని స్వామివాక్యం. వ్యసనాలవల్ల మితాహారం లేకుండా పోతుంది. అనేకరకాల తిండి వలన అనారోగ్యం, భోగలాలసత వలన, అనారోగ్యం కలగక తప్పదు.
6. శాంతవంతులు కోపిష్టులయ్యేరు. జరిగే అరాచకాలు, దుర్మార్గాలు భరించలేక ఎంత శాంత మూర్తులయినా కోపం తెచ్చుకోలేక వుండరు.
7. విప్రులు నీచుల నాశ్రయించి నశించేరు అన్ని మతాలలోను బ్రాహ్మణులు జేరి పోవటం మనకు తెలియనిది కాదు.
8. ప్రతివారూ సంకరులయ్యేరు. శూద్రులు అసత్యవాదులయ్యేరు. నీతి చెడి దరిద్రులయ్యేరు. జాతి సంకరమవటమనేది మన సాంఘిక, ఆర్థిక పరిస్థితుల ప్రభావమని మనకు తెలుసు. సంపాదన, ధనంకోసం సకల జాతులవారు అసత్యలాడటం మామూలే. కొట్లాటలు, హత్యలు ఎక్కువ అవటం మూలాన దరిద్రులుగా మారటం సహజ పరిణామమయింది.

9. తండ్రీకొడుకుల మధ్య కలహాలు, వావివరుసలు లేకుండాపోవడం.
విదేశ సంస్కృతి భారతీయ కుటుంబాలమీద చూపే ప్రభావాన ఆస్తిపంపకం వాటాలని తండ్రీకొడుకులకు స్పర్ధలు సహజమయిపోయాయి. ఐహిక సుఖాలకోసం వెంపర్లాడటం వలన వావి వరుసలు పాటించడం తగ్గిపోతుంది.

10. అడవి మృగాలు గ్రామాల్లోకి వచ్చేను.
ఒకవైపు అరణ్యాలను తెగనరుకుతూ పోతుంటే జంతువులు ఊళ్ళోకి రాకుండా ఎటుపోతాయి.

11. పంది కడుపున ఏనుగు పుట్టేను
కోదాడలో, భూపాలపట్టణంలో 1979, 1995లోనూ పంది కడుపున ఏనుగు అకారమున పిల్లలు పుట్టినట్లు పేపర్లలో చూసి వున్నాము.

12 కాశీపట్నం 40 రోజులు పాడుపడేను.
1912 సంవత్సరంలో గంగానది వరదలు, ఆ తర్వాత కలరావ్యాధి ప్రబలటం వలన కాశీ పట్టణమునకు యాత్రికులు రాకపోవటం జరిగింది.

13. రాచరికాలు నశించేను.
సర్దార్‌వల్లభాయ్‌పటేల్ గారి వలన సంస్థానాలన్నీ భారతప్రభుత్వంలో కలసిపోయి, రాచరికాలు పూర్తిగా అంతరించిపోయాయి. ప్రజాపాలన, ప్రజాప్రభుత్వాలు ఏర్పడ్డాయి.

14. శిలలు కండలు కక్కేను. ఆ కండలు తినడానికి వచ్చిన గ్రద్దలు చచ్చేను.
1945 సంవత్సరములో రెండవ ప్రపంచయుద్ధ సమయాన జపాన్‌లోని హిరోషిమా, నాగసాకీలపై అమెరికా అణుబాంబు వలన విపరీత జననష్టం, శవాలను తింటానికి వచ్చి పక్షి, జంతుజాలం చిత్రంగా నాశనమవడం జరిగింది.

15. ఒక అంబ 16 సంవత్సరాలు రాజ్యము ఏలేను.
శ్రీమతి ఇందిరాగాంధి 16 సంవత్సరాలు భారతదేశాన్ని పాలించారు.

16 ఆకాశాన ఎగిరివచ్చి పాలించేను.
విమానచోదకుడు రాజీవ్‌గాంధీ భారతప్రధానిగా ఉన్నారు.

17. ఉగ్రనరసింహుడు శాంతరూపాన పరిపాలించేను.
పాములపర్తి వెంకటనరసింహారావు గారు శాంతస్వభావులు. వారి 5 సంవత్సరముల పాలనను స్వామివారు తెలియజేశారు.

18 తెరమీది బొమ్మలు గద్దెలెక్కేరు. రంగుచూసి జనులు మోసపోయెదరు.
సినీనటులైన రామచంద్రన్, రామారావులు ముఖ్యమంత్రులయ్యారు.

19. రామత్రయం దక్షిణాన పాలించేను.
ఆంధ్రప్రదేశ్‌ను ఎన్.టి.రామారావు, తమిళనాడును ఎమ్ జి. రామచంద్రన్. కర్నాటకను రామకృష్ణ హెగ్డే పరిపాలించారు. అదీ ఒకే సమయములో.

20. మంచినీట దీపాలు పుట్టేను..
హైడ్రోఎలక్ట్రిసిటీ ద్వారానే మనం కరెంటును వినియోగించుకుంటున్నాము కదా. బ్రహ్మంగారు, షిరిడీ సాయిబాబాలు మంచినీటితో దీపాలు వెలిగించినట్లు వారి దివ్య చరిత్రలు పారాయణం చేసేవారికి తెలిసిన విషయాలే.

21. ఎఱ్ఱబోయీలు, శ్వేతముఖులు భరతఖండమేలేరు.
ఎఱ్ఱబోయీలంటే ఫ్రెంచివారు, శ్వేతముఖులంటే బ్రిటీష్‌వారు. క్రీ.శ.1600 సంవత్సరములో మనదేశము వచ్చి యిద్దరూ మనదేశాన్ని పాలించారు. ఇది చరిత్ర చెప్పిన రుజువే కదా!

22. గ్రంధి అనువాడు ఏకుబట్టి తరిమేను.
మోహన్‌దాస్ కరమ్‌చంద్ 'గాంధి' జన్మించి, ఖద్దరు వడకడం భారత సంస్కృతియని. స్వదేశీ వుద్యమం, అహింస, నిరాహార దీక్షలతో తుపాకీ పట్టకుండా, ఏకుపట్టి విదేశీయులను తరిమినారు.

23. మహ్మదీయుల మధ్య వైరముపుట్టి 7 ఏండ్లు అరక రగిలేను.
1980 నుండి 1987 వరకు ఇరాన్ ఇరాక్‌ల మధ్య యుద్ధం జరిగింది.

24. ఈశాన్యాన విషగాలి పుట్టేను. అందున కొందరు జచ్చేరు.
1984 డిసెంబరు నెలలో మధ్యప్రదేశ్ భోపాలునందు కర్మాగారమునుండి విషగాలి బయల్పడి, ప్రజలు వేలాదిగా మరణించడం జరిగింది.

25. చుండూరులో సుడిగాలిపుట్టి కొందరు కొట్టుకుచచ్చేరు.
అగ్రవర్ణాలు హరిజనులమధ్య చిన్న తగాదా పెద్దదయి, గ్రామం దారుణ హత్యలతో శ్మశానం అయింది.

26 పాంచాననము వారి వృత్తులు పోయేను. లక్షాపదకొండువేల అయ్యలు మరంలో గండ కత్తెరలు వేసుకుని చచ్చేరు.
భారతప్రధానిగానున్న మొరార్జీదేశాయి, గోల్డు కంట్రోలు పెట్టడంతో స్వర్ణకారుల వృత్తి దెబ్బతిన్నది. అనేకులు తిండికూడా గడవక మరణించడం జరిగింది

27. ధర్మాలు తప్పి తల్లిదండ్రులు స్త్రీలను విక్రయించేరు.
డబ్బుకు ఆశపడి కొందరు తమ పిల్లను అరబ్‌షేక్‌లకు అమ్మటం తెలిసిందే.

28. పాపాండ దర్శనం బహుళమయ్యేను.
నపుంసకులు ఎక్కువ కన్పించడం మనకు తెలుసు.

29. ఎఱ్ఱచీమ ఏనుగులా కన్పించేను.
క్లోనింగ్ ద్వారా చీమను ఏనుగంత చేయవచ్చునేమో. అన్నీ హైబ్రీడ్ రకాలేగదా చీమను మైక్రోస్కోపులో ఏనుగంతగా చూడవచ్చు కదా.

30. మనుజులతో మాయాశక్తి మాట్లాడేను.
గ్రామఫోన్లు, రేడియో, టెలిఫోన్, టేపురికార్డర్లు ఇవన్ని వాటికి సంబంధమున్నవే కదా.

31. మంచిబెల్లం చేదయ్యేను.
మంచి చెప్పిన ఎదుటివారికి చెవికెక్కదని, మోసానికో, స్వార్థానికో చెప్పారని పిస్తుంది మంచిమాట విషమవుతుందని చెప్పడానికి స్వామివారు ఇలా పద ప్రయోగం చేశారని తెలియవస్తుంది

32. ఇత్తడి బంగారమయ్యేను. బంగారం సీమలకు పోయేను.
ఇత్తడిమీద బంగారం నీరు పూతపూసి రోల్డ్‌గోల్డ్ నగలు తయారుచేయటమే ఈ ఇత్తడి బంగారమగుట మన మేధావులనే బంగారం, ఇక్కడ తావులేక విదేశాలకు అమ్ముడయి పోవడం మనకు తెల్సుకదా! అదే బంగారం సీమలకు చేరడం.

33 స్త్రీలు రచ్చకొట్టములలో రాచరికంబు జేసేరు.
స్త్రీలు పెద్ద పెద్ద ఉద్యోగాలు చేస్తున్నారు. పెద్ద హోదాల్లో వుంటున్నారు. మహిళా న్యాయామూర్తులు, కలెక్టర్లు, పోలీసు అధికారులుగా కొనసాగుతున్నారన్నది సత్యమే కదా!

34. పల్నాటిసీమలో కాకరపాదులో చింతకాయ కాచేను
గురజాలమండలం, దాచేపల్లి సమీపాన జరిగినది.

35. కృష్ణా, గోదావరుల మధ్య పశువులు, మృగాలు, మనుజులు అతిగా సమసెరు.
1977 నవంబరు 19 దివిఉప్పెన. 1996 నవంబరు 7 కోనసీమ ఉప్పెనలలో భారీగా నష్టం జరిగింది

36. మాచర్లలో రాజుమదవతిచే మడిసేను.
నాయకురాలు నాగమ్మ కారణాన బాలచంద్రుని మరణం. పల్నాడు నాశన మవడం తెలిసినదే కదా.

37. తిరుపతి వెంకటేశ్వరుని సముఖాన దొంగలు పడేరు.

ఇప్పటికి స్వామివారిధనం చాలాసార్లు అపహరించబడింది. 1996 డిసెంబరులో పరకామణిలో డబ్బులెక్కిస్తూ దొంగిలించబోయిన రామారావు పట్టుబడటం తెలిసినదే.

38. సూర్యుని మహిమలు కన్పించేను.

రవికిరణాల నుండి విద్యుత్ వుత్పత్తిచేసి నిలవచేసుకోవడం, సోలార్‌పానెల్స్, సోలార్ లైట్స్, సోలార్ కుక్కర్స్ అన్నీ సూర్యుని మహిమలు కన్పించడమేగా.

39. ఎద్దులు లేకనే బండ్లు నడిచేను. అందున కొందరు చచ్చేరు.

బస్సులు, కార్లు, రైలు, పడవలు, విమానాలు వీటికి ఎద్దు అనవసరం. విమాన ప్రమాదాల్లు, రైలు ప్రమాదాలు, కారు ఏక్సిడెంట్లు వీటివల్ల రోజూ మరణవార్తలు వింటూనే వున్నాము.

40. వేదాలు శూద్రులు చదువగా, బ్రాహ్మణులు వినేరు.

శూద్రులు కూడా వేదపాఠశాలలో చదవటం మనకుతెల్సు. స్వామి సుందరచైతన్య, సత్యసాయి వంటివారు బ్రాహ్మలుకార్లు అయినా వేదాలను కర్ణపుటాలకింపుగా వివరించి చెప్పగలరు. ఇదియే కాలజ్ఞాన సూచన.

41. తక్కువజాతులవారు ఆచారవంతులయ్యేరు

బ్రాహ్మనేతరులలో భక్తిభావం అధికమవడం, ఆచార వ్యవహారాల్లో వారికున్న పట్టింపు బ్రాహ్మణులలో కనిపించదు.

42. బ్రాహ్మణులు యితర జాతులను సేవించేరు.

ఉద్యోగార్థం ఏ కులస్థునితోనైనా, వారిక్రిందనైనా పనిచేయక తప్పని పరిస్థితి. కులవృత్తి వదిలిన తరువాత ఎవరికైనా పరజాతిసేవలే కదా!

43. జనసంఖ్య విపరీతమయ్యేను.

జనాభా నియంత్రణ అతి కష్టమైపోయి, విపరీతంగా జనాభా పెరిగిపోవటం మనకు తెలుసు.

44. వీధుల్లో శక్తులుద్భవించేను.

గ్రామగ్రామాన వీధి వీధికి అమ్మవారి విగ్రహాలు, పందిళ్ళువేసి పూజలు, వీధి వీధిన ఇట్లు శక్తులను పుట్టేట్లు చేస్తున్నారు.

45. ఒకరి ఆలి మరొకరి పాలయ్యేను.

నాగరికత హెచ్చుపెరిగిపోయి, క్లబ్బులు పట్టుకుని తిరిగి, మద్యపాన మత్తులో

జరిగేదేమిటో తెలీని స్థితిలో దొర్లిపోయేవి కొన్ని కావాలని భార్యలను మార్చుకునే వారు కొందరు విడాకులు పొందిన స్త్రీని వివాహం చేసుకుంటే అది కూడా ఒకరి భార్యను యింకొకరు చేసుకున్నట్లే అర్థం కదా!

46. ఆకాశాన పక్షివాహనాదులు కూలి అనేకులు మడిసేరు.
పక్షులు ఢీకొనడం వలన, యాంత్రిక లోపం వలన, పలుసార్లు విమానాలు కూలిపోవడం, అనేకులు మరణించడం తరచూ జరుగుతూనే వున్నాయి.

47. చాలామంది నోట కొరువులు కరుచుకు తిరిగేరు.
చుట్ట, బీడి, సిగరెట్ నోటియందుంచు కొనుటనే కొరివి నోట కరిచి అని స్వామివారు చెప్పారు.

48. నాగరికత పెరిగేను పులిమేక ఒకే రేవున నీరు త్రాగేను.
నిజంగానే నాగరికత అనూహ్యంగా పెరిగి, కులమత బేధాలు తగ్గి, హోటళ్ళు, భోజన హోటళ్ళులో, బీదగొప్ప తారతమ్యం లేకనే అందరూ ఒకేచోట భోజనం చేయడం, నీళ్ళు త్రాగటంలాంటి వాటిని బ్రహ్మంగారు యీ విధంగా సూచించారు.

49 మహారాష్ట్రమందు ప్రజలు మందలు మందలుగా చచ్చేరు.
కోయానా భూకంపం వలన ప్లేగువ్యాధి ప్రబలటం వలన ప్రజలు మందలుగా చనిపోయినది వాస్తవమే. ఇది 1994లో జరిగింది.

50. కందిమల్లాయపల్లె పన్నెండామడల పట్నమయ్యేను.
పూర్వము కందిమల్లయ్యపాలెం దర్శించిన వారికి కనిసం కాఫి కూడా లభించని పరిస్థితి. స్వామివారి వాక్యాన ఈ రోజు మండలకేంద్రమై, తెలుగుగంగ ప్రాజెక్టుకు అంకురార్పణ జరగటం, విద్యుద్దీపాలు, హోటళ్ళు అన్నీ వసతులు ఏర్పడ్డాయి.

51. కోనసీమలోన కలతలు పుట్టేను. వ్యాధులు ప్రబలేను.
కోనసీమలో తగాదాలనేవి సామాన్యమయినవే సంవత్సరం క్రితమే కడజాతివాడని శిరోముండనము చేయించారని పెద్దపెట్టున గొడవలు రేగాయి. ధన అధికారాలున్న చోట్ల, సుఖాలు వుంటుంటాయి ఆ సుఖాలు మితిమీరిపోతే సుఖవ్యాధులకు కొరతలేదు గదా!

52. విప్రాగ్రహారాలు నశించేను
అగ్రహారాలు, మాన్యాలు, జమిందారీలతోపాటె తరిగిపోయాయి.

53. బ్రాహ్మణులు పంచాంగ, పౌరహిత్యాలు విడిచేరు. వారి ముహూర్తాలు, ప్రశ్నలూ పారకపోయేను.
పంచాంగాలను బ్రాహ్మణులేకాక అన్ని కులాలవారూ గుణిస్తున్నారు. వాస్తు అందరి నోళ్ళలోనూ నానిపోతూనే వుంది. అలాగే ప్రశ్నజాతకం పెరిగిపోయి, అన్ని కులాలవారు దీన్ని అనుసరిస్తున్నారు. అటువంటప్పుడు బ్రాహ్మణుల స్థానమెద్ది.

54. వెంపలిచెట్లకు నిచ్చెనలు వేయువారొచ్చేరు
వెంపలిచెట్లు చిన్నవే అయినా వాటికే నిచ్చెనలు వేయడమంటే, మానవుల ప్రమాణం తగ్గిపోతుందని అర్థం నిజమే మన పూర్వీకుల శరీర ప్రమాణాలకు యిప్పటి మనతరం వారి మార్పు గమనించండి తేలికగా అర్థం అవుతుంది

55. వీధివీధినా వినాయకుడు మంత్రాలు చదివేను వీధుల్లో వలవలా ఏడ్చేను
వినాయకచవితికి ప్రతివీధిన పందిళ్ళు అందు వినాయక విగ్రహాలు. పందిళ్ళల్లో మైకులు పెట్టి మరీ మంత్రాలు చదవడం మనం చూస్తున్నదే.

56. హరిహరాదులు గుళ్ళల్లో పూజలు జరగకుండేను మూర్తుల కళలు తప్పేను
ఆంధ్రదేశమున పాడుబడిపోయి, శిథిలావస్థకుచేరి, ఆలనాపాలనాలేని గుళ్ళు లెక్క లేనన్ని వున్నాయి. దాతలిచ్చిన మాన్యాలు కౌలుదారుల పాలయిపోయి, దేవుళ్ళకు నైవేద్యంలేక, పూజారులకు ఆదరణకరువై, ఆలయాలు వదలిపోవడం, ఆలయాలు ఆలనాపాలనా లేక మూర్తులు కళలుపోయి వున్నాయి. నిత్యపూజా, దీపారాధనలు, నైవేద్యంలేని విగ్రహాలకు కళలు నిలవవని శాస్త్రము.

57. పలుగురాళ్ళు మెత్తని దూదులయ్యేను.
దైవకార్యాలల్లో విధించిన నియమాలు నిలవకుండా పోతున్నాయని బ్రహ్మంగారి ఉద్దేశ్యం. అయ్యప్పమాల, భవానీమాల, హనుమదీక్ష తీసుకున్నవారు, పూర్వం పూర్తి నియమనిష్టలు పాటించి దీక్ష పూర్తిచేసుకునేవారు. రానురాను ఈ నిబంధనలు వారికి వారే సడలించుకుని, వ్యసనాలను మానలేకపోతున్నారు. భయభక్తులు లోపించడమే దీనికి కారణం. నియమాలు కఠినంగా వుండేవి అంటే పలుగురాళ్ళంత కఠినంగా. యిప్పుడేమో అవన్నీ సడలిపోయి మెత్తగా దూదిలా అయిపోయాయి. ఇదే స్వామివారి వ్యాక్యకు అర్థం.

58. ఊరూరా ప్రజలు రచ్చకొట్లాటలవద్ద మొత్తుకొనేరు
ప్రస్తుతం మన ఆంధ్రదేశమున జరుగు ప్రజలవద్దకు పాలన, ఏ వూరియందు ప్రజలు

అవూరిలోనే నేతల దగ్గర తమ బాధలు చెప్పుకునే ఏర్పాటు ఈ ప్రభుత్వం చేసింది. అదే స్వామివారి మాట.

59. రాత్రి సమయములందు భూమి కదిలేను.
ఇప్పటివరకు భూమి కంపించటం అంటే భూకంపాలు రావటం. సూర్యాస్త మయంనుండి మరునాటి సూర్యోదయంలోపలే భూకంపాలు ఎక్కువగా సంభవిస్తున్నాయనటంలో సందేహం లేదు

60 నెత్తురు వాన కురియును
2001 సెప్టెంబరు నెలలో వర్షం ఎఱువురంగులో పడినట్లు పేపర్లలో చదివి యుండవచ్చును

61. పొట్టివాడయిన గట్టివాడొకడు రాజ్యాన్ని పాలించి కీర్తి పెంచేను.
లాల్‌బహదూర్‌శాస్త్రిగారు పొట్టివారయిన, దేశ కీర్తిని పెంచడం మనకు తెలిసినదె.

62. చిత్ర విచిత్ర వాహనాలు చేసేరు. మానవులు చంద్రలోకాన్నే చూచేరు.
మరి యీ రాకెట్లు, ఉపగ్రహాలు యివన్నీ చిత్రమైన వాహనాలే కదా. వీటిలోనే కదా మానవుడు చంద్రలోకంలో అడుగుపెట్టింది

63. రావణకాష్టమున కల్లోల మొకటి చెలరేగి దేశాన్ని కలవరపెట్టేను.
శ్రీలంకలో తీవ్రవాదులు ఎల్.టి.టి.యి గురించి స్వామివారు చెప్పివుండవచ్చు. వారు కల్లోలాల్ని సృష్టిస్తూనే వున్నారు కదా!

64. హైదరాబాదునందు తురక, హిందువులు ఒకర్నొకరు నరుక్కుని చచ్చేరు.
ఇది నిజమే కదా! ఎప్పుడు హైదరాబాదులో మతకలహాలుంటూనే వున్నాయి.

65. దానాలపేరుతో దోచుకునేవారు అధికమయ్యేరు.
ఎంతమంది రోజూ రశీదు పుస్తకాలు పట్టుకు గుడి కట్టటానికి చందాలవి తిరుగుతున్నారో మనం చూస్తూనే వున్నాము కదా!

66 చిత్ర విచిత్రమై యంత్రాలెన్నో భువిలోన విరివిగా వచ్చేను. సృష్టినే మార్చుటకు మానవుడు యత్నంబుచేసేను. కానీ చావుపుట్టుకలు మాత్రము తెలియకుండేను.
నిజమే ఎన్నో రకాలయిన యంత్రాల్ని మానవుడు కనిపెట్టగలిగాడు. రక్తమార్పిడికి (డయాలసిస్) యంత్రం, గుండె ఆపరేషన్ సమయాన రక్తప్రసరణకు గుండెలా పనిచేసే యంత్రం. E.C G యంత్రం, శరీరం లోపలి భాగాలను శబ్దతరంగాల ద్వారా

తెర మీద చూపించే యంత్రాలు. ఒక గదిలో కూర్చునే కొన్ని వేలమైళ్ళ దూరాన వున్న వస్తువులను నియంత్రించగలిగే యంత్రాలు యిన్ని కనిపెట్టినా చనిపోయిన వారిని బ్రతింకించడం మాత్రం చేయలేకపోతున్నాడు.

67. ముండమోసిన అడది కూడా పసుపుకుంకుమలు వాడేను. భర్త అన్న అర్థమే మారిపోయేను.

ఈ రోజున భర్త చనిపోయినా బొట్టు తీయనివాళ్ళు ఎందరో వున్నారు.. ఇది సత్యమే కదా! భర్తను ఎదిరించి మాట్లాడేవాళ్ళే ఈ సమాజంలో ఎక్కువ కన్పిస్తారు. పాతివ్రత్య గుణములు పాశ్చాత్యులవల్ల చాలావరకు తగ్గిపోయాయనే చెప్పాలి.

68. ఈతచెట్టొకటి పగటిపూటంతయూ నిలబడుండేను. రాత్రియగుసరికి భూమిపై పరుండి నిద్దురపోయేను.

రేపల్లె దగ్గరలోగల ఇసుకపల్లె యందు 1976 సంవత్సరమందు శ్రావణమాసాన ఈత చెట్టు ఒకటి పగలు నిలబడి రాత్రిపడుకుని వుండుట జరిగింది. ఇలా 8 రోజులు ఈ విధంగా వుండగా దేశంలో కరువు పుడుతుందని బ్రహ్మంగారి వాక్కు కానీ 1977లో అత్యవసర పరిస్థితిని భారతదేశమున ఇందిరాగాంధీ విధించుట గుర్తుంచు కోవలయును.

69 కార్యమపూడినందు కలహములు పెరిగేను ఎందరో జనులిచ్చట కొట్టుకొని పోయెదరు.

కార్యమపూడి ధర్మరణరంగాన వీరరక్తమే చిందెరా. పలనాటనాగులేరై పారెరా అన్నట్టు, బ్రహ్మనాయుడు, నాగమ్మలమధ్య పోరాటాన యిరుపక్షాల అతి క్షయము జరుగుట చరిత్ర చెప్పెడు సత్యము.

70 కందుకూరు నందు స్త్రీ పురుషుడయ్యేను పురుషులక్కరలేకయే స్త్రీలు బిడ్డల్ని కంటారు.

లింగమార్పిడితో చాలా ప్రదేశములలో స్త్రీ పురుషుడుగా, పురుషుడు స్త్రీగా మారిన దాఖలాలు వున్నాయి. పురుష సంపర్కం లేకుండానే టెస్ట్ ట్యూబ్ బేబీలు కలగటం మనం పేపర్లలో చూస్తూనే వున్నాము.

71. గుంటూరుజిల్లా పాలసగ్రామంలో మరియూ కృష్ణాజిల్లా మచిలీపట్నంలోని హిందూ కాలేజిలో వేపచెట్టు నుండి తీయని పాలు కారినట్టు యిప్పటికీ ప్రజలు చెప్పుకుంటుంటారు. యిది 1989 మార్చి నెలలో జరిగినది.

72. మద్రాసు నగరంలో ఒక బ్రాహ్మణుని యింట 7 సంవత్సరముల బాలిక బిడ్డను కని మరణించింది ఇది 1980 ఫిబ్రవరి నెల 5వ తారీఖు సరిగా 11 రోజులకు అంటే ఫిబ్రవరి 16 తారీఖున సంపూర్ణ సూర్యగ్రహణం ఆ రోజు పట్టపగలే నక్షత్రాలు కనిపించాయి.

73 అన్నదమ్ములు, అక్క చెల్లెళ్ళు, తల్లిదండ్రులు, గురుశిష్యులు, బంధుమిత్రులు ఒకరినొకరు మోసగించుకొని బ్రతికేరు

స్వార్ధం పెచ్చుపెరిగి ఎవరి బ్రతుకులువాళ్ళు వెళ్ళబుచ్చుకొవటానికి బంధుత్వాలు, రక్తసంబంధాలు మరచిపోతారు. అదే విపరీతం. మోసంతోనైనా కార్యాలు సాధించుకోవడం, అవసరాలు తీర్చుకోవడం ప్రస్తుత సాంఘీక లక్షణం.

74 ఉత్తరదేశాన కత్తులు ఆడేను. భూమిల్లో ఓంకారము పలికేను.

ఉత్తరభారతదేశమున అందునా ముంబాయినందు మతకల్లోలాలు, గాంగ్‌వార్స్ సర్వసాధారణం. ముంబాయి, ఢిల్లీలలో భూకంపాలు తరచుగా వచ్చినట్లు పేపర్లలో చూస్తుంటాము అదే భూమినుండి వచ్చే ఓంకార శబ్దము.

75. ప్రకృతి ధర్మాలు తల్లకిందులయ్యేను. వేళకు వానలు రాకుండేను. పైరు పచ్చలు పెరగకుండేను.

అడవులు నరికివేయటం వలన, వాతావరణంలో పెనుమార్పులు. కొండలు పగులగొట్టడం వలన వానలు సకాలంలో కురియకపోవడం. వర్షాభావం వలన పైరులు పెరగక, పంటలు పండవు.

76. సూర్యుడు గడగడ వణికేను.

1980 సంవత్సరం ఫిబ్రవరిలో వచ్చిన సూర్యగ్రహణ సమయాన సూర్యుడు 14 సెకండ్లపాటు చలించినట్లు ఒరిస్సాలో కోణార్క దేవలయంవద్ద నమోదు చేయబడింది. మరలా 1995 అక్టోబరులో కూడా యిదే విధంగా జరిగినట్లు పత్రికలు పేర్కొన్నాయి

77 దేవస్థానాలు పాపాత్ములచే త్రవ్వబడినాశనమయ్యేను. దేవతా విగ్రహాలు దొంగల పాయ్యేను

ఇది మనదేశంలో జరుగుతున్నదని మనకు స్పష్టంగా తెలుస్తూనే వుంది.

దేవాలయములలో విగ్రహాలక్రింద నిధులుంటాయనే ఒక భ్రమతో దేవాలయాలను త్రవ్విన సంఘటనలు కోకొల్లలు. మహ్మదీయుల పరిపాలనలో ఎన్ని దేవాలయాలు ధ్వంసంఅయినవో చరిత్రసాక్ష్యం. అలాగే పురాతన విగ్రహాలకు విదేశాల్లోవున్న గిరాకీ వలన యిప్పటికి విగ్రహాలు దొంగిలిస్తూనే వున్నారు.

78. లింగమయ్య నిజరూపం చూపేను.

శ్రీకాకుళంజిల్లా పాలకొండలో సింహాద్రి విశ్వనాధ అవధూత అను స్వామివారు 1854లో అవతరించారు. చెన్నపట్టణంలో (మద్రాసు) ఆయన తన ఫాలనేత్రాన్ని చూపారని అందరూ అంటుంటారు. ఈయన పరమశివులని ప్రజలంతా తలుస్తారు. సనారి విశ్వేశ్వర స్వామిగా వీరు ప్రసిద్ధులు.

79. పాడిపంటలు తరిగిపోయేను.

గృహనిర్మాణ రంగం బాగా అభివృద్ధి చెందటం వలన పంటపొలాలను కూడా యిళ్ళ స్థలాలుగాచేసి విక్రయించడం మనకు తెలుసు. వ్యవసాయంకన్నా యీ విధంగా యిళ్ళ స్థలాలు ఎంతో లాభసాటి వ్యాపారంకాగా, ముందు చూపులేక పంటపొలాలను ఇండ్ల స్థలాలుగా అమ్మేయటం జరుగుతుంది.

80. ధాన్యము కొలతలు మాసి గింజలు లెక్కకొచ్చేను.

ఈవిధంగా పంటభూములను వ్యాపార నిమిత్తం ఇళ్ళలా అమ్మేసుకుంటే పంటలు తగ్గి తూనికలు, శేర్లు లెక్కలలో ఎక్కడ లభిస్తాయి. అందుకే బియ్యపు గింజలు లెక్కపెట్టి అమ్మే రోజు వస్తుందని స్వామివారి మాట.

81. ఆంధ్రదేశమునందు కపటయోగులు అధికముగా పెరుగుట చూసేరు. పీఠాధిపతులకు పేరు లేకుండేను. బడాయి బాబాలకు ఎత్తుపీటలు వేసేరు.

నిత్యమూ మనము పేపర్లలో చూస్తున్నదే. దొంగబాబాలను గుర్తించి ప్రజలు అభియోగము తెస్తే, పోలీసుల అరెస్టు అనే వార్తలు, ఎంతగొప్పగా వెలిగారో అంతే త్వరగా బండారం బయటపడి శిక్షలు అనుభవిస్తున్నారు.

82. కోడిపుంజు పెట్టగా మారేను. కోడిపెట్ట పుంజుగా మారేను.

ఇక్కడ పుంజు-పెట్ట అనేవి పురుష-స్త్రీ బేధమును తెలుపుటకు స్వామివారు వాడిన పదాలు అని తలిస్తే, లింగమార్పిడులు జరిగి స్వామివారి మాట నిజమయింది కదా!

83. 1964 సంవత్సరములో మేకకు 5 తలల పిల్ల పుట్టినదని, ఆవు కడుపునందలి దూడ

కడుపులో వుండగానే కన్పించిందని, ఆ దూడ మనిషి రూపంలో వుందని దినపత్రికల్లో ప్రచురితమయ్యాయి. ఇది విశాఖపట్టణం దగ్గర అనకాపల్లి యందు జరిగినదట.

84. తూర్పున ధూమకేతుబుట్టి రానున్న ప్రళయాలను సూచించేను

1987 మార్చిలో తూర్పుదిక్కున 'హీలీ' తోకచుక్కను కనుగొన్నారు. యిది తిరుపతికి తూర్పున కలిగినది. ప్రభవ, పార్థవనామ సంవత్సరాల మధ్య రాబోయే మూడవ ప్రపంచయుద్ధ సూచకమా? అని తలంచాల్సి వస్తుంది.

85. బ్రాహ్మణులు లేకనే కార్యాలు జరిగేను.

నిజంగానే ముందుగా రికార్డు చేయబడిన కేసెట్ల ద్వారా శుభకార్యాలన్నీ జరిగి పోవటం మనకుతెల్సు. దేవబ్రాహ్మణులు, శిల్పబ్రాహ్మణులు, కమ్మబ్రాహ్మణులు వీరిండ్లలో వారే మంత్రోచ్ఛారణలు చేసుకొంటున్నారు. రిజిష్టర్డ్ వివాహానికి బ్రాహ్మణులతో పనేముంది.

86. బెజవాడ గోలకొండంత పట్నమయ్యేను.

ఈరోజు విజయవాడ ఎంతగా అభివృద్ధి చెందిందో వూహించడం కష్టం. బహుశా స్వామివారు గోలుకొండ దర్శించినపుడు అంతపెద్దగా వుండేదేమో.

87. విచిత్రవ్యాధులుపుట్టి ఎక్కడివారక్కడే మరణించేరు.

ఈరోజుల్లో వస్తున్న జ్వరాలు అలా వున్నాయి. బ్రెయిన్‌ఫీవర్, హార్ట్‌ఎటాక్ లాంటివి వచ్చిన వెంటనే మరణాలు సంభవించిన దాఖలాలు అనేకం. విషవాయువుల ప్రభావం వలన మారుమాట్లాడకుండా ఎక్కడివారక్కడే మరణించడం వినం లేదా! వీటికి మందు తీసుకునే వ్యవధి కూడా వుండదు కదా!

88. ఆచారాలు అడుగంటేను.

అవును. ఆచారాలు యిప్పటికే మచ్చుకైనా కానరావటంలేదు. చెప్పులు వేసుకునే యిళ్ళల్లో తిరగటం. ఇళ్ళల్లోనే పాదరక్షలతో డైనింగ్ టేబుల్‌మీద భోజనాలు అనేవి మామూలయిపోయాయి. ఇది అతి నాగరికత. అరువు తెచ్చుకున్న సంస్కృతి.

89. మానవులు అడుగుకు ఏడడుగులుగా నడిచేరు.

అంటే, ఈ నాగరిక ప్రపంచంలో అంతా వేగమే. ప్రతిది వేగంగా చేయలేనిది కాలమున సరిపోదు. ముంబాయిలో ఉద్యోగంకోసం సుమారు 250 మైళ్ళ దూరం నుండి (పూనా) తెల్లవారుఝామున బయలుదేరి 11-12 గంటలకు యింటికి చేరేటటువంటి వ్యక్తులు మనకు తెల్సు. ఇదే స్పీడ్‌యుగం. ఇదే స్వామివారు చెప్పిన అడుగుకు ఏడడుగులు అనే దానికి అర్థం.

90. గోతికి పట్నమంతమందిని పూడ్చేరు. కుప్పలుగా తగులబెట్టేరు. కుక్కలు నక్కలు చచ్చేను. మానవులకు మొక్కేను. జనులు దిక్కులేని చావులు చచ్చేరు. స్త్రీలు నీళ్ళలోనే జోలలు పాడేరు.

దివిసీమ వుప్పెన, మొన్నటి కోనసీమ వుప్పెనలలో ప్రజల యిక్కట్లు మరణించిన వారిని పూడ్చుడానికి స్థలంలేక, దహనానికి వీలులేక కుక్కలు, నక్కలు తినగా మిగిలిన కళేబరాలను ఒకే గోతిలో పూడ్చుడం సామూహిక దహనకాండ జరపడం మనం పేపర్లలో చదివినదే. అర్ధరాత్రి వచ్చిన ఉప్పెనలో స్త్రీలు ప్రసవించడం, ఆ నీళ్ళలో, వరదల్లోనే తల్లులు పిల్లలకు ఆలనాపాలన చూడడం స్వామివారు వివరించారు.

ఈ విధంగా స్వామివారి కాలజ్ఞానాన ఎన్నో నిజాలు మనకు తెల్సు. ఇంకా వారు చెప్పినవి చాలా వరకు 1999 నుండి 2016 వరకు ఎక్కువగా జరిగే అవకాశమున్నదని పెద్దలమాట. ఇందు చెప్పినవన్నియూ స్వామివారు చెప్పినవే.

*ఓం హ్రీం క్లీం శ్రీం శివాయ వీరబ్రహ్మణే నమః*



